# పరిచయము

శ్రీ వేంకటరాయశర్మగారు చిరప్రసిద్ధిగల పరిశోధకులు. వారి వ్యాసంగము తడవిచూడని శాఖ లేదంటే అతిశయోక్తి కాదు. తెలుగు దేశములో చిరకాలముగా ఆంధ్ర సారస్వత పరిషత్తునూ, ఆ పరిషత్సభలనూ అసహాయశూరులై నిర్వహిస్తూ వాఙ్మయసేవయే జీవనముగా గడిపే నిరాడంబరులు వారు. జాతీయ ప్రభుత్వమువారు వారు చేస్తూన్న సేవను గుర్తించి ఉపకారవేతనము నిస్తున్నారనడమే వారి ఉన్నతకృషికి నిదర్శనము.

"చరిత్ర పరిశోధకులు" అన్న చిన్న పేరును పెట్టుకున్ననూ, ఈ పుస్తకము వాస్తవముగా చారిత్రిక, సాంస్కృతిక పరిశోధకులు పదముగ్గురి కథలను యిముడ్చుకున్న గ్రంథము. జీవిత విశేషములూ, పరిశోధనా విషయములూ, ప్రబోధ వాక్యములూ చేరి యీ గాథలను పఠనాశక్తి పోషకములుగా తయారుచేసినవి. ఈనాటి యువకులకు పరిచయము లేని ఆర్యభట్టు, కల్హణుడు, మెకన్జీ, బ్రౌన్‌ల జీవితాలను కూడ అతిసామాన్యశైలిలో అందించే యీ పుస్తకముయొక్క విలువను వేరే చెప్పనక్కరలేదు. యువకులందరీ జీవిత చరిత్రలను పఠించి పరిశోధనాసక్తులయ్యెదరుగాక !

నెల్లూరు,
12—12—59.

డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, ఎం.ఏ.,
(ప్రిన్సిపల్, గవర్నమెంటు ట్రైనింగు కాలేజి.)

# అభిప్రాయములు

శ్రీ కోన వేంకటరాయశర్మగారికి :

నమస్కారములు.

తాము దయతో నొసంగిన "చరిత్ర పరిశోధకులు" చదివినాను. భారతీయులు - ముఖ్యముగా ఆంధ్రులు - స్మరణములో నుంచుకొనవలసిన విషయములను, యువ చారిత్రక విమర్శక పరిశోధకులకు స్ఫూర్త్యుత్సాహముల నీయఁగల యంశములను జక్కగా మీ సహజ మనోరంజక పద్ధతిలో క్రోడీకరించినారు. ఈ పుస్తకములోను, వెనుకటి యనేక గ్రంథములలోను, పత్రికలలోను. మీరు వెల యించిన చరిత్ర పరిశోధనలను జదివిన నావంటివారికి మీ జీవిత చరిత్రకూడ "చరిత్ర పరిశోధకులు" అను గ్రంథము లోనికిఁ జేరవలసినదే యనిపించును. కాని యీ గ్రంథకర్తలు మీరే యగుటచే నది పొసఁగలేదు. మఱియొక రట్టి పని చేయుదురుగాక !

18—11—59.
సత్యనారాయణపురము,
విజయవాడ-2.

జటావల్లభుల పురుషోత్తము, ఎం. ఏ.,
లెక్చరరు, సంస్కృతభాష,
S. R. R. & C. V. R. గవర్నమెంటు కాలేజి.

# వక్తవ్యాంశము

మన సభ్యత – మన సంస్కృతి – హిమవన్నగ మెంత ప్రాచీనమైనదో అంతటి ప్రాచీనమైనవి. అనఁగాఁ బరిగణనము నకు సాధ్యముగాని వేదకాలము నాఁటిది మన సభ్యత – మన సంస్కృతి. చరిత్ర లేని జాతికి గౌరవము లేదు. చైతన్యము లేదు. సంస్కృతి లేదు. సభ్యత లేదు.

మన క్రాంత దర్శకుల దృక్పథము ననుసరించి పురుష కారమునకు సంబంధించిన భావము ప్రముఖమైనది. పురుష కారమునకును – భూమికిని – గల యనుబంధమును

"అహామస్మి సహామాన
ఉత్తరో నామ భూమ్యామ్ ।
అభిశా దస్మి విశ్వాసద్
ఆశామాశామ్ విశాసహి."

అను వాక్యము విస్పష్ట మొనర్చుచుండుటవలన మన మీ సంస్కృతికి సభ్యతకు జ్ఞాతుల మని, వారసుల మని, తెలియఁ దగియున్నది. "అహం బ్రహ్మాస్మి" యను వాక్యమును మనమే యుచ్చరించుచుందుము. ఇతరు లీ సాహసమును జూపరు. ఈ చొరవ మన ఋష్యాదులకు మాత్రమే కలదు. అమ్మహనీయు లొసంగిన రత్నమయ పేటిక యిది.

ఇప్పురుషకారమును సాధనఁ జేసి, సేకరించి, జాగరూకతతో దైవానుకూలత నపేక్షించి, ప్రతీక్షించు నెడ నాత్మకృతమ్ములగు విపత్తులు ఘటిల్లవని

"యత్నేన సంపాద్య మనుష్యకారం
యత్నాపకాశే పురుషోనిరుంధే ।
ప్రతీక్షతే దైవ మతింద్రతోయః
తమాపదో నాత్మకృతా స్పృశంతి."

అను వరాహ మిహిరాచార్యుని వచన మవగత మొనర్చు చున్నది. కావుననే దైవానుకూలతను గమనించియే పురుష కారమును జరపవలయునని

"సర్వేషాం పూర్వ మారంభాత్
చింతయే న్నయ పూర్వకమ్ ।
ఆత్మశక్తి ముపాయాంశ్చ
దేశకాలేచ యుక్తతః ।
కరణాని ప్రయాసంచ
ప్రక్షేపంచ ఫలోదయం ।
ఏవ మా దీని సంచింత్య
దృష్ట్యా దైవానుకూలతాం ।
అతః పరం సమారంభేత్
యాత్రాత్మ హిత మీ హితమ్."

అను "మహాభారత" మందలి యుపదేశ వాక్యము విదితము సేయుచున్నది. కావున యీ రత్నపేటికను భద్రపఱచుకొని మన సభ్యతను – సంస్కృతిని – గమనించి ప్రవర్తించుటయే దేశకళ్యాణమునకు, దేశాభ్యుదయమునకుఁ, ప్రథమ సోపానము మనల నుత్తేజపఱచి దేశకళ్యాణమునకయి సర్వవిధముల మన సర్వస్వమును బణమొడ్డు నట్లొనర్చునది దేశ చరిత్ర.

దేశము కొఱకు ధనమును, శరీర మాన ప్రాణములను, ఆహూతి యొనర్చిన మన పూర్వులపట్ల భక్తి విశ్వాసములను, గౌరవ ప్రపత్తులను గలుగఁజేయునది దేశ చరిత్ర.

పూర్వము మన వారేయే ఘనకార్యములఁ గావించి దేశమునకు వైభవమును విఖ్యాతినిఁ దెచ్చినారో, ఏయే

లోటుపాటుల నొనర్చి దేశమును జాతిని అధోగతికిఁ బోనిచ్చిరో, తెలియఁజేయు భారమితియే దేశ చరిత్ర. సవ్యమైన యథార్థమైన చరిత్ర ప్రజలలో విజ్ఞాన వికాసములను బలదర్పములను గలిగించుటయే గాక జీవనోపాధికిని దారిఁ జూపఁగలదు.

చరిత్ర వ్రాయుట పవిత్ర కార్యమే యయ్యును అసిధారా వ్రతము వంటిది. కాలనిర్ణయము సేయుటలోను, సందర్భశుద్ధిలోను, విషయ గౌరవమునందును, భాషా మర్యాదలఁ బాటించుటలోను, యితివృత్తము నెన్నికొనుటలోను, మన సంప్రదాయములఁ, దీరుతీయములఁ, గమనింపకుండిన అపహాస్యమునఁ బడవలసియుండును.

ఈ విషయముల నన్నింటిని హృద్గత మొనర్చికొనియే గ్రంథరచనమునకు దొరఁకొంటిని. నే నగపఱచిన చొలవ, తెంపు, యీ సాధన సామగ్రికిఁ, గృషికిఁ, దార్కాణమని చెప్పఁగలను.

నేటి యువకు లీ రత్నపేటికను సర్వతో భద్రముగ నుంచికొని తద్విషయ గౌరవాదులను, సౌలభ్య సౌకుమార్య సౌశీల్యాదులను, గమనించి యుద్దిష్ట ప్రతిపత్తి నందుదురు గావుత మని తలంచుచున్నాఁడను.

నాగేశ్వరపురము,
బాపట్ల.
9—12—59.

ఇట్లు విన్నవించు,
కోన వేంకటరాయశర్మ,
(విమర్శకశిరోమణి, సాహిత్య విశారద)

# విషయసూచిక

# మన చరిత్ర పరిశోధకులు

## పాహియాన్

ధర్మముకొఱకు, జ్ఞానముకొఱకుఁ, దత్త్వాన్వేషణకు, ధన మన ప్రాణములఁ దృణప్రాయంబుగ నర్పించి పడరాని పాట్లుబడి కార్యసిద్ధి నందినవారు సకృత్తుగ నున్నారు. అట్టి వారిలో "పాహియాన్" యొకఁడు. ఇతఁడు బుద్ధమతావలంబి యయ్యును భారతవర్షమునకు విచ్చేసి హైందవ విజ్ఞాన ధనమును సేకరించి పదిలముగఁ జీనాదేశమునకుఁ గొంపోయిన పుంభాఘ్రుఁడు. చీనాదేశమున జన్మించి, బుద్ధభగవానుని జన్మస్థానమైన భారతదేశమునకు వచ్చి, బౌద్ధవిజ్ఞాన నిధులను స్వాయత్త మొనర్చికొని ధన్యులగుటకుఁ బ్రయత్నించి కృతకృత్యు లయిన వారిలో నితఁ డొకఁ డని చెప్పవచ్చును.

ఇతఁడు క్రీ. శ. 370 దవ సంవత్సరమున చీనా దేశమందలి "ఉయాంగ్" అను నగరమ్మున 'కంగ్' వంశమున జన్మించినాఁడు గాని "పాంగన్" నగరమందె యితఁడు దన జీవితమును జాలభాగము గడపినాఁడు. ఈయన తలిదండ్రుల కితఁడు నాల్గవ కుమారుఁడు. ఇతఁడు జన్మించిన మూఁడేండ్లకే యితని యగ్రజులు మూవురును జనిపోవుటచే నీయన తండ్రి యీ పిల్లవాఁ డయ్యును దక్కనఁజాలు నని తలఁచి యీతనిని బౌద్ధమఠమున నొకదానికి సమర్పించినాఁడు.

అ ట్లీతఁడు బౌద్ధమతమునకు సమర్పింపఁబడిన వెనుక కతిపయ దినంబులకుఁ దలిదండ్రులకుఁ బుత్త్రప్రేమ యధికమై తట్టుకొనఁజాలక పరితపింపఁ జొచ్చిరి. కాఁగా, నితని తండ్రి బౌద్ధమతమునకుఁ బోయి త దధిపతికిఁ దన యావేదనను దెలియఁజేసి యాయనను దన యింటికిఁ గొనివచ్చి ముద్దుమురి పెములతోఁ బెంచు చుండఁగా దా నొకటి తలఁచిన దైవము వే ఱొండుఁదలఁచె నన్నయట్లు ఈయన ప్రబలవ్యాధిగ్రస్థుఁడై నాఁడునాఁటికి ప్రాణాపాయ స్థితియందుఁ బడు చుండెను. ఈ స్థితిఁ జూచి యాయన తండ్రి "వీనిని బౌద్ధమతము నందె యప్పగించుట దైవసంకల్ప మేమో! కానిండు. అట్లఁ గావింతు"నని తలఁచినవెంటనే వీనిం గొనిపోయి బౌద్ధమతమున కప్పగించెను. అప్పగించిన మఱుక్షణము నుండియె ఈయనకు స్వాస్థ్యము సేకూఱ నారంభించెను. ఆవల నీయన తలిదండ్రు లీయనను దీసికొని రాఁ బ్రయత్నించిరి. కాని యందుల కితఁ డిష్టపడఁ డయ్యెను. కాఁగా, నీయనకుఁ బదేండ్లు వచ్చు నప్పటికి ఈయనతండ్రి చనిపోయెను. ఇఁక నీతని తల్లి దిక్కులేని దయ్యెను. ఆమె మూవుర కొమాళ్ళను గోల్పోయి భర్తృ వియోగ జ్వాలాదందహ్యమాన యై కడగొట్టు బిడ్డ యైన 'ఫాహియాన్'ను బౌద్ధసంఘమునకు సమర్పించినది. ఈమె దైన్యస్థితిని మాతులునిచే వినియున్నను అతఁడు తాత్త్విక దృక్పథమును వీడలేదు. అణుమాత్ర మేనిఁ జలింపలేదు. బౌద్ధ దీక్షను విడనాడి మాతృసేవాపరాయణుఁడు గాలేదు. అతని గాఢవైరాగ్య దీక్ష యట్టిది. ఆవలఁ గతిపయ దివసంబులకు

నాతని తల్లియు మరణించినది. ఆమె మరణించిన తర్వాత ఫాహియాన్ మనసు మాతృభక్తిపుంభావ మైనది. వెంటనే యతఁ డింటికి వచ్చి మాతృమూర్తికిఁ జేయ వలసిన యంత్య సంస్కారము లొనర్చి మేరుగంభీర హృదయ ముతో మరల బౌద్ధమతమునఁ బ్రవేశించి బౌద్ధమత దీక్షతో గాలము గడపు చుండెను. పెక్కు ఘనకార్యములఁ జేసి గొప్ప యాత్రికుఁడుఁగాఁ బేర్వడసి ప్రజలకు ఆదర్శ ప్రాయుఁడు గా వలసిన వ్యక్తియందుఁ ద్యాగవైరాగ్యములు, జ్ఞాన బలైశ్వర్యములు, ధైర్యస్థైర్యములు, — కలిగి యుండు టలో నాశ్చర్య మేమి ?

ఇతఁ డొకసారి బౌద్ధసన్న్యాసులతోఁ గూడఁ బంట చేనిలోని పైరును గోయు చుండఁగా, నొక దొంగల గుంపు ఆ భిక్షుకుల నెల్ల ముట్టడించిరి. కాఁగా, ఆ భిక్షుకు లందఱు గుండె దిటవు లేక తటపటాయించి పలాయన మంత్రమును బఠించిరి. కాని "ఫాహియాన్" మాత్రము ప్రాణముల లెక్కఁగొనక ఆ దొంగలను జూచి "మి మ్మీ పనికిఁ బ్రేరే చిన మీ దారిద్ర్యమునకు నెంతయు వగచు చున్నాను. ఈ పంటలో మీకు వలసినంత వఱకుఁ దీసికొని పోవచ్చును. కాని మీ రే జన్మమున నెవ్వరిని నాదరించినవారు కారు. అంతియ కాక పెక్కు భంగుల నపకారములు గూడఁ జేసి యుందురు. ఆ దుష్కర్మల ఫలమే మిమ్ము దరిద్రులఁ గావించి చౌర్యమునకుఁ గూడఁ బ్రేరేచినది. కావుటం జేసి మీకు సద్గోగతి తప్పదు. కాఁబట్టి యిఁక నైనను బుద్ధిఁ దెచ్చి

కొని సత్కర్మల నొసర్పు" డని ప్రబోధ మొసర్చి నంతనే వా రందఱకు జ్ఞానోదయ మై యా నాఁటినుండి వారి జీవితమున మార్పుఁ దటస్థించి యుద్ధరింపఁ బడిరి. ఈ సంఘ టనతో "పాహియాన్" ఘనత చీనా దేశము సం దంతటను వ్యాపించినది.

'షాంగన్' నగర బౌద్ధమఠమున శిక్షణను బూర్తి యొనర్చిన తర్వాత 'పాహియాన్' వినయపిటకాది బౌద్ధమత మూలగ్రంథములను సేకరింప వలయు ననియు, బుద్ధుని జన్మ దేశ మగు భారత దేశమును వీక్షింప వలయు ననియు, నుద్దే శించి క్రీ. శ. 399 దవ సంవత్సరమునఁ దన మిత్త్రులతోఁ గూడ నడక సాఁగించెను. ఆ కాలమున గాశియాత్ర చేయు టయే దుస్తర మై యుండ గిరిగహ్వరముల, నదీనదముల, మహారణ్యముల, నతిక్రమించి దూర దేశముల కేఁగుట యన్న సామాన్యమా ? అయినను సంకల్పసిద్ధులకు — ధీరోదాత్తు లకు — సాధ్యాసాధ్యములు గుణాగుణములు పరిగణనమున నుండవు గదా ! అప్పటి కీయన వయసు పంచవింశ ద్వర్ష ములు మాత్రమే !

చీనా భారత దేశములమధ్య భయంకరమును నిర్జల మును నగు 'గోబీ' యెడారి కలదు. దుష్టమృగములు నివ సించు కాఱడవులు, దాఁట నలవిగాని సెలయేళ్లు, కలవు. శీతాతప వాతములు సరిపడ కున్నను ఆ జేండ్లు రేయుం బవలు ప్రయాణించి పాహియాన్ భారత దేశమునకు వచ్చినాఁడు. భారత దేశమును జేరునప్పుడే కాందహారము, కోసలము,

కన్యాకుబ్జము, ఉజ్జయిని, లోనగు ప్రదేశంబులఁ దిలకించుచు నందలి వింతల, విశేషముల, సంగ్రహించెను. ఇతఁడు భారత దేశములో నాజేం డ్లుండి పాళి సంస్కృతముల నధ్యయన మొనర్చి బౌద్ధగ్రంథములఁ బఠించి యందలి విజ్ఞాన మంతను గరతలామలక మొనర్చికొనియెను. ఇతని "భారతదేశ యాత్ర" విశేషము లా నాఁటి భారతీయచరిత్రను సాక్షాత్కరింపఁ జేయు చుండును. క్రీస్తుశకము ఐఁదవ శతాబ్దపు భారత దేశ చరిత్రను సింహళదేశ చరిత్రను దెలిసికొనుట కితని పర్యటనానుభవము లెంతయో యుపయోగపడు చున్నవి. జైల్స్, వెగ్గీ ప్రభృతి చరిత్రాభిజ్ఞులు ఫాహియాన్ పర్యట నానుభవ విశేషముల నాంగ్లీకరించి యున్నారు.

భారతదేశమున నితఁడు విద్యాభ్యాస మొనర్చుచు సందర్శించిన చారిత్రక ప్రదేశములు పెక్కులు. ఆ కాలమునఁ బ్రసిద్ధి నందిన ప్రతిపట్టనమును, బుద్ధ చిహ్నములచేఁ బవిత్రము లయిన ప్రతి ప్రదేశమును, జూచి యచ్చట విజ్ఞాన విశేషములఁ జూచి గ్రంథస్థ మొనర్చి నాఁడు. ఆ కాలమునఁ దక్షశిల విశ్వవిద్యాలయము వైద్యశాస్త్రాదికములకు - లలిత కళలకు - సమస్త విద్యలకు - ఆవాసమై యుండుటచేఁ బ్రపంచ పౌరుల నెల్ల నాకర్షించు చుండె నని 'ఫాహియాన్' వ్రాయు చున్నాఁడు. శాక్యసింహుని జన్మస్థళ మ్మగు 'కపిల వస్తు' నగరంబును, అతఁడు బుద్ధత్వ మందిన "బుద్ధ గయ"ను, మహాపరి నిర్వాణ మొందిన 'కుశనగరంబు'ను, దిలకించి బుద్ధ భగవానుఁ డున్నయపుడు దా నుండు

నదృష్టము లేకపోయెం గా నని 'పాహియాన్' పెల్లు దురపిల్లి అ మ్మహాత్ముని పాదరజము సోఁకిన ప్రదేశములఁ గాంచు నదృష్టము మాత్రము గల్గినందుల కుబ్బి తబ్బి బ్బయ్యెను. ఇతనికిఁ దో డయి వచ్చిన 'టోచింగ్' భారత బౌద్ధవైభవ మున కచ్చెరు వంది తాను బుద్ధత్వ మందువఱకు భారత వర్షమును వదలి రాఁ జాల నని 'పాటలీ పుత్త్రము' (Patna) నందె యుండెను. పాహియాన్ మాత్రము మధుర, అయోధ్య, జతవన విహారము, నలంద, రామరాజ్య మని పే ర్వడసిన గృధ్రకూటము, రాజగృహము, వారణాసి, తామ్రలిప్తి, కపోత విహారము (Nagarjuna Konda) మున్నగు ప్రదేశంబుల సందర్శించి ధన్యుఁ డయ్యెను.

ఇతఁడు వ్రాసిన గ్రంథమున దక్షిణాపథ మందలి 'కపోత విహారము' ను గూర్చిన, 'గిరి విహారము' ను గుఱించిన, విశేషము లున్నవి. కొండమీఁది కపోత విహారము నందలి మొదటి యంతరువు 5 వందల గదులతో గజాకారముగను, రెండవ యంతరువు 400 గదులతో సింహాకృతిగను, మూఁడవ యంతరువు 300 గదులతోఁ దురఁగ రూపముగను, నాలవ యంతరువు రెండు వందల గదులతో వృషభాకృతిగను, ఐఁదవ యంతరువు వంద గదులతోఁ బావురపు టాకారముగను, విలసిల్లు చున్న దఁట! ఈ గదు లెప్పుడును బౌద్ధ సన్న్యాసులతోఁ గ్రిక్కిరిసి యుండెడి వఁట! ఇ ప్పారావత విహారమున గదుల మందరఁ బై యంతరువు నుండి నడుమ నొక జలధార చిత్రాతిచిత్రముగఁ గ్రిందికిఁ

బోయెడి దఁట! ఆ నాగార్జునాచార్యుని మహత్త్వ పటుత్వ మెంతయని కొనియాడ నగుసు ?

ఇవ్విధముగ పాహియాన్ ఆఱేండ్లు దేశ మంతను బర్యటించి తామ్రలిప్తి మీఁదుఁగా నోడ పయినిఁ బదునాల్గు దినములు సముద్రప్రయాణ మొనర్చి సింహళ ద్వీపమును జేరి కొనియెను. సింహళమున మహేంద్ర నృపుని కాలంబుననే బౌద్ధమతము పరివ్యాప్తిఁ జెంది యుండెను. ఇమ్మహారాజు అశోకచక్రవర్తి కుమారుఁడు. పాహియాన్ సింహళమునఁ గాలిడు నాఁటికి బౌద్ధమతము తామర తంపరఁగా వ్యాపించి స్థూపముల తోడను విహారముల తోడను బెంపుఁజెందియుండెను. ఎన్మిదేండ్లు భారత దేశమునను సింహళములోను సంచరించి, వినయపిటకముల సేకరించి, తదర్థతత్త్వము నాఁకళింపుఁ జేసి కొని పాహియాౝ వెడలెను. బౌద్ధ మూలగ్రంథములను, దద్విజ్ఞాన సౌరభమును, చీనా దేశమున వ్యాపన మొనర్చి యా దేశములోని బౌద్ధ భిక్షువుల జీవితములను ప్రబుద్ధముల నొనర్చుటయే యాతని యుద్దేశము. ఆ యుద్దేశము ననుస రించియే భారత దేశము పయిఁదన కధికాభిమాన మున్నను భక్తి ప్రపత్తు లున్నను స్వదేశాభిమానము ముప్పిరిఁ గొన స్వప్రజానీకము పయిం గల యనుకంపతో నతఁడు 'టోచింగ్' వలె భారత దేశమ్మున నుండఁ జాలక స్వదేశ మునకుఁ జని మతప్రచార మొనర్పఁ గృతనిశ్చయుం డయ్యెను. సింహళమున రెండు సంవత్సరము లుండిన తర్వాత నోడప్రయాణముఁ జేసి పాహియాన్ చీనాకుఁ

జేరికొనియెను. ఈ నౌకా ప్రయాణమున నతఁడు వడిన యిబ్బందులు పెక్కులు. ఆ నౌక ప్రచండ గాలులకు, గుఱియై మునుఁగుటకు సిద్ధమయ్యెను. అతఁడు పదునేను సంవత్సరములు శ్రమించి సేకరించిన గ్రంథసంచయ మంతయు సముద్రము పా లగు నని పరిదేవించి, యవలోకితేశ్వరుని మనసారఁ బ్రార్థించి యాయన యనుగ్రహ విశేషంబున ఆ మాప్పనుండి బయటఁ బడినాఁడు. ఆ దీక్షాపరుని పరిశ్రమ చీనావారికి దక్కవలసి యున్నది గావుననే యా ముప్పు గడచినది. ఓడ దరి వట్టఁగనే యవ ద్వీపమునఁ బ్రవేశించి యటఁ గొన్నాళ్లుండి యావలఁ జీనా దేశమునకుఁ జేరఁ గలైను.

అతఁడు సంపర్శించిన విశేషముల నెల్లఁ బట్టు పీతాంబరముల మీఁదను, వెదురు పలకల మీఁదను, నిక్షిప్త మొనర్చి యున్నాఁడు. ఆవల నవి యాంగ్లాది భాషలఁ బరివర్తనము లై ప్రపంచ సారస్వతముల నగ్రస్థాన మందికొనినవి. ఇతని భారతదేశ యాత్ర ప్రాచీన చరిత్రపరిశోధకులకు మణిదర్పణము నంటిది దని చెప్పినఁ జాలును ఆతని సేకరణ మహాత్త్వ పటుత్వమునకు.



# ఆర్యభట్టు

నాగరక మారంభ మైనప్పటి నుండియు నార్య హృదయము ( Aryan mind ) ప్రకృతి రహస్యములను, అనుదిన జీవిత సమస్యను, — బరిశీలించుచునే యుండెను. ప్రకృతి దేవతల భయోత్పాదక మందలి గౌరవ ప్రపత్తులు, ఉత్సాహ ప్రక్రియకు సంబంధించిన నూతన పరిశోధనలు, — అభ్యుదయ సాధనలకు దారి సూపఁగా, నప్పటి యార్యులు 'జీవ స్భద్రాణి పశ్యతి' యను నట్లుండుచుండిరి.

క్రీ. శ. ఎన్మిదవ శతాబ్ద ప్రాంతముల నక్షత్ర చలన పరిశీలనము, దైవపీఠ నిర్మాణావశ్యకత, — లోనగునవి ఆర్యుల శాస్త్ర పరిశోధనమున కంగములుగా నుండెడివి. జ్యోతిష వేదాంగము ఆర్యుల ప్రాథమిక ప్రయత్న మని తెలియం దగును. ప్రాయశః ఈ ప్రయత్నములు క్రీ. త. ఆఱవ శతాబ్దమున జరగి యుండును. క్షేత్రరేఖా గణితము నకు సంబంధించిన సాధన సంపత్తి బోధాయన – ఆపస్తంబ మహర్షుల శుల్వ సూత్రముల నుండి గ్రహింపఁ బడినది. ఈ శుల్వ సూత్రములే యా పిదపఁ గల్పసూత్రములుగా రూపొందఁ బడినవి.

కాలము గడచిన కొలఁది శాస్త్రానురక్తి, శాస్త్రాభ్యాసము, విరళించినది. రాను రాను బుద్ధిమంతు లీ శాస్త్ర వికసనమున సుప్తయుగము దాఁక దృష్టి నిగుడ్చి త దభివృద్ధికి సర్వవిధములఁ దోడ్పడిరి. నందుల కాలారంభము

నను, మౌర్యుల నాఁటను, తత్ప్రాప్యస్థితి విశ్రుతమై దిఙ్మండలము విస్తృత మయ్యెను. సాతవాహన శకమున శాస్త్ర పరిశోధన మింకను విస్తరించి 'జంబుద్వీప ప్రజ్ఞాపతి' అను జైన గ్రంథము (ఇది క్రీ. శ. రెండవ శతాబ్ది యందలిది.), గర్గ సంహిత—సూర్యసిద్ధాంతము—అను జ్యోతిష గ్రంథములు (ఇవి క్రీ. శ. రెండవ శతాబ్ద మందలివి), వెలువడుటకుఁ గారణ భూత మైనది. శాస్త్రీయ పఠనమును—త దభ్యాసమును – దేశము యొక్క స్థితి గతులు సంక్లిష్ట స్థితి యం దుండుటచే నిలుకడగా నుండ కుండెను. ఈ స్థితి తరువాతి గుప్తుల కాలములో నేర్పడి యావల శాస్త్ర పరిశోధనానురక్తికిఁ బాదు కొల్పినది.

ప్రాచీన భారత వర్షమునఁ దేజోవంత మైన గ్రంథము "ఆర్యభటీయము." ఈ గ్రంథమును గ్రీ శ. 499 దవ సంవత్సరమున 'ఆర్యభట్టు' రచించి నాఁడు. "ఆర్యభటీయమున జ్యోతిశ్శాస్త్ర గణిత శాస్త్రముల రెండిఁటిని సమ్మేళన మొనర్చి వ్రాయఁ బడిన మొట్టమొదటి గ్రంథ మిదియే!" యని W. E. clark అను నతఁడు దన (Legacy of India, P. 338.) లో వ్రాసినాఁడు.

ఆర్యభట్టు పాటలీ పుత్త్రమునఁ గ్రీస్తు శకము 476 వ సంవత్సరమున జన్మించి, తన యిర్వది మూఁడవ యేఁట 'ఆర్యభటీయము' ను రచించి నాఁడు. ఇతఁ డీ గ్రంథమును రచించుట వలన ఆ నాఁటి శాస్త్రీయ వాసనలు సంచలించినవి. తన నాఁటి యలగ్జాండ్రియా, రోమనుల జ్యోతిశ్శాస్త్ర

ముల సంశోధించి త త్పరిచయ భాగ్య మందుటయేగాక ప్రాచీన భారతీయ జ్యోతిర్వేదమును త దుపపత్తులను గూరిం కిపముగ నాపోశనముఁ బట్టిన వాఁడు.

సూర్యుని యొక్కయు నక్షత్రముల యొక్కయు గ్రచంచల శక్తిని, భూమియొక్క గోళాకారమును, దాని క్షుత్ పరిభ్రమణమును, సూర్యుని చుట్టును ద త్పరిణామ విజృంభణములును, భూమి చుట్టును జంద్రుని పరిభ్రమణ మును, - లోనగు నంశములఁ గూర్చి ఆర్యభట్టుఁ డొనర్చిన పరిశోధనలు ఆ కాలపుఁ బ్రజకు విప్లవాత్మకములుగాఁ దోఁచి భారతీయ విపశ్చిద్వరులు దమ పూర్వాభిప్రాయముల వీడక స్వస్థచిత్తముతో నీతని విజ్ఞాన ద్యోతకము లగు వినూత్నాభి ప్రాయమ్ముల ననూచాన విజ్ఞాన సంపత్తిని వీడి నట్లుఁగా వరాహ మిహిర — బ్రహ్మగుప్తాదులు భావించి సారము లేని కొయ్య నమలిన రీతి నివి యుండె నని యధిక్షేపించు టను జూడఁగా, వారు 'ఆర్యభటీయ' మందలి లోఁతుపాతుల నవగాహ మొనర్చికొన్నట్లుఁ గాని లేక అవగాహ మొనర్చికోఁ బ్రయత్నించి నట్లుఁ గాని యగపడ లేదని ( Alberuni's India by Suchan Vol. I. P. 376. ) అను గ్రంథము వాకొను చున్నది.

ఇది Giardano Bruno వేదాంత త త్త్వమున కతి రిక్తము. ఈ 'బ్రూనో' ఇటలీలో విశ్రాంతి యను న దెఱుం గక ప్రతీక్షించి పరిశోధించిన వ్యక్తి. అట్టిఁ డయ్యును క్రీస్తు శకము 1600 సంవత్సరము ఫిబ్రవరి 17 వ తేదీనఁ

ప్రాణము లుండఁగనే కాల్పఁ బడియెను. Galileo అను వానిని రావించి, విచారణ జరపి, ఆతని శాస్త్ర సిద్ధాంతములను నూఱు ప్రక్కలఁ జేసి నిరసించిరి. కాని యీవల బహుకాలము ఆయన శాస్త్ర సిద్ధాంతములకు, విశ్వాస పరంపరలకు, బాధపడ వలసి వచ్చెను. భరత ఖండము నం దీ సంఘటన మెప్పుడును జూడనూప లేదు. కారణ మేమన; సహనము, అభిప్రాయభేదములు, మన భరత ఖండంబునఁ బరంపరగా నుండు చుండుట చేతను ఆ యభిప్రాయ భేదంబులఁ బరామర్శించి యభినందించి యనుసరించుటయో లేక విమర్శించుటయో మాత్రము జరగు చుండెనే గాని యధిక్షేపించి, నిరసించి, యవహేళన మొనర్చి, తార్మాఱు సేయుట జరగి యుండ లేదనియుఁ, దెలియనగును.

తేజోమయ శరీర కాంతి నడ్డగించుట వలన గ్రహణము లేర్పడు చున్న వని యార్యభట్టు నిశ్చయించి నాఁడు. భూమియుఁ జంద్రుఁడును దమ ఛాయల నొకరి పయి నొకరు సంవత్సర కాలములో వివిధ గతులఁ దటస్థించు వారి పరిణామములలోఁ బఱపి నప్పుడు సూర్యచంద్రు లెప్పుడు రాహుగ్రస్థము లగునో అప్పుడు గ్రహణములు గల్గు నను పూర్వ గాథయే యార్యభట్టు యొక్క యభిప్రాయము. రేయుం బవళ్ళ నిమ్నోన్నతములకుఁ గారణ మఱసిన వాఁడు ఆర్యభట్టు. కొద్ది తప్పుతో మార్పుతోఁ బగటి దైర్ఘ్యమును విమర్శించి, కనిపట్టి, నక్షత్రముల - గ్రహముల చలనమును జక్కఁగాఁ బరిగణన మొనర్చి సంవత్సరమునకు మూఁడు

వందల యఱువది యైదు దినము లని యార్యభట్టు నిర్ధ రించి యంతతోఁ దనివోక భూ మి కి ని - సూర్యునకును, జంద్రునకును,— గల పరస్పర సంబంధ సామరస్యములను, భౌమ్యాకర్షణ న్యాయశాస్త్రమును, బరామర్శించి నిర్ధ రించెను. ఈ భౌమ్యాకర్షణ సిద్ధాంత సూత్రమునే పదునేఁడవ శతాబ్ద మందలి 'న్యూటన్' అను నతఁడు చక్కఁగా నిర్ధా రణ చేసినాఁడు.

ఆర్యభట్టు గావించిన పరిశోధన లన్నియుఁ బశ్చిమ ఖండమునకు నవగత మొనర్చి యాయన విజ్ఞాన దీధితుల దర్పణము భాతిఁ బ్రసరింపఁ జేసినవాఁడు 'అహావజ్' నందలి "అబుల్ హాసన్" అను నతఁడు. అరబీయులకు నార్యభట్టు నెఱిం గించిన గ్రంథము "ఆర్యభటీయము." సుప్రసిద్ధ చరిత్రకారుఁ డును, భోగోళశాస్త్ర వేత్తయు, నగు "అల్ మసూది" యను వాఁడు క్రీ. శ. 946 వ సంవత్సరమున 'ఈజిప్టు' దేశమునఁ జనిపోయెను. ఆర్యభట్టును గూర్చి యానుపూర్విగ నెఱింగిన బ్రహ్మగుప్తుని 'బ్రహ్మశ్రుతి సిద్ధాంతము'న నుట్టంకింపఁ బడిన యార్యభట్టు సిద్ధాంతముల నన్నింటినిఁ దెలిపిన వాఁడు "అల్ బిరూని" కావుటం జేసియే పి. కే. హిట్టి యను వాఁడు "భారతవర్షము తన విజ్ఞాన సౌరభమును లోకమున వ్యాపింపఁ జేయుటలోను, గణితశాస్త్ర రహస్యముల నుద్గమింపఁ జేయుట యందును, భాషావ్యాప్తి యొనర్చి తాత్త్విక మూల సిద్ధాంత సూత్రముల నవగత మొనర్చుట యందును బురోగమించె" నని

(History of the Arabs, P. 307) విదితము సేయుచున్నది యని యుద్ఘాటించి నాఁడు.

దీనిఁ గూలంకషముగఁ బరిశీలించి 'జోసెఫ్ హెల్' అను జర్మనీ గ్రంథకర్త "భారతదేశ విజ్ఞాన తరంగ సంఘాతము ఉత్తరాఫ్రికాను క్రమించి యూరపునకుఁ బోయె" నని (Arabic civilization, tranlsated by S. khudabak ha , p . 104.) అను గ్రంథమున నుట్టంకించి యున్నాఁడు. దీనిం బట్టి అరబీయులు (aromatics) ను బ్రేమించుట మాత్రమే గాక ఇంగువను, గత్తులను, ప్రత్యేకముగ భారతావని నుండి దిగుమతి గావించుకొను చుండి రని విస్పష్టము కాఁ గలదు. అంతియకాక వేదాంత శాస్త్రమునఁ, ప్రకృతి శాస్త్రమునఁ, భారతీయులు గడించిన సాధన సంపత్తిని, చేసిన కృషిని, నిల్పి కొన్న దృష్టిని, — జక్కఁగా గ్రహియింపఁ గల్గిరి. ఇంకను ఆర్యభట్టు సిద్ధాంతములఁ బరిశోధించి వివరించినది క్రీ. శ. పదునేనవ శతాబ్ది యందలి 'కోపర్నికస్' (Copernicus) అను వాఁడును, క్రీ. శ. పదునేఁడవ శతాబ్దమున నున్న 'గలిలియో' (Galileo) అను వాఁడును; ఆ కాలపు గ్రీకుదేశపు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు భారతీయ జ్యోతిర్విదుల అండదండల మెలంగి 'అలగ్జాండ్రియా' యందలి 'పౌలస్', ఈజిప్టు నందలి 'టాలమీ', ఇంక నితర పశ్చిమదేశ విద్వాంసులు, భారతీయ జ్యోతిశ్శాస్త్ర పారంగతులతోఁ దత్త ద్విషయంబుల సంప్రదించు చుండిరి. కాని ఫ్రెంచి విద్వాంసుఁ డగు 'మసాస్ అవర్సెల్' (Masson-

Oursel) అను వాఁడు "భారతీయ జ్యోతిశ్శాస్త్రము ఛాల్డియన్ సైన్సుకు - చైనీసు సైన్సుకు - సంబంధించి యున్న" దని (Ancient India and Indian civilization, P. 207.) అను గ్రంథమున నుట్టంకించి నాఁడు. ఏ. బి. కీత్ "భారతీయుల జ్యోతిశ్శాస్త్రము గ్రీకు దేశీయుల పలుకుబడి ననుసరించి నూతనోజ్జీవమును బ్రసాదించిన" దని వ్రాసినాఁడు.

ఆర్యభటీయము పూసెజ్జ వంటి గ్రంథము. ఈ గ్రంథమున నాతని ధిషణాశక్తి ద్యోతక మాటయే గాక పేరెన్నికఁ గన్న పూర్వశాస్త్రజ్ఞులలోనితఁడొకఁ డని తెలియవగుచున్నది. ఇది కారికలలో నిబంధింపఁ బడినది. ఇందు నూట పదునెన్మిది వృత్తము లున్నవి. అందుఁ బది వృత్తములు సంఖ్యాశాస్త్రమునకును, ముప్పది మూఁడు వృత్తములు గణిత శాస్త్రమునకును, నిర్వది యైదు వృత్తములు కాల పరిగణనమునకును, ఏఁబది వృత్తములు గోళమునకును, - సంబంధించిన వై యున్నవి.

విషయ సంగ్రహము పొడఁ గట్టను. శాస్త్రీయ సిద్ధాంతములను, సూత్రములను, బద్యములలో నిబంధించుట ప్రాచీన భారతీయుల దృష్టిగా నగపడు చుండుట వలన విషయ సంగ్రహము పొడఁ గట్ట లే దని తెలియనగు చున్నది. అంత మాత్రన నీ గ్రంథ ముత్కృష్టతను బోనాడి యుండ లేదు. తన యుత్తమత్వమును జాటుచునే యున్నది. తన గ్రంథ

మునఁ బ్రతిభా గౌరవ ప్రతిపత్తులు ప్రతి బింబించుచునే యున్న వని యీయన విశ్వాసమును బ్రకటించి నాఁడు.

ఆర్యభట్టు గావించిన గణిత శాస్త్ర పరిశోధనాంశ ములఁ జక్కఁగాఁ గనిపట్టిన యెడల నాయన పరిశోధనా ఫలితమును బడయఁ గలము. ఆయన పది సంఖ్య నుండి పది యవ స్థానము వఱకును గల లెక్కించు శక్తిని నిర్ధరించి నిరూపించి నాఁడు. సంఖ్యానుక్రమణిక ననుసరించుట కయి యతఁడు 'అ'కారాదిగా సాంకేతిక చిహ్నములఁ జూపెట్టెను. అట్లనుసరించుట వలన సంఖ్యా సాంకేతిక చిహ్నములు పదునెన్మిదవ స్థానము దాఁక ననుసరింప నవకాశ మేర్పడి యనిర్దిష్ట మైన యతివ్యాప్తి దోషము కలుగును. సంఖ్యల నిడివి, వెడలుపు, ఎత్తు, లోఁతుల స్థానములను, త్రిభుజముల విస్తీర్ణములు, వర్తులములు, విషమ చతుర్భుజములు, సమ సంఖ్యలు, సూచ్యగ్ర స్తంభ సంపుటి, గోళములు, – అను విషయములలో నాయన యొనరించిన పరిశోధనమునఁ గొంచెము వక్రత గలదు. వర్తులము యొక్క చుట్టు కొలఁత కును, వ్యాసరేఖకును, – నడుమఁ గల సంబంధమును, వ్యాస రేఖ భాగములు, త్రిభుజములు, చతురస్రములు వీని నిర్మా ణము, వర్తులములు, గణితప్రగతులు, బీజగణిత సజాతీ యతలు, వివిధ రకముల లెక్కలు, లబ్ధమూలములు, మూఁటి సంఖ్యాసూత్రము, భిన్నరాసులు, విపర్యాస నియమ పద్ధతి, రెండు సమాన విషయముల నిర్ధరించు విధానము, రెండు గ్రహముల నడుమ నుండి భూత భవిష్య

త్సంయోగములు గణించుట, మొదటి రేఖయొక్క సాధారణ సమీకరణములుఁ గనుఁగొనుట, — లోనగు ననేకాంశముల నితఁడు చర్చించి యున్నాఁడు. ఇతఁడు సరియైన π విలువను Viz 3,1416 అని నిర్ధరింపఁ గలిగెను. Epanthem వలె సూత్రము నెఱింగి లక్షణము నిరూపించి భారతవర్షమున నుపయోగించు చున్న పద్ధతి ననుసరించియే మూఁడు సమాన సంఖ్యల నిర్ణయము నిడివి, యెత్తు, లోఁతు, వెడలుపు సమానముగాఁ గల యాకృతి యని దానికిఁ బంద్రెం డంచులు గల వని నిరూపించినాఁడు. ( Keith History of Sanscrit Literature, P. 523.)

అకారాద్యనుక్రమణికఁగా సాంకేతిక చిహ్నముల నుంచుట యను నార్యభట్టు నద్వితీయ విధానమును, ఆతని ఘనమూలముల చదరము యొక్క క్రొంగ్రొత్త నిర్మాణ వైఖరిని, దశగుణక సంఖ్యాస్థాన విలువ విధానము పయి నాధారపడి బహుశః ప్రప్రథమముగా నార్యభటీయమున నుట్టంకింపఁబడిన దన వచ్చును. ఇ విషయమున శాస్త్రజ్ఞులు భిన్నాభిప్రాయులయ్యును ఆయన లెక్కసేయలేదు. కేంద్రభుజ్య పరిణామావసరముతో వర్తుల మధ్యము నుండి కైవారమునకు గీయఁబడు గీఁత (Radius) 3438' అని యార్యభటీయమునఁ దెలిసికొను చున్నారము. (History of Sanscrit Literature, P. 527) ఆర్యభట్టు క, మ, అను హల్లులను 1 నుండి 25 వఱకు లెక్కించుటకును, య, హ, ఇంక నితర యెన్మిది హల్లులను

శ0 నుండి 100 వఱకు సంఖ్యల నెఱుక పఱచుటకును, అచ్చుల సంఖ్యానిర్ణయమునకు బదులుగా నుపయోగించినాఁడు.

ఆతని నూట యిర్వది సూత్రములతో నిబంధింపఁ బడిన 'ఆర్యభటీయము' జ్యోతిశ్శాస్త్రాంశములతో గణిత శాస్త్రాంశములతో మేళవింపఁ బడినది. ఆయన గ్రంథము లన్నియు నిప్పుడు మనకు లభించిన యెడల శాస్త్రలోక మంతయు నాయనను బ్రహ్మరథము పట్టి యుండెడిది.

ఇట్టి మహోత్తమ గ్రంథమును గుఱించి "ఈ విషయమున భారత వర్షము గ్రీసుదేశము కంటె నధిగమించి మహోన్నత శిఖరము నధిష్ఠించి తచ్ఛాస్త్ర జిజ్ఞాసువులకు మహోపకార మొనర్చిన" దని కీత్ అను విద్వాంసుఁడు ఘంటాపథముగఁ జెప్పినాఁడు. (History of Sanscrit Literature, P. 527.)

ఈ శాస్త్రవిషయమున గ్రీకులు గాని, రోమనులు గాని, యపరిచితులే యను నది యథార్థము. యూరోపియను లీ శాస్త్రమును గ్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దమున మాత్రమే నేర్చుకొని రని యనక తప్పదు. "అల్ ఫజారి హైందవ గ్రంథముల యనువాదము లన్నియును ఇస్లామునకు నంకగణితము నేర్పె" నని పి. కే. హట్టి వ్రాయుచున్నాఁడు. "అల్ ఖ్వారిజ్ మీ - హిసాబ్ అల్ ... హాసిబ్స" యొక్క లెక్కలు (క్రీ. శ. 867 - 874 మధ్య) అరబిక్ ప్రపంచ మంతను వ్యాపించుటకుఁ దోడ్పడియె"నని History of Arabs, P. 378-379) విదిత మొనర్చు చున్నది.

ఆర్యభట్టు జీవితాంశము తెలుసుకొనుటకుఁ దగిన సాధన సంపత్తి మృగ్యము. ఆయన జీవిత మందలి యధిక భాగ మెచ్చట గడపినదియు, నెచ్చట యెప్పుడు సనిపోయినదియుఁ, దెలిసికొనుట దుర్ఘటమై యున్నది. ఆర్య సంప్రదాయము ననుసరించియు, నైతిహ్యమును బట్టియు, నాయన సంతానాది విషయము లిదమిత్థ మని తెలిసికొన వీలు గా కున్నయది. ఈయన మతానుయాయులు, శిష్యులు, నగు లతాదేవి, నిశ్శంక, పాండురంగస్వామి లోనగువారు ఈయన విజ్ఞాన సౌరభము నలుకెలంకుల వ్యాపింపఁజేయుట గొప్ప విశేషము. క్రీ శ. పండ్రెండవ శతాబ్దమున భాస్కరాచార్యుఁడు - లీలావతి లోనగువారు ఆర్యభట్టు సిద్ధాంతములను లోకమునకు నవగత మొనర్చి మహోపకార మొనర్చిరి. ఆర్యభట్టు ఉప క్రమ - ఉపసంహారములలో పొరఁబడిన పొరపాట్లను వరాహ మిహిరుఁడు - బ్రహ్మగుప్తుఁడు లోనగువారు సక్కదిద్దిరి. వీ రిద్దఱును మధ్యయుగపు శాస్త్రజ్ఞులలో ప్రముఖులు. అల్‌బిరూని సైతము మీా విషయమునఁ జాల కృషి చేసినాఁడు.



# ఆల్ బిరూని

ఇతఁడు 'బుఖారా' రాసుమారుఁడు. క్రీ. త. 973 వ సంవత్సరము సెప్టెంబరు మాసమున 'ఖొరాసాన్' పట్టనమున జన్మించి క్రీ. త. 1048 దవ సంవత్సరమునఁ జనిపోయి నాఁడు. అనఁగా డెబ్బది యైదేండ్లు జీవించి నాఁ డన్న మాట. ఈ కాలము నందె రాజరాజ నరేంద్రు నాస్థానమున గోపాలుని నన్నియ భట్టు విశాంపతి నానతి నొఁదలం దాల్చి భారత మహాకావ్యము దెలిఁగించు చుండెను. ఈ భట్టార కుఁడు భారత రచనకుఁ బూనిన కాలముననే 'ఆల్ బిరూని' భారత వర్షమునఁ గా లిడి నాఁడు.

మొట్టమొదట 'ఆల్ బిరూని' 'ఖొరాసాన్' ప్రభు వగు 'మామూన్ ఖ్వాజెంషా' అను వాని యాస్థానమునఁ బండితుఁడుఁగా వ్యవహరించి, యావల 'ఖొరాసాన్' రాజ్యమును గజనీ మహమ్మద్ కబళించి త దధిపతి యగు 'మామూన్ ఖ్వాజెంషా' ను కడ తేర్చిన తర్వాత ననఁగాఁ, క్రీస్తు శకము 1017—1031 సంవత్సరముల నడుమ గజనీ మహమ్మద్ కోర్కి ననుసరించి యా తని యాస్థాని యై యున్న యపుడె 'ఆల్ బిరూని' గజనీ మహమ్మద్ తండ్రి యైన 'ఖొరాసాన్' యొక్క గాథలను గ్రంథ రూపమునఁ జిత్రించి నాఁడు. ఇతరుల యభిప్రాయముల నిగ్గుఁ దేల్చి, తూఁచి, విలువఁ గట్టుటకుఁ బూనికొనుటయె ఆల్ బిరూని లక్ష్యము. జ్యోతిశ్శాస్త్ర మీతని యభిమాన శాస్త్ర మాటం జేసి సమ

కాలీన ముస్లిము లీయనను గొప్ప గణిత శాస్త్రజ్ఞుఁ డనియు, జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁ డనియు, — బహు ప్రకారంబులఁ జెప్పు కొను చుండిరి.

మహమ్మద్ గజని భారత వర్షమునకు వచ్చు నప్పుడు దనతోఁ గూడ ఆల్‌బిరూనిం దీసికొని రాఁగా, శ్రమల కోర్చి సంస్కృతము లోనగు భాషల నభ్యసించి, భారతీయ విజ్ఞాన విశేషముల నవగాహ మొనర్చికొని, 'భారత వర్షము' (Bharata Varsha) నను పేరితో నొక గ్రంథమును రచించెను.

భౌతిక పదార్థమునకును వ్యోమ మండలాంతర్గత పరమాణువులకును, — గల సంబంధమును గుఱించియు, సూర్య చంద్ర గతులను గూర్చియు, భూమి గతులను గూర్చియు, - సునిశిత మైన పరిశోధనములఁ గావించుటయే గాక రసాయనిక వర్ణ సమ్మిశ్రమముల వివేచించి, వితర్కించి, పాతాళ గంగను వెలికిఁ దీయఁదగు మార్గముల నన్వేషించి, నిష్ణాతుఁ డని యనిపించికొని బహుముఖ ప్రజ్ఞానిధి యని, శాస్త్రజ్ఞుఁ డని పే రందినాఁడు. జ్యోతిశ్శాస్త్రమున, అంతరిక్ష పట లేఖనమున, భూపట లేఖనమున, బుద్ధిమదగ్ర గణ్యతను సహేతుక విమర్శనా పాటవమును, శక్తిని, ముద్రించి నాఁడు.

ఇతని కాలమునకు నెన్నియో సంస్కృత గ్రంథములు అరబీయ భాష లోనికిఁ బరివర్తన మొనర్పఁ బడఁగా, ఆ

గ్రంథముల నన్నింటిని కూలంకషముగా నితఁడు పఠించి, యవల సంస్కృత భాష నభ్యసించి యం దపార పాండిత్యము సేకరించి 'బ్రహ్మ సిద్ధాంతము — ఖండ ఖాద్యక - చరక - పంచతంత్రములు, వైతీశ్వరుని కరుణ సారములు, లోనగు గ్రంథములలో దొరలిన దోషముల సవదరించి విఖ్యాతి నార్జించుటయే గాక చరక మందలి సుఖరోగాధ్యాయమును, వరాహ మిహిరుని బృహత్సంహితను, లఘు జాతకమును, కపిలాచార్యుని సాంఖ్య శాస్త్రమును, పతంజలి మహర్షి యోగశాస్త్రమును, — ఆరబీయ భాష లోనికిఁ బరివర్తన మొనర్చి నాఁడు.

అంతతోఁ దృష్టి వడక హిందూ ధర్మశాస్త్రములను, పురాణములను, - చక్కఁగాఁ జదివి విష్ణు పురాణ, మత్స్య పురాణ, వాయు పురాణ, ఆదిత్య పురాణముల పయిని విపుల వ్యాఖ్యల విరచించి భారత భాగవత రామాయణాదులను గూడ క్షుణ్ణముగాఁ బఠించి నాఁడు. "నక్షత్ర రాసులు, - యోగ శాస్త్రమునకు సంబంధించిన 'ఖయాల్ - ఆల్ - కుస్సాని' - 'ఖండఖాద్యక' (కరణములకు సంబంధించిన వర్ణనము) - వివిధ గణ విధానములు - సూర్య భూ భ్రమణ ముల గుఱించిన వివిధ వాదోపవాదములు- అక్షాంతర రేఖల చర్చ" - అను గ్రంథముల రచించుటయే గాక, 'అహార గణము' నను మఱియొక గ్రంథమును గూడ అరబిక్ - ఇరా నియన్ తిథులను పరిశోధనఁ గావించి వ్రాసినాఁడు.

ఆల్‌బిరూని గ్రంథములు పాండిత్య స్ఫోరకము లౌటయే గాక ప్రాక్ప్రతీచుల సౌమనస్యమునకును, జ్ఞాన లబ్ధికిని, గావించిన యొక యపూర్వ నిస్స్వార్థ కృషి యని చెప్పక తప్పదు. గ్రీకు తత్త్వ శాస్త్రమును గాని, హిందూ ధర్మ శాస్త్రములను గాని, పురాణములను గాని, ఇస్లాం మర్మ వేదాంతమును గాని, యెప్పు డే సందర్భమునఁ జర్చించినను ఆ కాలపుఁ దురుష్క లోకమును అందునను ముఖ్యముగఁ దన యేలిక యగు గజనీ మహమ్మద్ ఆఫ్గన్ రాజ్యమును ఇతర రాజ్యములను బంధించఁ గల్గిన యొక సౌహార్ద్ర సౌమనస్య సంబంధమును నన్వేషించుట కయియే 'ఆల్‌బిరూని' ప్రయత్నించి నాఁడు.

అక్బరు పాదుషా మొదలయిన వారిం బలె గజనీ మహమ్మద్ హిందువుఁడు గాలేదు. అతఁడు జుగుప్సతో, జిగీషతోఁ, దన సామ్రాజ్యమును, విస్తృత మొనర్ప వలయు నన్న దృష్టితో వ్యవహరించి నాఁడు. ఆతని లక్ష్యము, దృష్టి, సామ్రాజ్య విస్తరణయే! ఆ పరిస్థితులలో ఆల్‌బిరూని మధ్యే మార్గమున సామరస్య మపేక్షించుట గజనీ మహమ్మద్‌ను ధిఃకరించుటయే యగును గాని యతఁడు 'ఆల్ బిరూని' యొనరించు విజ్ఞాన కృషి యందే మాత్రము జోక్యము గల్పించుకొన కుండుట గొప్ప విశేష మనక తప్పదు. అందువలననే ఆల్‌బిరూని వ్రాఁతలలో సంచారములలో, పరిభ్రమణములలో, స్వాతంత్ర్య మగపించు చున్నది.

గజనీ పట్టణమున 'ఆల్‌బిరూని' గృహ మొక విజ్ఞాన మందిరము. భారతదేశము నుండి సనుదెంచిన బ్రాహ్మణ విద్వాంసులకు — శేముషీ ధురంధరులకుఁ — జరిత్ర జిజ్ఞాసువు లకు — ఆల్‌బిరూని గృహ మొక కేంద్రము. రచయితలకుఁ గాణాచి. చారిత్ర కాంశముల తోడను, ఇతర జ్ఞాన సముచ్చ యము తోడను, సంపుటీకరింపఁ బడిన ఆల్‌బిరూని గ్రంథము ఎనుబది యధ్యాయములుగా విభజింపఁ బడి యున్నది.

తొలుతఁ దన కష్టనష్టములను దేశ స్థూల వితరణము స్పృశించి హిందూ సంస్కృతికి ముగ్ధుఁడై తన గ్రంథరచ నకుఁ బ్రోత్సహించిన కారణముల వివరించి నాఁడు. రెండవ యధ్యాయము నుండి పదునొకండవ యధ్యాయము వఱకును మత తత్త్వ శాస్త్రము లోనగు విషయములు చర్చింపఁ బడినవి. పండ్రెండవ యధ్యాయము మొదలు పదునేఁడవ యధ్యాయము దాఁక సారస్వతమును గుఱించియుఁ, గొలఁ తలు — అలవాట్లు — సంప్రదాయములం గూర్చియు, — వివ రింపఁ బడినవి. పదునెన్మిదవ యధ్యాయము నుండి ముప్పది యొకటవ యధ్యాయము వఱకును భూగోళ, విశ్వ, ఖగోళము లను గుఱించి తెలుపఁ బడినవి. ముప్పది రెండవ యధ్యా యము మొదలు అఱువది రెండవ యధ్యాయము దాఁక కాల నిర్ణయ జ్యోతిశ్శాస్త్రములు ప్రస్తావింపఁ బడినవి. అఱువది మూఁడవ యధ్యాయము నుండి డెబ్బది తొమ్మిదవ యధ్యాయము వఱకును దేశాచారములు — పండుగ పర్వ ములు — ఊరేఁగింపులు, — లోనగు వానిం గూర్చి విదిత

మొనర్పఁ బడినది. ఎనుబదియవ యధ్యాయమున నక్షత్ర శాస్త్రమునకు సంబంధించిన విషయమును ప్రత్యేకించి వివరింపఁ బడినది.

'డాక్టరు ఎడ్వర్డు శాచో' అను నతఁడు దన 'ఇండికా' (Indica) గ్రంథమున "ఆల్‌బిరూని" యథార్థమును గప్పిపుచ్చక సత్యనిరూపణ మొనర్చుటకుఁ గంకణమును ధరించిన వాఁడు. పాండిత్య శోభను దనర్పు విశిష్ట వ్యక్తి. తాఁ దలంచిన సత్య ధర్మములను జంకుఁ గొంకులు లేకయ వెల్లడించు పరమ పావనుఁడు. కడవటికును దెగువఁ జూపి మర్యాదఁ జూపఁగల దిట్ట. శౌర్యధనుఁడు" నని నుట్టంకించి నాఁడు. భారతీయుల పట్లఁ బూజ్య భావమును సుహృద్భావమును గలయట్టి వాఁడు. భారతీయ సంస్కృతిని సాంఘిక వైజ్ఞానిక విషయములను అత్యంతాభిమానముతో, శ్రద్ధతోఁ, బరిశీలించిన యుత్తమ ప్రకృతి. కాని యతఁడు "భారతీయులు చారిత్రక కాలక్రమమును గుఱించి తగిన శ్రద్ధ వహింపకుండుట మన దురదృష్టము. రాజవంశము లోని వారిం జేర్కొనుటలోఁ గాల క్రమమును బాటింపరు. వృత్తాంతములఁ, బూర్వాపర సందర్భముల, వివరింపుఁ డని కోరినప్పుడు సెప్పుట కేమియుఁ దోఁచక కథలఁ గల్పింపఁ బూనికొందు" రని వ్రాసి నాఁడు.

కాని క్రీ. శ. పండ్రెండవ శతాబ్దమున నున్న కల్హణుఁడు మాత్రము ఆల్‌బిరూని వెల్లడించిన లోటు రానీయక

'రాజ తరంగిణి' ని రచించి నాఁడు. సయుక్తికము, సువిశాల దృక్పథము, స్వాతంత్ర్య విస్తృతి, సాంఘిక ఆత్మ సాక్షాత్కారము,— అను నవి చరిత్ర ప్రయోజనము లని కాంట్, హెగల్, మున్నగు వా రుగ్గడించి యున్నారు.

సోమనాథాలయమును క్రీ. శ. పదునొకండవ శతాబ్దమున సులతాన్ మహామ్మద్ గజని ధ్వంసముఁ జేయఁగా, న విషయము నా మూలాగ్రముగ నెఱింగి "ఆల్‌బిరూని సోమనాథాలయమున జరగు పూజా పురస్కారముల విశిష్టతను ప్రశంసించి, యాలయమునకుఁ దటస్థించిన విపత్తునకుఁ బెల్లు దురపిల్లి, ప్రతి నిత్యము వేయి మంది బ్రాహ్మణులు సోమనాథాలయమునఁ బూజ లొనర్చు వా రనియుఁ, బ్రతి రాత్రియు నాలయమున నప్పటి కప్పుడు దెచ్చిన గంగోదకముతో సోమనాథుని స్నానముఁ జేయించు వారనియు, గంగానది సోమనాథమునకు నాఱు వందల మైళ్లకుఁ బైఁగా నుండినను దేవుని స్నానముఁ జేయించుటకు గంగోదకమే యుపయోగించు చుండుట వలన గంగలో నెంతటి మహాత్త్వ మున్నదియు నూహించుకొన వచ్చు ననియు," 'ఆల్‌బిరూని' వ్రాసినాఁడు.



# కల్హణుఁడు

కాశ్మీరము లోని "పరిహాస పురము" నం దొక కులీన కుటుంబములోఁ గ్రీస్తు శకము పండ్రెండవ శతాబ్దమునఁ గల్హణుఁడు జన్మించి నాఁడు. ఇతని తండ్రి చంపకుఁడు. శ్రీహర్షి చక్రవర్తి కొల్వున సరిహద్దు సైన్యాధిపతిగాఁ బని చేసి చంపకుఁడు దన జీవితమును శ్రీహర్షున కంకిత మొనర్చి నాఁడు. శ్రీహర్షుఁడు గావించిన దండయాత్రలలో చంప కుఁడు సల్పిన సాహసోపేత కృత్యముల నెల్ల "రాజ తరంగిణి" యందుఁ గల్హణుఁ డుల్లేఖించి యున్నాఁడు.

శ్రీహర్షుని యెడఁ జంపక సేనాని యగపఱచిన విశ్వాస వినమ్రతలు హర్షింప కున్నను గల్హణుఁడు దన గ్రంథములోఁ దన తండ్రి యొక్క శౌర్యోచిత కృత్యములను, ప్రభుభక్తిని, విపులముగా నభివర్ణించి యుండుటను జూడఁగా గల్హణునకుఁ దన తండ్రి పట్లఁ గల భక్తి విశ్వాసములే కారణము లని పొడఁ గట్టక పోదు.

పెక్కు విషయములలో, అపజయ పరంపరలలో, కల్హణుఁడు 'సీరో' వలెఁ బ్రవర్తించి నట్లు లగపడు చున్నది. కల్హణ పండితుని వంశ మర్యాద – కుటుంబ గౌరవము – సంప్రదాయ ప్రాచీనతలు, — బహూత్తమ మైనవి. అతఁడు బ్రాహ్మణ కులమున జన్మించినను బౌద్ధమతము నెడ సామ రస్యము గలాఁ డని యాతని "రాజ తరంగిణి" వలనఁ

తెలియఁ బఱచి నాఁడు. అశోక చక్రవర్తి మొదలు కల్హణుని వఱకుఁ గల రాజావలి బౌద్ధమత వ్యాపనమున కయి విహారములు – స్థూపములు, – నిర్మించినది. విగ్రహముల నిర్మూలించిన వారి పట్లఁ గల్హణుఁ డగపఱచిన సుహృద్భావమును బట్టి యీతని సమాన భావ మెఱుంగఁ దగును.

కల్హణుఁడు చరిత్రాభిజ్ఞుఁడు, స్వతంత్రుఁడు, సాక్షీభూతుఁడు, నౌటచే రాజకీటకముల బారినం బడి తమ తెలివి తేఁటలను, దమ హృదయమును బోఁగొట్టుకొను కొందఱ పండితుల – కవి వృషభుల – వలెఁ గాక ప్రమాణ బుద్ధి కల వాఁడును, గంభీర హృదయమును 'హుందా' ( Dignity ) తనమును గలయట్టి స్వతంత్రుఁడును, నౌటచే గౌరవ మర్యాదలఁ జూఱఁ గొను చుండెడి వాఁడు. ప్రతిభా వ్యుత్పత్తు లెవ్వని కుండునో యట్టిఁడు ప్రశంసింపఁ దగ్గ వాఁడు. ఈర్ష్యాసూయలతో విషయ సమీచీనమునకు– విషయ నిర్ధారణకుఁ– బూనికొన్న వాఁడు గర్హింపఁ దగ్గ వాఁడు. అట్టిఁడు చెప్పినది యేని వినఁ దగ్గదియుఁ, బాటింపఁ దగ్గదియుఁ, గా దని కల్హణుని యభిప్రాయము.

కల్హణుఁడు మంచి పండితుఁడు – కవి. చరిత్రాభిజ్ఞత యతని యం దెంత కలదో అంతకంటె నధికముగఁ గవితా సంపద, భావ శబలత,— కలదు. సాహిత్య దర్శనమున, వ్యాకరణ శాస్త్రమున, నితఁడు నిష్ణాతుఁడు. ప్రాచీన చరిత్ర గ్రంథములతో పాటు రామాయణ మహాభారతము లన్న నతని కభిమానము మెండు. ఆర్థిక జీవన విధానములలో,

కళా ప్రతిభలో, అభిజ్ఞుఁడు మాత్రమే గాక ఆహార పదార్థముల ధరలు - నాణెముల ప్రచారము - పన్నుల విధానము- క్షామము,— లోనుఁగాఁ గల విషయములలో నిష్కర్షాభిప్రాయముల నాధారాధేయములతో ననఁగా, లెక్కల మూలమున వెల్లడించుటలో కల్హణుఁడు మేటి యని యభిజ్ఞుల యభిప్రాయము.

కల్హణుఁడు దన పాండితీ ప్రకర్ష వలనను గ్రంథావలోకనమునను బూర్వగ్రంథముల యెడఁ దనకుఁ గల గాఢాభిలాషము చేతను, "రాజ తరంగిణి" యందుఁ దన దేశ చరిత్ర నద్భుతముగఁ జిత్రింపఁ గల్గినాఁడు. తన కాలము నాఁటి సారస్వత చారిత్రక సిద్ధాంతముల ననుసరించుటయే గాక చరిత్రలఁ, గథల, ముచ్చటలఁ, జేర్చి కల్హణుఁడు దన యుపజ్ఞ నగపఱచినాఁడు. కాశ్మీరము యొక్క స్థానిక చరిత్రయే "రాజతరంగిణి" హాస్యోక్తులఁ బచరించుటలో కాశ్మీర ప్రజలకు నేర్పు చాలఁ గలదు. కాఁబట్టియే కల్హణునకును ఆ నేర్పు, ఆ శక్తి, కలదు. అధిక్షేపించు పట్టులం గూడఁ జమత్కరించుట యతని కలవాటు. ఇతఁడు కాశ్మీర రాజ్యమునఁ బ్రవర్తిల్లుచున్న ప్రభుత్వ సంప్రదాయములను, నడవడులను, "రాజతరంగిణి" యందుఁ జక్కఁగా నభివర్ణించి నాఁడు. రూపకాలంకారములు, ఉపమ, ఉత్ప్రేక్షలు, శ్లేషలు, కావ్య నియమములు, కవితా శిల్పము,— లోనగు న వన్నియు నితఁడు "రాజతరంగిణి" యం దుల్లేఖించుచు సామెతల నుట్టంకించి నాఁడు. ఇతఁడు ప్రాచీన

కవి వృషభుల భావ పరంపరలు, శయ్యా గౌరవములు, పాండితీ ప్రకర్ష,— పుణికిఁ బుచ్చుకొని కవిత్వముఁ జెప్ప నారంభించుటచే నితని "రాజ తరంగిణి" యం దంతను ప్రాచీనార్వాచీన భారతీయ సామెతలు ప్రస్ఫుట మాచునే యున్నవి.

శ్రీ నగరమును నిర్మించిన ప్రవరసేనుని గుఱించి నాణెములలో నగపడి నంత వఱకును జారిత్రకాధారములతో నీ గ్రంథమున వ్రాయఁబడినది. ఇప్పుడు శ్రీనగర మని చెప్పఁబడు చున్న పట్టనము అశోక చక్రవర్తి నిర్మించినదియే! యని కల్హణుఁడు సెప్పుచున్నాఁడు. శారికా పర్వతము, గోప పర్వతము, జ్యేష్ఠ రుద్రాలయము, — పురాతనములయినవి.

ప్రవరసేనుఁడు సేతుకావ్యమును రచించినాఁడు. ఈ కావ్యము పదిఁ హేనాశ్వాసములు గలది. భారవియు - మాఘుఁడును,— దమ గ్రంథములలో ప్రతి సర్గాంత శ్లోకమును యథాక్రమముగ 'లక్ష్మి' శబ్దము శ్రీ శబ్దాంకిత మొనర్చిన ట్లితఁడు ప్రత్యాశ్వాసాంత శ్లోకము ననురాగ శబ్దాంకిత మొనర్చెను. ఇందలి వృత్తములకు స్కంధకము లని పేరు. ఈ సేతు కావ్యము అష్టవిధ ప్రాకృత భాషలలో ప్రశస్తతమ మైన మహాభాషలో వ్రాయఁ బడినది. దండి మహాకవి తన "కావ్యాదర్శము" లో —

"మహారాష్ట్రాశ్రయాం భాషాం,
ప్రకృష్టం ప్రాకృతం విదుః ।
సముద్ర స్సూక్తి రత్నానాం,
సేతు బంధాది యన్మయమ్॥"

— అని యీ మహారాష్ట్ర భాషను మెచ్చికొని యున్నాఁడు. క్రీ. శ. ఎన్మిదవ శతాబ్దమం దున్న బాణ మహాకవియు "హర్ష చరిత్రోపోద్ఘాతము" న —

"కీర్తిః ప్రవరసేనస్య,
ప్రయాతా కుముదోజ్జ్వలా।
సాగరస్య పరం పారం,
కపి సేనేవ సేతునా॥" —

అని వినుతించెను. "ఆంటిక్వియరీ" (Indian Antiquery) లో నున్న శాసనములఁ బట్టి యీ సేతు కావ్య నిర్మాత యగు ప్రవరసేనుఁడు 'వాకాటక' వంశ్యుఁ డనియుఁ, క్రీస్తు వెనుక పంచమ శతమునఁ గాశ్మీరమును బరిపాలించు చుండె ననియుఁ, – దెలియ నగు చున్నది.

కర్కోటక నృపతులలో 'ముక్తపీడ లలితాదిత్యుఁ' డను వాఁడు క్రీ. త. 699 – 736 సంవత్సరముల మధ్యఁ బరిపాలించిన వాఁడు. ఇతఁడు మంచి బలదర్పములు గల వాఁడు. కావుటం జేసి యితని బలదర్పములు కాశ్మీరమునకు వెలుపలఁ జాల వఱకుఁ గొనసాఁగుచుండె నని తెలియ నగు చున్నది. టర్కీ ప్రజల (People of Turkey) పయినిఁ గూడ ని వ్విశాంపతి యొక్క విజయ ధ్వజము లాస్యమాఁడు చుండె నని కాశ్మీర ప్రజల యభిప్రాయము. "ముక్తపీడ లలితాదిత్యుఁ" డొనర్చిన చివఱ దండయాత్ర తిబెత్తు (Tibet) ప్రజల పయినిఁ జాఁగించినదే యని 'చీనాదేశ చరిత్ర'

వాకొను చున్నది. దీని వలన నిమ్మహారాజు కాలములో జరగిన యాక్రమణలు, దండయాత్రలు, కాశ్మీర దేశము పుష్టివంతమై యుండె నని విదితము సేయుటయే గాక గుప్త చక్రవర్తుల నాఁటి నుండియు బలదర్పములు భారత దేశము తెలిసికొని యుండె నని తెల్లముఁ జేయు చున్నవి. మార్తాండ దేవాలయము ముక్తపీడ లలితాదిత్యునిచేఁ బునరుద్ధరింపఁ బడిన దాటచే నిది బహు పురాతనమైన యాలయ మనియు, నాకర్షణీయమైన దనియుఁ, గాశ్మీరమునఁ జూడఁ దగ్గ ప్రదేశాలలో నిది యొకటి యనియుఁ, – దెలియ నగుచున్నది.

లలితాదిత్యుని చరిత్రతో యశోవర్మ చరిత్ర సంబంధించి యున్నది. శత్రు భయంకరుం డగు లలితాదిత్యుఁడు సేతు శీతనగ పర్యంత మేకచ్ఛత్రముగాఁ బరిపాలించిన వాఁడు. తన జీవితకాల మంతను జైత్ర యాత్రలతో గడపిన వాఁడు. బీహారు రాజన్యుల చేతను, అయోధ్య నగరాధిపతుల వలనను, గప్పములఁ గొన్న వాఁడు. ఒక ప్రచండ యుద్ధమున నితఁడు యశోవర్మను నోటమిఁ బుచ్చెను. కాఁగా, యశోవర్మ చేయునది లేక అనన్య గతికుఁడై. లలితాదిత్యునకు దోసి లొగ్గి భృత్యుఁడై, యతనితో సంధిఁ జేసికొనియెను. కాని లలితాదిత్యుని మంత్రి యైన మిత్రవర్మకు ఆ సంధి నియమము లిష్టము లేకుండుట చేతను, భటతతి రణ కుతూహలులై యుండుట వలనను, సంధి జాఱి పోయినది. అంతట యశోవర్మ తనకుఁ గల కొద్ది బలముతో

శత్రువుల నెదిర్చి పరాజితుఁ డయ్యెను. అప్పుడు లలితాదిత్యుఁడు దన మంత్రి చెప్పిన చొప్పునఁ దనను జయలక్ష్మి వశంవద మైన దని సంతోషించి మిత్రశర్మకు నయిదు బిరుదముల నొసంగెను.

ఇ వ్విధముగ యశోవర్మ పదచ్యుతుఁ డై తన విద్వాంసులతోఁ గూడఁ దాను లలితాదిత్యుని గుణస్తుతి పాత్రుఁ డయ్యె నని "రాజ తరంగిణి" యందలి "జితో యయా యశోవర్మా త ద్గుణస్తుతి వందితామ్" అను వాక్య మవగత మొనర్చు చున్నది. ఇంక వేయునేల ? యమున నుండి కాళిక వఱకు వ్యాపించి యున్న కన్యాకుబ్జ దేశమును దన పెరటి దొడ్డి వలె నాక్రమించుకొని తన రాజ్యమునఁ గలిపి కొని యెను. కాఁగా, యశోవర్మను ఈ విధముగ గెలుపొంది లలితాదిత్యుఁడు ప్రాక్సముద్రపు టొడ్డునఁ గల దేశాల పయి నదండెత్తి వెడలి గౌడదేశాధిపతి యొక్క గజ సమూహమును బట్టి కొనియెను. ఇ వ్విధముగ నొక దేశము తర్వాత నొక దేశమును జయించు కొనుచుఁ బోయి పోయి కొనకు సప్త కొంకణములను, "బుఖారా" దేశమును, జయించెను. జయించిన దేశములలో కట్టడములను, దేవాలయములను, గట్టించి నాఁడు. "బుఖారా" దేశమునకు భూభాగంబులఁ జేకూర్చి నాఁడు. తన పేరితో "లలితపురము" నను నొక పట్టనమును నిర్మించి, యం దొక సూర్యాలయమును గట్టించి, యా సూర్యభగవానునకు యశోవర్మను జయించి గైకొన్న కన్యాకుబ్జ రాజ్యమును భక్తి శ్రద్ధలతో సమర్పించెను.

లలితాదిత్యుఁడు శౌర్యధనుం డౌటయే గాక ధార్మికుఁడు. శ్రద్ధాభక్తులతో, దయాంతఃకరణలతోఁ, బ్రజా పరిపాలనముఁ జేసిన వాఁడు. కల్హణుఁడు గోరంతలఁ గొండంతల నొనర్చి యతిశయోక్తులతోఁ జిత్రించు వాండ్ర వలెఁ గాక యాథార్థ్యమును దెలుపు వాఁ డౌటచే లలితాదిత్యుని గుణ గణాల నన్నింటిని తూ-చా తప్పక వ్రాసినాఁడు. కావుననే లలితాదిత్యుఁడు "త్రిగామి" గ్రామములో నున్న గౌడదేశా ధీశునిఁ దన భట తతిచేఁ జంపించి నాఁ డని యుల్లేఖించి నాఁడు. "రాజ తరంగిణి" ననుసరించి లలితాదిత్యుఁడు క్రీ. త. 695 దవ సంవత్సరమున రాజ్యారూఢుఁ డై ముప్పది యాఱేండ్ల యేఁడు మాసముల పది దినాలు రాజ్యము జేసె నని తెలియ నగుచున్నది. కావున నితని రాజ్యపరిపాలనా కాలము క్రీ. త. 695 దవ సంవత్సరము నుండి క్రీ.శ. 732 వ సంవత్సరమున వఱకు నని గ్రహింప నోపు. ఇతఁడు మార్తాం డమునఁ బ్రసిద్ధ సూర్యక్షేత్రమున "అమరనాథు నాల యము"ను నిర్మించి నాఁడు. ఇయ్యాలయ శిల్పమును జూచిన వారు దీనిం "గాశ్మీర శిల్ప సింహ" మని యనుచుండిరి. దిదృక్షువుల నీ యాలయ శిల్ప సౌందర్యము ముగ్ధుల నొనర్చు చుండెను. అనంతనాగము నుండి నైదు మైళ్ళకుఁ బైఁగాఁ బర్వత ప్రదేశంబున రమణీయముగ నిర్మింపఁ బడిన దౌటచే నిటకు విచ్చేసిన యాత్రికులు శ్రాద్ధాదిక్రియల నత్యంత భక్తితో జరపు చుందురు.

'పంచతరణి', 'నీలమత పురాణము', 'రాజ తరంగిణి', — అను మూఁడు గ్రంథములలో అమరేశ్వర యాత్ర వివరింపఁ బడి యున్నది. అమరనాథ గుహాంతర్భాగంబునఁ బాలఱాఁతి విగ్రహమునకు నెడమ ప్రక్కన చిన్ని గుహ యం దున్నది. "బాత్ కుట" మహమ్మదీయులు "అమరనాథుని విభూతి" యని యా విగ్రహము నుండి తీసి యాత్రికుల కొసంగు చుందురు. ఈ గుహకుఁ బడమర భాగమున "అమర గంగ" యను పేరితో నొక చిన్న యేఱు ప్రవహించు నని "అబుల్ ఫజుల్" వ్రాయు చున్నాఁడు. ఈ యేఁటిలో నను భూత శక్తులు గల సంపత్తి యున్న దనియు, నిందు స్నాన మాఁడిన వారి కా సంపత్తి యలవడు ననియు, నైతిహ్య (Tradition) మొకటి కలదు. ఈ సంపత్తినే 'యమర విభూతి' యని పిలుతురు. శివుని నారాధించుట వలని భక్తిముక్తు లిందు వలనఁ దెలియనగును.

ఇతని తర్వాతి వా రీతిని పరిపాలనా సౌలభ్యమును గాని, బలదర్పములను గాని, "కర్కోట" రాజవంశ మర్యాదను గాని, ప్రాభవమును గాని, నిలిపికోఁ జాలక పోయిరి. లలితాదిత్యుని తర్వాత నైఁదవ తరము వాఁ డగు జయాపీడుఁడు క్రీ. శ. 779 వ సంవత్సరము నుండి క్రీ. శ. 813 వ సంవత్సరము వఱకును రాజ్యముఁ జేసి నష్టిఁ జెందిన కాశ్మీర రాజ్య భాగమును మరలఁ జేకూర్చు విశ్వ ప్రయత్నములఁ జాఁగించి నాఁడు గాని యాతని ప్రేమమయమైక జీవనమును,

ద తౌసభాగ్య సందర్శనాభిలాషమును, వంగదేశము పయినిఁ దరలించినవి. ఇతని యాస్థానమున నుద్భటుఁడు విద్యాపతి (Minister for Education) గా నుండె నని "రాజతరంగిణి" యందలి —

"విద్వాన్ దీనార లక్షేణ
ప్రత్యహం కృత వేతనః ।
భట్టో భూ దుద్భట స్తస్య (జయాపీడస్య)
భూమిభర్తు స్సభాపతిః"

అను వాక్యము విదితము సేయు చున్నది. దీనిం బట్టి యుద్భటుఁడు విద్యాపతి (Minister of Education) గా వ్యవహరించుచుఁ, బండిత పరిషత్తున కధ్యక్షుఁడుగా నుండుచు, నచటి కార్యకలాపముల నెఱవేర్చు చున్నయట్లు తెలియంగఁ దగును. ఉద్భటుఁడు గొప్ప వ్యాకరణాలంకార శాస్త్రజ్ఞుఁ డౌటయే గాక శివపూజా ధురంధరుఁడు గూడ నగుటచే సభా నిర్వహణ సందర్భమునఁ బ్రతిదినము జయాపీడుని సభలో లక్ష దీనారముల నిచ్చు చుండు వా రని యవగత మగు చున్నది. కాశికా వృత్తిని రచించిన జయాదిత్యుఁడును, వామనుఁడు, కయ్యటుఁడు, భామహుఁడు, ఉద్భటుఁడు, మమ్మటుఁడు, లోనగు విపశ్చిద్వరులును గాశ్మీరమున జన్మించిన వారలే!

కల్హణుని గ్రంథరచనకుఁ గల సాధనలలో "నీలమత పురాణము" మొదలగునవి కాశ్మీరమున వ్రాయఁ బడినవే!

దక్షిణా పథమున శంకర - రామానుజ - మధ్వాచార్యులం బలె నుత్తరా పథమ్మున నభినవ గుప్తుఁ డంతటి ప్రథితా యుతుఁడు. క్రీ. శ. పదునొకండవ శతాబ్దపు టుత్తరార్ధమునఁ గాశ్మీర జైనమత ప్రాబల్యమునకు నభినవ గుప్తుఁడు పట్టు గొమ్మ యని చెప్ప వచ్చును. కావుననే యాతనిని "భగవత్పాద" యని పిలువఁ జొఁగిరి.

క్రీ. త. 855 - 6 - 883 వఱకును బరిపాలన మొన ర్చిన యవంతి వర్మ కాశ్మీరమును నే రీతిఁ బరిపాలించెనో కనుఁ గొందము. "అవంతిపుర" మందలి దేవాలయముల శిథిల చిహ్నములు అవంతి వర్మ కీర్తి వల్లరుల స్మృతి పథంబు నకుఁ దెచ్చు చున్నవి. వీని తర్వాత నితని కుమారుఁడు శంకర వర్మ క్రీ. త. 902 వ సంవత్సరము దాఁకఁ బరిపా లించినాఁడు. ఇతని నాఁటి నుండియె "రాజావలి" యారంభ మయ్యె నని యీతని కాలపు నాణెములు నిదర్శించు చున్నవి.

అవంతి వర్మ యాస్థాని యై వరలిన యానంద వర్ధ నుఁడు "ధ్వన్యాలోకము" ను, "దేవీ శతకము" ను,— రచించినాఁడు. రుద్రట శతానందుఁడు "కావ్యాలంకారము" నను గ్రంథమును వ్రాసినాఁడు. ఈ రుద్రట శతానందుని తండ్రి భట్టారక వాముకుఁడు. ఈ భట్టారక వాముకుఁడు గొప్ప యాలంకారికుం డని భోజ ప్రతిహారేంద్రుఁ డు నృపతి చెప్పి యున్నాఁడు. రుద్రట శతానందుఁడు క్రీ. త. 950-900

సంవత్సరముల మధ్య జీవించియున్నాఁడు. ఇతని గ్రంథము దండి మహాకవి కృత "కావ్యాదర్శము" న కనుకృతి. ఈ కృతికి నేమినాథుఁడు క్రీ. శ. 1659 దవ సంవత్సరమున వ్యాఖ్యానము వ్రాసినాఁడు.

"మహాభాష్య ప్రదీపము" ను రచించిన కయ్యటుఁడు జయ్యటుని కుమారుఁడు. ఇతని గురుపాదులు మహేశ్వరుఁడు. మమ్మటుఁడు - కయ్యటుఁడు - ఔవటుఁడు - నను వార లన్నదమ్ము లని మమ్మటుని "కావ్యప్రకాశ" వ్యాఖ్యానమునఁ దెలుపఁ బడినది.

కయ్యటుఁడు కాశ్మీర మండలి యొక పట్టణాంతికమున నిత్య సంతుష్టుండై పునీత వృత్తిని నాత్మసతిం గూడి జీవించు చున్న తత్త్వజ్ఞుఁడు అమ్మహాభాగుఁ డమిత నిష్ఠాత్మ కుఁడు. పరుల సేవలఁ గొనుట నిచ్చగింపఁడు. ప్రత్యహము భాష్యరచనలఁ జల్పునుగాని గృహకృత్యముల నిర్వహింప మనం బంట నీఁడు. ఇతని సహధర్మచారిణి సీతా సాధ్విని దలఁపించు నట్టి పుణ్యశీల యాటచే నిజేశుఁ డీ తీరున నున్నను దా నాతత శ్రమ కోర్చి జీవన మ్మొనర్చు చుం డెను. అరణ్యమున కేఁగి, సంతతము నారల సేకరించి, సొం పడరఁ గఁ ద్రాళ్లను బేని, వానిం బట్టనమున విక్రయించి, యా ద్రవ్యముతో నంగడి యందు వలయు పదార్థములఁ గొని, యింటికిం జని, కాంతుని నాత్మ సేవలఁ, బక్వాన్నసోదన భోజనంబులఁ, బరితృప్తి నొనర్చు చుండును.

ఇవ్విధముగ నేండ్లును బూండ్లును నొక్కటే తీరున నడచు చున్నను బరమ పావన మైన గాంగ నిర్ఝరిణి తనదు స్థిరగతిని వీడనట్లే యా సాధ్వియుఁ గాంతుని వీడ కుండెను. ఇట్లుండ నొకనాఁడు కాశ్మీర నృపాలు నోలఁగము బాహా శౌర్య దసాధారణ యోద్ధ బృందమును, భాషా పాదాబ్జ సంపద రాజిల్లెడు పండితులు, కవులు, సన్మంత్రులు, కళా కారులును,— ముదమారఁ గొల్వఁ గాశ్మీర నృపాలుఁడు మూర్తీభవద్ధర్మ మై వెలసెను. కాఁగా, మహామంత్రి లేచి, సభాసదుల వంక దృష్టి సారించి, "ప్రభువర్యునకుఁ దెల్పఁ గల వింతలు, విశేషములు, విన్నపములు, ఏమేనిఁ గలవా?" యని యడుగగాఁ, జీమ చిటుక టన్న నిశ్శబ్దమును జీల్చి వైచి యొక సభ్యుఁడు "మహాప్రభూ! దేవర వారు ధర శాసనులు. కవిప్రియులు. పండిత పక్షపాతులు. కావ్య జేసి కవి పండితాళి భోజనాది వసతుల కయి యోజిం లేదు. అయ్యును గయ్యటుఁడు నేదియుఁ గోరఁడు. వి గ నున్నది. ఇప్పట్టణాంతికమునఁ గయ్యటుఁడు నివసిం ము, మహాభాష్యముల వ్రాయుచును భార్య పోషణమునఁ పాల నిష్టమెయి ననుభవించుచు, నున్నయంతలోఁ లెల్ల అభినుతింప సంతోషించు చుండు" నని వి పఁగా, నృపతి వెన్వెంట గద్దియ డిగ్గి హుటాహుటి య్యటుని చరణ సీమ వ్రాలఁగఁ, దన పరివారము వెం వరలుచు రాఁగాఁ, జనియెను. వాగర్థ వారిధీ భావ త్తు ల నీఁదు లాఁడుచు లౌకిక విషయ విరాగి యై, కేవల పూజలఁ

జలుపుచుఁ, దన యింటి కరుదెంచు ధాత్రీశు నజురాణి ధ్యాన నిష్ఠను గనలేక తాళపత్రి గ్రంథములు దన్నుఁ బరివేష్టింప దర్భాసనస్థుఁ డై దనరుచు, వేద శాస్త్రాదులు సర్వ విదితముగఁ జెలంగ "శ్రీ మహాభాష్య తిలకము" ను వ్రాయు చున్న కయ్యటుని నృపుఁడు వినయ ముట్టిపడ, మానస వీథి భక్తి నిలువఁ, గాంచి, సాష్టాంగముగ మ్రొక్కి, "స్వామీ! కాశ్మీరము తొలి జన్మమునఁ జేసికొన్న సుకృత ముం బట్టి మిమ్ములఁ గన్నది. తత్త్వజ్ఞులు, పండితులు, కవులు, బ్రాహ్మణులు, నగు తా మీ రీతిఁ గష్టములఁ బడుచుఁ గాశ్మీర సీమ నుండుటం జేసి మహాఘము నన్నుఁ జొందదే! తమకుఁ దెలియని విషయము గాదు. మన్నిం తురు గాక!" యని వచింపఁగాఁ, గయ్యటుఁడును దన గృహిణి వంక నుపలక్షించుచు నచ్చటి దర్భాసనమును గక్షను కావల నుంచి పరమ శాంత గంభీర సంపద వెలుంగ భాషణముతో, "ని ప్పార్థివుండు మన కయి మహాఘములఁ మనంచుట యేల? నా గ్రంథముల నిమ్ము. ఆలస్య మొనరిం దలఁపిడు వే ఱొక ప్రదేశంబునకుఁ బోవుదము రమ్ము"— మన్న నున, న య్యవనీశుండును వినయ వినమితాంగుం డై డెను. అహా! మిమ్ముల నీ దేశము నుండి పొమ్మన లేదు. పడరఁ గఁభవించు బాధలు వినుకలి యై హృదయము ద్రవించి యా ద్రవ్య, త త్సంబంధ మగు మహాఘము నన్ను గ్రసింప గొని, యింట్లోడ మ త్సేవలఁ గై కొని న న్ననుగ్రహింపుఁ భోజనంబులఁ, న్నాడఁను. అన్యథా తలంప వల"— దని

యభ్యర్థింపఁగాఁ, గయ్యటుఁడును, ''ధరణీధవా! నీ యుదార బుద్ధికి ననిర్వాచ్యాద రానందములు మదిని రాజిల్లె నయ్యది సాలు. ఇఁకఁ బసదనంబులు, సపర్యలు, మా కెందులకు! ఏ నాఁడో కోర్కులఁ దెగఁ గోసి యిచ్ఛామెయి జీవించు మాకు మీ వస్తు వాహనాదులు - సపర్యలు - వలదు. ఇఁక మీ రిటకు రా వలదు. బుద్ధి సాగరు లగు మీ మంత్రి సత్తముల నిట కంప వలదు. నియమబద్ధ మైన మా మార్గ మునకు నడ్డుఁ దగుల వలదు. ఇవి పాటించి మమ్ము విడచు టయె మీరు మాకుఁ జేయు సేవా ధర్మము. మా యెడ మీ రగపఱచు విశ్వాసము నదియె''— యని నిత్య సంతుష్టుం డగు కయ్యటుఁ డనియె. కాఁగా, న మ్మాటల నెల్ల హర్ష పులకాంకురిత దేహుం డగుచు నృపుండును గయ్యటుని సంతృప్తిఁ గాంచి, కనుఁ గవను బాష్పకణములఁ గనియె.

అవంతి వర్మ కాలమున శంకరావతార మని పొగడ్త
గన్న భట్ట కల్లటుని కుమారుఁడు ముకుళ భట్టు భట్టోద్భటు
''కావ్యాలంకార సంగ్రహము''నకు వ్యాఖ్య రచించి నాఁ
అందలి పంక్తులను కుంతలకుఁడు వక్రోక్తి జీవితము
దృతీయోన్మేషమున ఖండించి నాఁడు. కుంతలకుఁడు 'లో
వ్యాఖ్యాత' యగు నభినవ గుప్తుని కంటెఁ బూరు
యాతని నాట్యశాస్త్ర వ్యాఖ్యానము వలనఁ దెలి
చున్నది. ముకుళ భట్టుని శిష్యుఁడు ప్రతిహారేంద
వాడు కొంకణ దేశస్థుఁడు. దాదాపు క్రీ. శ. 930

త్సర ప్రాంతమున విలసిల్లిన వాఁడు. గురుప్రశంసను దన "యుద్భటాలంకార వాఖ్య" యందు విస్తృత మొనర్చి యున్నాఁడు. ఈ ముకుళభట్టు కుమారుఁడు హర్షటుఁడు 'జయదేవచ్ఛందము'నకు వ్యాఖ్యఁ గూర్చి నాఁడు. ఆ వ్యాఖ్యను అభినవ గుప్తుఁడు దన నాట్యశాస్త్ర వ్యాఖ్య యందుఁ బేర్కొని నాఁడు. అభినవ గుప్తుని గ్రంథము లన్నియుఁ గ్రీస్తు శకము 1030 దవ సంవత్సరము లోపుఁగ విరచింపఁ బడియెను వామనాలంకార వ్యాఖ్యాతలలో అతి ప్రాచీనుఁ డగు సహదేవుఁడు 'కావ్యాలంకార సూత్రము' లకు ముకుళ సంబంధమును —

"వేదితా సర్వ శాస్త్రాణాం
భట్టో భూఽన్ముకులాభిధః।
లబ్ధ్వా కుతశ్చి దాదర్శం
భ్రష్టామ్నాయం సముద్ధృతమ్. ॥"

"కావ్యాలంకార శాస్త్రం య త్తేనై త ద్వామనోదితమ్:"—
అని వివరించు చున్నాఁడు. కావ్య ప్రకాశ వ్యాఖ్యాత నగు "మాణిక్య చంద్రుఁడు" క్రీ. శ. 12 వ శతాబ్దమున డెన్న వాఁడు ముకుళ భట్టును విమర్శించి నాఁడు. క్రీ. శ. పదకొండవ సంవత్సరము వాఁ డగు భోగనాథుఁడు విరచించిన యా [illegible]కార సుధానిధి" యందు ముకుళభట్టు రచించిన [illegible] మాతృక' యందలి శ్లోకము విమర్శింపఁ బడియెను. గాని, [illegible]
భోజనంబు[illegible]కర వర్మ పరిపాలనమున అవంతి వర్మ వైదేశిక తలు ప్రాముఖ్యత వహించినవి. ఇతఁడు కాశ్మీర

రాజ్యము యొక్క దక్షిణ పర్వత ప్రాంతమును స్వాధీనముఁ జేసి కొనినాఁడు గాని 'కర్కోట' రాజవంశావళి చరమ దశలో ఈ ప్రాంత మపహృత మయ్యెను. కాఁగాఁ, గాశ్మీరమును గాపాడు సైన్యము క్రీ. శ. పదియవ శతాబ్దపుఁ దొలి పాదమున సర్వ స్వతంత్ర మయ్యెను. అందు వలనఁ గర్కశ హృదయు లగు రాజచంద్రుల క్రింద సామ్రాజ్యము కలఁతలకు — విపత్తులకు, — రంగస్థళ మైనది.

ఆ పిమ్మట 'లోహార' నృపులు పరిపాలనా భారము వహించి కల్హణుని వఱకును బరిపాలించిరి. ఇ వ్వింశాంపతు లలో "అనంతుఁ" డను వాఁడు క్రీ. శ. 1028 దవ సంవత్సర ములో రాజ్యమునకు వచ్చిన సమయంబున సామంత మాండ లికులు తిరుగుబాటు సేయుటయే గాక మహామ్మదీయుల చేతను, డార్డులచేతను, గూడ దండెత్తఁ జేసిరి. కాని యనంతుని భార్య సూర్యమతి యను నామె రాజ్యాంగ వ్యవ హారముల నెఱపుచు సమర్థ యని యనిపించు కొనియెను. అనంతు నాస్థానమున క్షేమేంద్రుఁ డున్నయట్లు సువృత్త తిలకము - ఔచిత్య విచార చర్చ-అను గ్రంథములం గల—

"క్షేమేంద్రేణ ప్రణయి విపదాం హర్తు రాశ్చర్య కర్తుః।
భూ భృ ద్భర్తు ర్భువన జయినో౽న స్త రాజస్య రాజ్యే॥"
— సువృత్త

"ఆశా శ్శీతలతాం నయ త్యవిరతం యస్య ప్రతాపానల।
స్తస్య శ్రీమ దనంతరాజ నృపతేః కాలే కిలాయం కృతః॥"
—ఔచిత్య విచార ః

అను వాక్యము లవగత మొనర్చు చున్నవి. ఇ య్యనంత భూపతి భోజరాజునకు బంధువును, సమకాలికుం డును, నయినట్లు "రాజతరంగిణి" లోని—

"నచ భోజ నరేంద్రశ్చ దానోత్కర్షేణ విశ్రుతౌ।
సూరీ తస్మిన్ క్షణే తుల్యం ద్వావా స్తాం కవిబాంధవౌ॥"

అను వాక్యము విదితము సేయు చున్నది. ఈ భోజరాజు క్రీ. శ. 996 – 1051 సంవత్సరముల మధ్య నున్న వాఁ డని శాసన పంక్తు లవగత మొనర్చు చున్నవి. 'రాజ తరంగిణి' ననుసరించి యనంత భూపాలుఁడు క్రీ. శ. 1020 – 1080 సంవత్సరముల నున్న వాఁ డని తెలియు చున్నది. 'సంస్కృత వాఙ్మయ చరిత్ర' ను రచించిన 'మేగ్డనల్' అను నతఁడు కథా సరిత్సాగర – బృహత్కథా మంజరులఁ గూర్చి ప్రసక్తించుచు నేత ద్గ్రంథకర్త లగు సోమదేవ – క్షేమేంద్రులు సమకాలికు లని చెప్పి క్షేమేం ద్రుఁడు బృహత్కథా మంజరిని క్రీ. శ. 1037 వ సంవత్సర ప్రాంతమున రచించె నని వ్రాసినాఁడు.

క్షేమేంద్రుఁడు త్యాగ భోగపరాయణుం డై బ్రహ్మ వేత్తయైన ప్రకాశేంద్రుని కుమారుఁడు. 'సర్వ మనీషి' బిరుద విభూషితుం డయిన గంగకోపాధ్యాయుని శిష్యుఁడు. 'వ్యాస దాస' బిరుదాంకుఁడు. బ్రాహ్మణుఁడు. అందునను శివపూజా ధురంధరుఁడు. అట్లని "ఔచిత్య విచార చర్చ"యందలి—

"ఆసీత్ప్రకాశేంద్ర ఇతి ప్రకాశః,
కాశ్మీర దేశే త్రిదశేశ్వర శ్రీః।
అభూత్ గృహే యస్య పవిత్ర సత్రే,
మచ్ఛిన్న మగ్రాసన మగ్రజానాం
తస్యాత్మజః సర్వమనీషి శిష్యః
శ్రీ వ్యాసదాసాపర పుణ్యనామా।
క్షేమేంద్ర ఇత్యక్షయ కావ్యకీర్తి
శ్చక్రేన నౌచిత్య విచారచర్చాం॥"-

అనువాక్యముల ననుసరించి విదితము కాఁగలదు. ఇతఁడు తర్క, వ్యాకరణ, మీమాంసాది శాస్త్రపారీణుఁడు. సాహిత్య చక్రవర్తి. ఆపాత మధుర మైన విషయములఁ గావ్య నిబంధన మొనర్చి యున్నాఁడు. ఈ మహాకవి రమారమి ముప్పది రెండు గ్రంథముల రచించినట్లు ఁగపించు చున్నది. రామాయణ, భారత, బృహత్కథా మంజరులు, కళావిలాస - సమయ మాతృక - కవి కంఠాభరణ - సువృత్త తిలక - దర్పదళన - సేవ్యసేవకోపదేశ - చారుచర్చ - దశావతార చరిత - దేశోపదేశ, నీతికల్పతరువు, కాదంబరి, శశివంశ మహాకావ్య - చిత్రభారత నాటక - రాజావళి - ముని మత మీమాంస - వినయవల్లి - లోనగునవి వీనిలో ముని మత మీమాంసాదులు ఔచిత్య విచార చర్చాది కృతులలను నుదాహరింపఁబడి యుండుట వలనఁ దెలిసికొను చున్నారవస్థల ఈ మహాకవికిఁ బరమత ద్వేషము లే దని దర్పదళనవాదన రచించుటను బట్టి తెలియ నగును. బుద్ధుని సమకాలికుండాత

ప్రసేన జితుఁడు "శ్రావస్తి" నగరమును బరిపాలించుచుండిన కాలమున సుప్రశస్తి వహించిన నగరములలో నిది యొకటి. క్రమక్రమముగ ని ప్పత్తనము క్రీ. శ. 11వ శతాబ్దికి క్షీణ దశకు వచ్చిన ట్లగపించు చున్నది. ఇందె వ్యాఘపీడితుం డగు చండాల బాలుని నోదార్ప జినేంద్రుఁడు సాక్షాత్కరించి నట్లు

"భవప్రభమాసక్త పరిశ్రమాణాం
రాగాది దోషై రుపతాపితానాం।
ఆశ్వాసనే నాఽమృత సోదరేణ
లింప న్నివద్యాం ద్యుతి చందనేన।
దృష్ట్వా తమాపద్గత ముగ్రరోగ
భగ్నం నిమగ్నం వ్యసనే వివిగ్నం।
వ్యలంబతార్ద్రః కరుణా రసేన
త త్తాప శాంత్యై భగవాన్ జినేంద్రః."

అను వాక్యము దెలుపు చున్నది. దీన నీతని గుణ గ్రహణైక పారీణతను జవిఁ జూడ వచ్చును. తన భావమున కతిరిక్తముగ నున్న భారతేతిహాసమును గైకొని పెక్కు భం గుల మార్చి త దనుగుణముగ్గఁ బాండవులు, కర్ణుఁడు, మొద లగు వారి జన్మములఁ గూర్చి ముచ్చటించుచుఁ, దుదకుఁ ... లము కంటె గుణమే యధిక మని

"గుణ ప్రభావే విచ్ఛిన్నే, సమా ప్తం సకలం కులం।
గుణాధీనం కులం జ్ఞాత్వా, గుణేష్వా ధీయతాం మతిః."

... వాక్యమునఁ దెలిపినాఁడు.

ఇట్టి మహాకవుల నాస్థానమున నుంచికొని తేజరిల్లిన యనంత సూర్యమతుల మనుమఁడే హర్షచక్రవర్తి. హర్షచక్రవర్తి క్రీ. శ. 1089 దవ సంవత్సరము మొదలు క్రీ. శ. 1191వ సంవత్సరము దాఁకఁ బరిపాలించినాఁడు. కల్హణ పండితుని వలన శ్రీహర్షుఁడు బహుప్రకారంబుల నభివర్ణింపఁబడి, ప్రశంసింపఁ బడియెను. హర్షచక్రవర్తియుఁ గల్హణుని పెవిధంబుల నభిమానించినాఁడు. హర్షచక్రవర్తి బహుశాస్త్ర నిష్ణాతుఁడు. పెక్కు భాషల నభ్యసించి పండిత కవి యని ప్రశంస లందికొనుటయేగాక బహుభాషా కోవిదుం డనియుఁ బ్రఖ్యాతిఁ జెందెను.

కల్హణుఁడు రచించిన "రాజతరంగిణి" యందు సాఁబాలునకుఁ బైఁగాఁ గ్రీస్తు శకము పన్నెండవ శతాబ్దపు టర్థభాగమునకు వినియోగింపఁ బడినది. ఈ విస్తృతభాగమునకుఁ బ్రామాణికత్వ మున్నది. "దామరస్" అను తిరుగుబాటు దారుఁడు దేశమున శాంతి భద్రతలు లేకుండఁ జేయుటచేఁ గృతక వాదులు వృద్ధి క్షయముల నందఁ జాఁగిరి. ఈ కారణమున శ్రీనగర ప్రజ యసంతృప్తితో బాధపడిరి. విజయసింహుఁడు కుహనా రాజనీతి తోడను, హృదయ విదారకమ్ములగు సిద్ధాంతముల తోడను, - కాశ్మీరమును బరిపాలించినాఁడు. "రాజతరంగిణి" యందలి తుది వాక్యము లీ జయసింహుని భార్య యైన రాధాదేవి యొక్కయు, నామె బిడ్డల యొక్కయుఁ, బ్రశంసలతో నింపఁ బడినవి. అతఁడు దన గ్రంథమును గౌతమితోఁ బోల్చుచు ముగించినాఁడు. భారత

దేశ దృక్పథముతోఁ గా కున్నను నే దృక్పథముతో నేని ''రాజతరంగిణి''నిఁ బరిశీలించిన యెడల నధిక భాగము సంస్థాన చరిత్రల నుండియే భారతదేశచరిత్ర వ్రాయవలయు నన్న దృష్టి యగపించక పోదు. దిద్ద, సుగంధ, సూర్యమతి,- మొదలగు సాధ్వీ మతల్లుల చరితల నిబంధించుటలోఁ గల్హణుని యభిప్రాయము ప్రజా జీవితములో స్త్రీల నడవడిని విశదము చేయుట యై యున్నది. స్త్రీల విభిన్నత, అస్పృశ్యత, కాశ్మీరమున బౌద్ధమతము ప్రవేశించుటతో నశించిన దని చెప్ప వచ్చును. తన సమకాలిక జీవితమును, స్థానిక పరిస్థితిని, కల్హణ పండితుఁడు ప్రస్ఫుటింపఁజేసె ననవచ్చును. మొత్తము పయినిఁ గల్హణుని తర్వాతఁ గాశ్మీర చరిత్ర యింత హృదయంగమముగా, సౌష్ఠవముగాఁ, జిత్రించిన వా రగపడరు.

క్రీ. త. 1536 వ సంవత్సరమున మొగల్ చక్రవర్తులు కాశ్మీరమును గైవస మొనర్చుకొనుటఁ, గల్హణుని నాఁటఁ గల చారిత్రక పరిస్థితులు, ''రాజతరంగిణి'' యందుఁ జివఱి భాగమున నుట్టంకింపఁ బడినవి. కాఁబట్టియే ''రాలిన్సన్'' " Rajatarangini of Kalhana Pandita is Hindu Indians chief contribution to History" — అని వ్రాయఁ దటస్థించినది. ఈ గ్రంథము క్రీ. త. 1148 వ సథ్వత్సరమున రచింపఁ బడినది. కల్హణుఁడు దన గ్రంథ రచనకు సువ్రతుని కావ్యము, కాశ్మీరమునుగుఱించి యంతకుఁ బూర్వ ముండిన పదునొకండు చరిత్ర గ్రంథములు, క్షేమేంద్రుని నృపావళి, పద్మమిహిరుఁడు - ఛవిల్లాకరుఁడు - వ్రాసిన

చరిత్రలు, పాశుపత మతస్థుఁ డగు "హేలా" రాజు వ్రాసిన "పార్థివావళి", – అను గ్రంథములును, దానశాసనములు,– లోనగు వానిం గూడ నుపయోగించి జనశ్రుతిని గూడఁ బాటించి నాఁడు. రాజ తరంగిణిఁ జదువు చున్నయప్పుడు Gibban's "Rise and Fall of the Roman Empire" అను గ్రంథమును జదువు చున్నయట్లే యుండును. 'రాజ తరంగిణి' కావ్యమునకుఁ గావ్యమును, చరిత్రకుఁ జరిత్రయు, నని చెప్పఁ బనిలేదు.

కల్హణుఁడు స్వతంత్రించి విషయముల నన్నింటిని విమర్శించి హృదయంగమముగ "రాజతరంగిణి"ని రచించి నాఁడు. అతఁ డీ గ్రంథమును రచించిన తర్వాత జోనరాజ శ్రీ వీరప్రాజ్యభట్టు అను నతఁడు "కాశ్మీరపుఁ దరువాతి చరిత్ర"ను వ్రాసినాఁడు. బిల్హణ కవి "విక్రమాంక దేవ చరిత్ర" ను, ఇతని సమకాలికుం డగు మంఖకవి "శ్రీకంఠ చరిత్ర"ను, — రచించి యున్నారు. దీనిం బట్టి చరిత్ర లేఖన మా దేశమున నధికముగ నుండె నని యవగతము కాఁ గలదు. కాశ్మీరము పురాతన కాలము నుండియు నలంకార శాస్త్రమునకుఁ బ్రసిద్ధిఁ గాంచి యున్నది.

అమరనాథ క్షేత్రమును సందర్శించు ప్రతివాఁడును సుశ్రవస నాగుఁడు ద్రవింపించిన సరస్సునఁ దాన మాడి పోవు నని కల్హణుఁడు దన "రాజ తరంగిణి" యం దుల్లేఖించి యున్నాఁడు. ఇమ్మహా పండితుని కాలమునఁ గూడ సుశ్రవసు నాగునిచేఁ ద్రవింపఁ బడిన సరస్సును, అమర

నాథక్షేత్ర మాహాత్మ్యమును,— విన సొంపై, కన నింపై, ప్రసిద్ధి వహించి యుండె నని "రాజ తరంగిణి" వలనఁ దెలియ నగుచున్నది. రెండవ విభీషణుని కుమారుఁడు 'నరుఁ' డను వాఁడు 'కిన్నర' గ్రామము రాజధానిగాఁ జేసికొని పరిపాలింపఁ దొడంగె ననియుఁ,గాని యతఁడు నైతిక బలము లేక దుష్టవర్తనుఁడై సంచరింప నారంభించె ననియు, శ్రమణుఁ డొకండు దన యౌగిక శక్తులచే నాతని రాణిని దొంగిలించె ననియు, న క్కతన నితఁడు శ్రమణుఁ డొనర్చిన దానికిఁ బ్రతిక్రియఁగా, 'వితస్త' నదికి దరిదాఁపుల నున్న తోఁటలలో నొక తోఁట యందు నాగ సుశ్రవసుఁడు వసించు సర స్సొకటి కల దనియు. నాతనికిఁ జంద్రలేఖ – ఐరావతి – యను నిద్దఱు కూఁతుం డ్రుండి రనియు, మంత్రశాస్త్రజ్ఞుఁ డగు నొక సాధువు వలనఁ దటస్థించిన చిక్కుల వలన నాగుఁడు కటకటం బడుచుండె ననియు, నీతని దురవస్థను జూచి విశాఖుఁ డను బ్రాహ్మణుఁ డా దురవస్థను దొలఁగించి యాతనికి మనశ్శాంతికిఁ గల్పించె ననియు, నందువలనఁ దన కొమార్త చంద్రలేఖను ఆ మంత్రశాస్త్రజ్ఞున కిచ్చి యుద్వాహం బొనర్చె ననియు, నా పిమ్మట నా బ్రాహ్మణ దంపతులు "కిన్నర" గ్రామమ్మునకు న్వచ్చి సుఖముగ జీవించు చుండి రనియు, నొక నాఁడు చంద్రలేఖ ప్రాసాద ప్రాంగణమునకుఁ దప్పిపోయి వచ్చిన గుఱ్ఱ మొకటి పచ్చిక మేయు చుండె ననియు, మండు టెండలోఁ గూడ ఆ పచ్చికను శ్రద్ధతో, మమకారముతోఁ, బెంచి యుండుట

వలన జుగుప్సతో దాని నదలింప నెంచి చంద్రలేఖ నెమ్మదిగా దాని నదలింపఁగా, నామె చేతి యందలి సువర్ణ ముద్ర దాని వీఁపు మీఁదఁ బడియె ననియు, నర చక్రవర్తి యా బంగారు ముద్రకు సమ్మోహితుం డై యామెను బొంద నభిలషించి గాఢ ప్రయత్నముల నొనర్చి విఫలుం డయ్యె ననియుఁ, గాఁగాఁ, జక్రవర్తి సిగ్గు బిడియములు లేక విశాఖ నింటిని ముట్టడించెను గాని చంద్రలేఖ విశాఖ దంపతు లా ముట్టడినిఁ దప్పించికొని సుశ్రవస నాగుని వేఁడికొనఁగా, నతఁడు కోపోద్రిక్త మానసుం డయి "కిన్నర" గ్రామమును దగ్ధముఁ జేసి, నర చక్రవర్తిని హత మొనర్చె ననియుఁ, గాని యా రాజధాని నగరమును దగులఁ బెట్టి యా మూలమున నిరపరాధు లగు ప్రజల నాశముఁ జేసినందులకు సుశ్రవస నాగుఁ డనారోగ్యవంతుఁ డై "దూరగిరి" పయిని నొక సరస్సును నిర్మించి "శేషనాగ సరస్సు" అని పే రిడియె ననియు, ఈ సరస్సు చందనవాడి – వేడిజనుల నడుమ అమర నాథ క్షేత్రమునకుఁ జను మార్గమునఁ గల దనియుఁ, గల్హాణుఁడు "రాజ తరంగిణి" యం దుల్లేఖించి నాఁడు.

అంతియ కాక సుశ్రవస నాగుఁడు దన కొమార్తె యల్లుంద్ర కయి యొక సురస్సును నిర్మించి దానికి "యమ్రతి సరస్సు" అని పే రిడియెను. ప్రథమ గోవిందుని కుమారుఁ డగు దామోదరుఁడు యాదవులచేఁ జంపఁ బడిన సమయమ్మున నాతని పట్ట మహిషి "యశోమతి" యను నామె గర్భవతి యై యుండినను బ్రజ లామెను గాశ్మీర రాజ్య సుధర్మ పీఠినిఁ

ప్రతిష్ఠించిరి. ఈ కార్య కలాప మంతయుఁ గృష్ణుని వలన జరగినది. కాశ్మీర భూభాగము పార్వతికిఁ జెందిన దనియుఁ, ద దధిపతి శివాంశ మనియుఁ, - కల్హణుఁడు దన "రాజ తరంగిణి" యం దుల్లేఖించి నాఁడు.

పూర్వ కాలమునఁ గాశ్మీర లోయను "సతీ సరస్సు" అని పిలుచు చుండెరి. హిమవన్నగ ప్రాంతముల నున్న యీ "సతీసరస్సు" భూతములచేఁ బీడింపఁ బడు చుండెను. ఆ భూతము లీ సర స్తీరమున నెటనో దాఁగి యుండి ప్రజల నాహుతిఁ గొను చుండెడివి. ఇది సూచి కాశ్యపర్షి యీ భూతములను, ఆ భూతనాయకుం డగు జలోద్భవుని, హత మార్చిన తర్వాత నీ సర స్తీర ప్రాంతమంతయుఁ గాశ్మీర మండలముగ రూపొందె నని 'కల్హణుఁడు' దన 'రాజతరంగిణి' యందు వ్రాసి యున్నాఁడు. కాశ్మీరము రమ్య హర్మ్యము లకు — మహోత్తుంగ ఫలవృక్షములకు - విద్యకుఁ - గుంకుమ పువ్వునకు - మంచు నీటికిఁ - బ్రసిద్ధి వహించి యుండెను.

కాశ్మీర మందలి శైవమతమును "త్రికమతము" నని యందురు. క్రీ. శ. ఎన్మిదవ శతాబ్దమున ని మ్మత మత్యు చ్చదశ యం దున్నది. "త్రికమత" వాఙ్మయము ఆగమ, స్పంద, ప్రత్యభిజ్ఞాన శాస్త్రము లని విభాగింప వచ్చును. ఆగమములు ఉపసర్గ - మానవ - హేతువులకు సంబంధించిన వని వసుగుప్తునకు శివుఁడు సెప్పి నట్లుఁ జెప్పఁ బడిన

"శివసూత్రము"లకు వృత్తి కలదు. భాస్కరుని వార్త్తికమును, క్షేమరాజ "విమర్శిణి"యు, శివసూత్రములకు వృత్తులు.

క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దపు టర్థ భాగమునందున్న కల్లటుఁడు స్పంద కారికలును - వారి వృత్తులును - సమీకరించినాఁడు. ఇ కల్లటుఁడు వసుగుప్తుని యంతేవాసి. వసుగుప్తుని మఱియొక యంతేవాసి సోమానందుఁడు. "శివదృష్టి" యను గ్రంథమున నాధ్యాత్మిక సమన్వయముల నుట్టంకించి యున్నాఁడు సోమానందుని యంతేవాసి "ఉత్పలుఁడు." ఈ ఉత్పలుఁడు "ఈశ్వరప్రత్యభిజ్ఞాన కారికల"ను, వీని ప్రశిష్యుఁడు అభినవ గుప్తుఁడు "పరాత్రింశిక" — "తంత్రాలోక" — "తంత్రసార" — లోనగు గ్రంథములను, — రచించిరి అభినవ గుప్తుఁడు కాశ్మీర శైవమునఁ, బ్రత్యభిజ్ఞాన దర్శనమునఁ, బ్రవేశము గలవాఁడు. ఇతని శిష్యుఁడు క్షేమరాజును, ప్రశిష్యుఁ డగు యోగరాజును, — సంప్రదాయమును నిలువరించినారు. మాధవుని "సర్వదర్శన సంగ్రహము"నఁ బ్రత్యభిజ్ఞాన దర్శనము సమీక్షింపఁ బడినది. ఈ దర్శనమున శివుఁడే పరతత్త్వ మని యుద్ఘాటింపఁ బడినది. ముప్పది యాఱు తత్త్వములలో విశ్వమును దనలోన నిముడ్చుకొను ప్రజ్ఞ శివశక్తి యందుఁ గలదు. ఈ చిచ్ఛక్తి గౌరి యున్మేష మనియెదరు. ఆమె యున్మేషమున విశ్వవ్యాప్తియు, నిమేషమున శైత్యమును, గలుగు చుండును. శంకరుని వివర్త వాదమునఁ జెప్పఁ బడినదే "ప్రత్యభిజ్ఞాన దర్శనము"న సూచింపఁ బడిన యాభాస వాద

మని తెలియ నగును. విశిష్టాత్మ పయిని శక్తిపాదుఁడు శివు ననుగ్రహమ్మున విముక్తి కలుగునని చెప్పి నాఁడు. ఇదియె 'ప్రత్యభిజ్ఞ' మని విదిత మయ్యెడిని.

కాశ్మీర దేశస్థుఁ డగు "జగద్ధార భట్టు" క్రీ. శ. 1350 దవ సంవత్సరమున "కుసుమాంజలి"ని రచించి నాఁడు. ఇది ముప్పది తొమ్మిది కాండముల తోడను, 1409 పద్యముల తోడను, నొప్పారు చున్నది. శివోత్కర్షను జాటు ఈ గ్రంథమును వీక్షించిన యెడలఁ గాశ్మీర శైవ మహత్త్వ మును గ్రహియింపఁ గలము.



# కల్చరల్ హెరిటేజి

ప్రపంచ మందలి యే జాతి కైనను ఆ జాతియొక్క పూర్వచరిత్రమే జీవ మై యున్నది. చరిత్రలేని జాతికి జీవము లేదు. సంస్కృతి లేదు. నాగరకత లేదు. స్వార్థపరత్వమును సంకుచిత దృక్పథమును బోఁగొట్టి నిస్వార్థతను, అందులకు వలయు విశాల దృక్పథమును. నొసంగు నదియే సంస్కృతి. సంస్కృతి మానసిక ప్రవృత్తికిఁ జెందినది. వేలకొలఁది సంవత్సరముల నుండియు భారతీయ సంస్కృతి మానసిక ప్రవృత్తితో ముడి వెట్టఁబడి యున్నది.

ఈ మానసిక ప్రవృత్తి సంస్కృతికి వినూత్న వికాసమును, తేజస్సును, జీవకళను, జేకూర్చును. అట్టి సంస్కృతిని, ఆ సంస్కృతికి వికాసమును నొడఁగూర్పఁ జాలు మానసిక ప్రవృత్తులను, భవిష్య త్సంతతికి నందఁజేయు నుద్దేశముతో మన పూర్వులు భద్రపేటికల యందు నిక్షిప్త మొనర్చి యున్నారు. ప్రతివాఁడు నట్టి సంస్కృతినిఁ, బరిపూర్ణతను, సముపార్జించి తోటి సోదరుల కందఁజేయ వలయు ననుట భారతీయ సంస్కృతి సారము.

ఆంధ్ర సంస్కృతికిఁ బ్రాతిపదిక భారతీయ సంస్కృతి. అయిన నాంధ్రసంస్కృతికిఁ బ్రత్యేకత కలదు. భరతఖండ మందలి జాతు లన్నియుఁ దమ యభిరుచుల కనుగుణముగఁ దమ సంస్కృతులఁ దీర్చి దిద్దికొనినవి. ఆ సంస్కృతులే యా జాతుల జీవిత సౌభాగ్యములుగ నగపడు చుండును. ఏ జాతి

ధర్మమును, సత్యమును, న్యాయ్యమును, సౌందర్యమును, గమనించి వర్తించినదో ఆ ప్రవర్తనయె సంస్కృతి యన్న మాట! మానవ జీవితమున కెయ్యది పరమప్రాప్య మని భావించి స్పష్టపఱచినదో అదియె సంస్కృతి.

పూర్వవస్తు పరిశీలనము వలననే చరిత్ర లభింపఁగలదు. తద్వస్తు సంపత్తి చరిత్రకు దేహము వంటిది. కళాకుశలత చరిత్రకు జీవనము. దేశమాత తన బిడ్డలకు నిక్షిప్త మొనర్చిన సాంస్కృతిక నిక్షేపములే యీ పూర్వవస్తు సంపద. ఈ సంపదను భద్రపఱచికొని యుపయోగించుకొనుట జాతి యొక్క విధ్యుక్త ధర్మము.

కావుననే జాతీయ భావవిలసనమునకును, బలమునకును, ఐక్యతకును, జాతీయచరిత్ర పఠనముకంటె నధిక మైనది లేదని "జే. అండర్సన్" అను నతఁడు వ్రాక్రుచ్చి నాఁడు.

ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించి నంతవఱకుఁ దొట్టఁదొల్తఁ బరిశోధన మారంభించినది కల్నల్ మెకన్జి దొర. ఇతఁడు క్రీ. శ. 1783 వ సంవత్సరమునఁ జెన్నరాజధానికి ఇంజనీయరుగా వచ్చినాఁడు. క్రీ. శ. 1790 – 92 సంవత్సరములలో "టిప్పుసులతాన్" తో జరగిన యుద్ధములలోఁ బాల్గొన్నతర్వాత దత్తమండలములు (Ceded Districts)ను, హైదరాబాదు సంస్థాన మందలి కొంత భాగమును, సర్వే చేయుటకుఁ గా నితఁడు బంపఁబడి నాఁడు.

క్రీ. త. 1796 వ సంవత్సరమున నాంగ్లేయులు సింహళ ద్వీపమును స్వాధీన పఱచి కొన్నయపుడు అచట ప్రధాన యంత్ర శాస్త్రజ్ఞుఁడుఁ (Chief Engineer) గాఁ బనిచేసినాఁడు. క్రీ. త. 1798 దవ సంవత్సరమునఁ బుదుచ్చేరి (Pondicherry) ముట్టడి నవలోకించుచు, సమీక్షించుచు, నుండినాఁడు. క్రీ. త. 1799 దవ సంవత్సరమున శ్రీరంగ పట్టణమును ఆంగ్లేయులు స్వాధీనముఁ జేసి కొన్నయపుడు మెకన్జి దొర అచ్చట నుండుటయే గాక క్రీ. శ. 1810 దవ సంవత్సరము వఱకును మహీశూర రాష్ట్రము (Mysore State) సర్వేచేయుచు నుండినాఁడు. క్రీ. త. 1811 వ సంవత్సరము నుండి క్రీ. త. 1815 దవ సంవత్సరము వఱకును 'జావా' ద్వీపమున నుండి నాఁడు. క్రీ. శ. 1816 వ సంవత్సరమున సర్వేయరు జనరల్‌గా నియమింపఁ బడి వివిధ ప్రాంతముల ననఁగాఁ గుమార్యగ్రము (Cape Comiran) నుం డికృష్ణా మండలము (Kristna District) దాఁకఁ బర్యటన మొనర్చి నపుడు శాసనములను, స్థానిక చరిత్రలను (Local Records), సేకరించి నాఁడు.

ఆ సమయంబున నెందఱనో సర్వేయరుల, లేఖకుల, నియమించి తన యుద్దిష్ట కార్యమును నెఱవేర్చి కొని నాఁడు. కాని క్రీ. శ. 1818 దవ సంవత్సరమునఁ గాళీఘట్టమున (Culcutta) కు నుద్యోగ రీత్యా వెడల వలసి వచ్చినది. ఆ నూతనోద్యోగమును జేయుచును గూడ శాసన పరిశోధనము, చరిత్ర పరిశీలనము, గావించుచునే యుండి నాఁడు.

కాని యతఁడు సంకల్పించిన కార్యము ముగియక ముందె యనఁగాఁ క్రీస్తు శకము 1821 వ సంవత్సరమున నాతని యిరువ దెన్మిదవ యేఁటఁ జనిపోయెను.

కాఁగా, నప్పటి రాజప్రతినిధి (Governor-General) మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్సు (Markuies of Histings) మెకన్జీ భార్య దగ్గఱ నతని విజ్ఞాన సంపదను అనఁగా కయిఫియ్యతుల నన్నిఁటినిఁ బదివేల పౌనుల నిచ్చి తీసికొని వాని నిభజించుఁ డని H. H. విల్సన్ దొరను నియమించెను. క్రీ. శ. 1828 దవ సంవత్సర ప్రాంతమున మెకన్జీ దొర సేకరించిన కయిఫియ్యతులలో దక్షిణాది భాషలకు సంబంధించినవి చెన్నపట్టణమునకుఁ బంపఁ బడియెను. చెన్నరాష్ట్ర ప్రభుత్వము (Madras Government) వారి యుత్తర్వుల ననుసరించి క్రీ. శ. 1858 దవ సంవత్సర ప్రాంతమున మెకన్జీ దొర సేకరించిన సాధనములను రివరెండు టెయిలరు దొర సంపుటీకరించి నాఁడు.

మెకన్జీ దొర సేకరించిన వానిలో శేషించిన వ్రాఁత ప్రతులను,— శాసనములను,—నైఁదు పెద్ద సంపుటములుగ రివరెండు టెయిలరు దొర నిక్షిప్త మొనర్చి నాఁడు.

క్రీ. శ. 1783 వ సంవత్సరమున కల్నల్ మెకన్జీ దొర చెన్నరాజధానికి వచ్చినది మొదలు భారత దేశ చరిత్రను, వాఙ్మయమును, — జక్కఁగాఁ దెలిసికొన వలయు నను కోర్కి యాతనికిఁ గలిగెను. కలిగిన నాఁటి నుండియుఁ దన

యుద్యోగ రక్షా మర్యాదలకు నావంత యేనిఁ దో్రటుపాటు రానీయక, భంగము కలుగ నీయక, శాసనాలఁ బరిశీలించు టకుఁ, జరిత్రాన్వేషణమునకుఁ, గడంగెను ఇ య్యాంగ్లో ద్యోగికిఁ జరిత్ర జిజ్ఞాస నిర్హేతుకముగనే కలిగిన దనుట యం దెట్టి సంశయమును లేదు. అది పూర్వజన్మ లబ్ధ మనియె యెంచ వలయును.

కావుననే మెకన్జీ దొర చరిత్ర నన్వేషింప వలయు నను జిజ్ఞాసతోఁ నిఱువది వేల రూపాయల సొంత ద్రవ్యమును వెచ్చించి, తెనుఁగు, అఱవము, కన్నడము, మహారాష్ట్రము, ఫారసీ భాషలకు నొక్కొక్క దాని కొక్కొక్క విద్వాంసుని నియమించి, వారలకు జీతబత్తెములఁ దానే భరించుచు దేశ దేశములకుఁ బంపి, చరిత్ర సాధన సామగ్రి సేకరింపఁ గలిగెను.

ఇ వ్విధముగ సేకరించిన నూతన విజ్ఞాన సంపదను వివిధ పత్రికలలో వ్యాసముల రూపమ్మున లోకమ్మున వెదఁ జల్లి దర్పణము పగిది ప్రకాశింపఁ జేయు చుండెడి వాఁడు. ఇతఁడు సనిపోయిన తర్వాత నీతని చరిత్ర జిజ్ఞాస, ప్రాము ఖ్యత, యోగ్యత,— గమనించి, ప్రాగ్భారత సంఘము (East India Company) వారు మెకన్జీ భార్యకు లక్ష రూపాయల నిచ్చి యీతని విజ్ఞాన సంపదను అనఁగా కయి ఫియ్యతులను ఆమె యొద్దఁ గైకొనిరి కద!

పశ్చిమఖండ మందలి ప్రతి చిత్రవస్తు ప్రదర్శనాలయము నందును బరాసు పాలాస్త్రి (Plaster of paris) తోఁ

జేయఁబడిన అమరావతీ శిల్పప్రతిమ లుండుటకుఁ గారణము మెకన్జీయే యనినఁ జాలును. ఈ కీర్తి ప్రతిష్ఠ లన్నియు నిత నికే చెందవలసి యున్నది.

క్రీ. శ. పదునెన్మిదవ శతాబ్దమున శ్రీ రాజా వాసి రెడ్డి వేంకటాద్రి నాయఁడు అమరావతీ పట్టనమునఁ దన ధర్మహర్మ్యమును నిర్మించికొనుటకును, అమరేశ్వరాలయ నిర్మాణమునకును,— 'దీపాల దిన్నె' యను దిబ్బను గొంతఁ ద్రవ్వించి యచట లభ్యము లయిన గొప్ప నాఁపఱాల బండ లను, బెద్ద పెద్ద ఇటుకలను,— ఉపయోగించు కొనఁగా, న య్యదను నెఱింగి, సమయ మర్మముఁ దెలిసికొని, కాలగతి ననుసరించి, చుట్టు పట్టుల నున్న వారునుం గూడ ని య్యవ కాశమును వృథఁ జేయక దమకుఁ గావలసినప్పు డెల్ల నీ "దీపాల దిన్నె" యందలి చెక్కడఁపు బండలఁ దీసికొని పోవు చుండి రఁట ! సున్నము గాల్చుటకుఁ గూడఁ గొన్ని బండలు పగులఁ గొట్టఁబడి నాశము సేయఁ బడియెను.

ఇ వ్విధముగ వెలలేని శిల్పసంపద రూపఱు చుం డఁగాఁ, దెలుఁగు వాండ్ర సుకృత ఫలమో యను నట్లు కల్నల్ మెకన్జీ దొర క్రీ.శ. 1797వ సం.రమున అమరావతికి నుద్యోగరీత్యా చనుదెంచి, యచటి కట్టడముల సొబఁగును, శిల్పకళా రమణీయతను, దత్రాపి శిల్పుల కళానైపుణ్యమును, వారి భావశబలతను, బరికించి చకితుఁ డై, ముక్కుమీఁద వ్రే లిడికొని, శ్రీ రాజా వేంకటాద్రినాయఁ డిఁకముందు దిబ్బలఁ ద్రవ్వించి నాఁపఱాల బండల నుపయోగించుటకు

పీలులేకుండఁ బ్రభుత్వము వారిచే నుత్తర్వుల రావించి నిలుపుదలఁ జేయించుటయే గాక ఆ "దీపాల దిబ్బ"ను గుఱించి యొక వ్యాసమును (Royal Asiatic Society Journal, Vol. IX,) లోఁ బ్రకటించినాఁడు.

కాఁగా, ఆ స్తూపముయొక్క విఖ్యాతి ప్రాక్ప్రతీచీ ఖండంబుల మాఱ్మ్రోఁగెను. తత్రాపి మెకన్జి దొరకుఁ జరిత్రాన్వేషణమునఁ గల చొఱవ, శ్రద్ధాభక్తులు, దిగంతముల వ్యాపించినవి.

క్రీ. శ. 1816 వ సంవత్సరమున మెకన్జీ దొర మరల నమరావతికి విచ్చేసి యా స్థళము నంతను బరిగణన (Survey) మొనర్చి యా స్తూపము యొక్క ఆకృతి లోనగు వానిం జిత్రించి ( Royal Asiatic Society Journal ) లో వ్రాసినాఁడు. తన వెంటఁ జిత్రలేఖకులఁ గొందఱను గొంపోయి యచటి ఱాల పయినిం గల చెక్కడఁపుఁ బనుల ప్రతిమల వ్రాయించి యొక గ్రంథమును సిద్ధముఁ జేయించెను. ఇప్పుడా గ్రంథము లండన్ (London) నగరమ్మున భారత కార్యలయము (India House) లో నున్నది.

వ్యాస భట్టారకుఁడు శ్రీమద్భారతమును రచించి యొక ప్రతిని స్వర్లోకముననను, మఱియొక ప్రతిని అధో లోకముననను, వేఱొక ప్రతిని భూలోకముననను, దాఁచి యుంచి నట్లు కల్నల్ మెకన్జీయును సంగ్రహించిన చరిత్ర సంపుటిని ఆంగ్లప్రభుత్వము వారు ముత్తెఱంగుల విభజించి యం దొక

భాగమును లండను (London city) నగరాన భారత కార్యాలయము నందును, మఱియొక భాగమును గాళీఘట్టము (Calcutta) నందలి 'Royal Asiatic Society Journal' నందును, వేఱొక భాగమును చెన్నపట్టనపు రాజధాని కళా శాల (Presidency college) లోను, భద్రపఱచిరి.

చెన్నపట్టనమున భద్రపఱచిన భాగమునే ప్రభుత్వము వా రిప్పుడు ప్రాచ్య లిఖిత గ్రంథాలయము (Oriental Library) న నుంచిరి. ఆ కాగిదములు క్రిమి కీటములకుఁ దావలము లై జీర్ణము లగుచుండుటను జూచి ఛార్లెసు ఫిలిప్ బ్రౌన్ దొర డెబ్బది సంపుటములుగాఁ గట్టించి భద్రపఱచి నాఁడు. ఈ సంపుటములనే స్థానిక చరిత్ర (Local Records) లని యందురు.

లండను నగరానఁ, గలకత్తా నగరానఁ, గల గ్రంథ ములకుఁ బ్రతుల వ్రాయించి తెప్పించు నుదారత, దొడ్డ బుద్ధి, మన ప్రభుత్వము వారి కేనిఁ గలుగుఁ గావుత మని భగవంతునిఁ బ్రార్థించు చున్నాఁడను.

"లండను నగరానఁ గల భారత కార్యాలయ మందలి మెకన్జీ దొర, సేకరణకు సంబంధించిన తెలుఁగు గ్రంథంబుల పెక్కింటికి సూచిక (catalogue) వ్రాయించుటకుఁబూనునెడల నా గ్రంథములఁ దమకుఁ బంపు"డనియచటి గ్రంథాలయాధికారి శ్రీ థామసు (Mr. Thomas) కొంతకాలము క్రిందటఁ జెన్నపురి విశ్వవిద్యాలయాధికారులకుఁ దెలుపఁగాఁ, దమకు ద్రవ్యము లేదు గనుక ఆ పనిఁ జేయింపఁ దమచేఁ గాదని యా గ్రంథా

లయాధికారికి మద్రాసు విశ్వవిద్యాలయాధినేతలు (University Authorities) దెలిపిరఁట! చూచితిరా! మన విశ్వవిద్యాలయాల యోగ్యత! మనోబలము!

ఆంధ్రదేశ చరిత్ర పరిశీలనమునకు - శాసన పరిశోధనమునకు - శాసనములఁ జదివి యర్థముఁ జెప్పుటకు - యథార్థ చరిత్ర రచనకు,— సర్వవిధములఁ దమ జీవితముల నంకిత మొనర్చిన మెకన్జీ దొరకుఁ గుడిభుజముగా నుండి తన శక్తి సామర్థ్యములను, యాక్తిక ప్రభావాదులను, మేధా సంపదను, బణముగా నొడ్డిన మహాత్యాగి కావలి వేంకట బొఱ్ఱయ్య. వీ రిర్వుర సంస్కృతిని వృద్ధిపఱచుకొనుటకు స్వతంత్ర భారతమున నాంధ్రరాష్ట్ర మేర్పడిన తర్వాతఁ జాలి నన్ని యవకాశము లగపడు చున్నవి.

మన పూర్వ సంప్రదాయములు, మర్యాదలు, సెడకుండ మన మెంతవఱకైనఁ బురోగమించు సాధనలు, అవకాశములు, గలవు గాన వానిం జాఱ విడువ వల దని మనవి.

మెకన్జీ యొద్దఁ బనిచేసిన వారిలో ముఖ్యుఁడు కావలి వేంకట బొఱ్ఱయ్య. ఇతఁడు చరిత్ర - వాఙ్మయ పరిశోధనలకుఁ ద్రోవఁ జూపి నాఁడు. స్వయముగఁ గృషిచేసి, శాసనములఁ జదివి, యర్థముఁ జెప్పుచుండెడి వాఁడు. ఇతనికి నేఁడు భాషలు వచ్చును. పశ్చిమ గోదావరి జిల్లాలోని యేలూరు వాస్తవ్యుఁడు.

మెకన్జీ యొద్దఁ బనిచేసిన వారిలో నింకొకఁడు బాబూరా (Babu Rao) వను నతఁడు దక్షిణ దేశమునఁ బర్యటించి లిఖిత పత్త్రములను, నాణెములను, శాసనములను, సంపాదించి నాఁడు. శ్రీ శృంగగిరి శంకరాచార్య పీఠము నకు సంబంధించిన శాసన ప్రతులను సేకరించి సముద్ధరించిన మేధావి.



## " చారిత్రక బ్రహ్మ "

# కావలి వేంకట బొర్రయ్య :

ఆత్మవిస్మృతి నందిన భరతఖండమున స్వదేశచరిత్ర స్మరణము కంటె దేశోన్నతి సాధక మైనది వే రొకటి లేదు. వేదకాలము నుండి యిప్పటి వఱకును మన దేశమునఁ దట స్థించిన యవస్థా భేదములు, సాంఘిక రాజకీయాది పరివర్తన ములు, ఇతర దేశముల తోడి సంబంధము, – లోనగు సకల విషయములఁ బరికించి భారతీయ సభ్యత విదేశీయ సభ్యతల కెందును దీసిపోవ దని రూఢిపఱచుట విద్వాంసుల ధర్మము. ఇప్పటికిఁ దొల్తఁ బూనికొని మనకుఁ ద్రోవఁ జూపినది పాశ్చాత్య విద్వాంసు లని యొప్పికొనక తప్పదు.

సంస్కృతమునను, పాళీభాషలోను, మధ్యయుగంబునఁ బారసీక భాషయందును, – దేశచరిత్ర గ్రంథములు వ్రాయఁ బడిన మాట యథార్థము.

కల్హణుని "రాజ తరంగిణి", బిల్హణుని "విక్రమాంక దేవ చరిత్ర", బాణుని "హర్ష చరిత్ర" వంటి సంస్కృత గ్రంథములును, 'అశోక వదన' – 'దివ్యవదన' – లోనగు పాళీగ్రంథములును, ఫెరిస్తా, బదానీ, అబుల్ ఫజుల్, హుశేన్ ఖాన్, వ్రాసిన చరిత్రలును, – ఇందులకుఁ దార్కాణలు. కేవల చరిత్ర గ్రంథములు గా కున్నను చరిత్రకు ముఖ్యా ధారము లని చెప్పఁ దగు "బౌద్ధ జాతక కథలు"ను, పురాణ

ములం గల "కలియుగ రాజ వంశావళులు"ను, – గలవు. కాని ప్రాచీన శాసనాదికములఁ బరిశోధించి చరిత్రల వ్రాయు పద్ధతి క్రీస్తు శకము పందొమ్మిదవ శతాబ్ది యందె ప్రారంభ మయ్యెను. సంస్కృత భాష నభ్యసించుట వలనఁ గావ్య, పురాణ, నాటకాదుల రసము నాస్వాదించి, షడ్దర్శనముల మహోన్నత భావ పరంపరలకుఁ జకితులై, తర్క, వ్యాకరణ. జ్యోతిశ్శాస్త్రములకు సబ్బురం పడిన పాశ్చాత్య విద్వల్లోకము క్రమ క్రమముగ భారతీయుల పూర్వ చరిత్రను బరిశోధించు టకు నారంభించినది.

మన పండితు లీ పనికి దొరఁకొనుటకు ముందె గ్రాంటు డఫ్, విల్కున్ ఓర్మ్, – మొదలగు నాంగ్ల సైనికోద్యోగు లును – ప్రభుత్వోద్యోగులును. – మన చరిత్ర యందలి కొన్ని ఘట్టములఁ గైకొని వ్రాయ నారంభించిరి. వీ రే ప్రాంతమున నుద్యోగ రక్షామర్యాదల నెఱపు చుండిరో ఆ ప్రాంతమునకు సంబంధించిన చరిత్రను వివరించి వ్రాసిరి. సమకాలీన మగు చరిత్రను గాని, యంతకు నొకటి రెండు శతాబ్దముల పూర్వపు జరిత్రను గాని, వీరు వ్రాయుట వలన వీరికిఁ బ్రాచీన చరిత్రాంశముల నుద్దీపిత మొనర్చు సంస్కృ తియు, పాళీవాఙ్మయమును శిలా తామ్ర శాసనములను బరిశోధింప వలసిన యగత్యమును, – లేకపోయెను.

ఇఁకఁ, దురుష్క చరిత్రాభిజ్ఞుల గ్రంథముల నాధా రించికొని "ఎలిఫిన్ స్టన్" తన చరిత్రను వ్రాసికొనియెను. బ్రిటిషు ఉద్యోగులు వ్రాసిన చరిత్రలలో కల్నల్ టాడ్

వ్రాసిన "రాజస్థాన చరిత్ర" ప్రముఖమై, ప్రశస్తమై, కొన్ని పట్టుల భారత రామాయణాది కావ్యములఁ బోలి యున్నది. ఈయన స్వయముగ రాజస్థానము నంతను బర్యటించి చారణుల, భట్టుల, కవి వృషభుల, పాటలఁ బద్యముల విని, సంస్థానాధీశులతో సంప్రదించి, వారి వంశ చరిత్రల, భూర్జర పత్త్రములఁ, బరిశీలించి, గ్రంథమును విరచించెను.

ఇటీవలి పరిశోధనల వలనఁ గొన్ని మార్పు లగత్య మయ్యెను మొత్తము పయిని నీకాలమున నీ గ్రంథమును మించినది లేదని నిస్సంకోచముగఁ జెప్ప వచ్చును. ఇంతియ కాదు న్యాయమూర్తి రనడే తన "మహారాష్ట్ర విజృంభణము" నను గ్రంథము రచించు వఱకును మన దేశచరిత్రకు సంబంధించిన యిట్టి యుత్తమ గ్రంథము వెలువడి యుండ లేదు. సంస్కృతము మొదలగు ప్రాచ్య వాఙ్మయములఁ బరిశోధించి క్రొంగ్రొత్త విషయములఁ బ్రకటించుటకును, ననుసరించుటకును, బ్రిటిషు రాయల్ ఏటియాటిక్ సొసైటి (British Royal Asiatic Society) కి సంబంధించి కలకత్తా, బొంబాయి నగరాలలో సంఘములు నెలకొలుపఁ బడియెను.

సర్ విలియం జోన్స్, కోల్బ్రూక్, మొదలగు విపశ్చిద్వరులు వ్రాసిన గ్రంథముల నాంగ్లీకరించి విషయములఁ బెక్కింటిని వ్రాయు చుండిరి. మన ప్రాచీన సభ్యతను గుఱించి యూరపు ఖండమునకు – అమెరికా ఖండమునకుఁ, – జాటు చుండిరి. ఈ ప్రయత్నములకు మోక్షమూలరు (Max-Mullar) వంటి శార్మణ్య దేశపుఁ బండితులును దోడ్పడిరి.

కాని కేవల చరిత్ర పరిశోధన కివి యంతగా నుపకరించ లేదు. శాసనములు, నాణెములు, పురాతనపుఁ గట్టడములు, విశేషముగ నుపయోగించి మన దేశచరిత్రను వ్రాయ నుప క్రమించిన వారిలో ప్రభుత్వ పరిశోధక శాఖోద్యోగు లగు జనరల్ కన్నింగ్ హామ్, రీహాల్ట్సు, - అను వారలును, బావు దాజీ, భగవన్‌లాల్ ఇంద్రాజీ, సర్. డాక్టరు రామకృష్ణ భండార్కరు, రాజేంద్రలాల్ మైత్రా, - అను వారలును, ముఖ్యులు. వీరు సాంచి, తక్షశిల, అమరావతి, లోనగు సుప్రసిద్ధ క్షేత్రములను, భారత వర్ష మం దనేక చోట్ల దివ్య జ్యోతుల వలె వెలుఁగొందు అశోకుని శిలా శాసనములను, నానాఘట్టము - నాసికల యందలి యాంధ్ర శాతవాహన చక్రవర్తుల శాసనములను, బరిశోధించి, పరిశీలించి, బయల్వ ఱచి, వివేచకుల కవకాశ మొదవించిరి. గ్రీకు- రోమను చరిత్ర కారుల వ్రాఁతలకును, ఈ శాసనస్థ విషయములకును, బురాణ ములకును, అందలి కథాంశములకును, జక్కఁగా సమన్వయ మును గుదుర్చి యందలి దివ్య జ్యోతిని గనఁ బఱచిరి.

ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించి నంత వఱకును దొట్టఁ దొల్తఁ బరిశోధన మారంభించినది కల్నల్ మెకంజీ దొర. అతనికి సర్వ విధముల శాసనములఁ జదివి యర్థముఁ జెప్పుట యందును, పరిశోధన సల్పుట యందును, కుడి భుజము వోలెఁ దోడ్పడిన వాఁడు వెలూరు వాస్తవ్యుఁ డగు కావలి వేంకట బొట్టయ్య.

పరిశోధనకు గుణాతిరిక్తములు, అనౌచిత్యములు, గాసట బీసటలు, సైతమవసరమే! కాఁబట్టి యీ సమధిక దృష్టితో నాంధ్రదేశ చరిత్రను గూర్చియు, వాఙ్మయమును గుఱించియుఁ, బరిశోధించిన జిజ్ఞాసువులలో వేంకట బొర్రయ్య ముఖ్యుఁ డనవచ్చును. మన దేశ విజ్ఞాన జ్యోతినిఁ గనిపట్టి, వెలిఁగించి. ఖండ ఖండాంతరముల నగపింపఁ జేయు టకుఁ బాటువడిన కల్నల్ మెకన్జీ దొరకు ద్విభాషి (Translater) గా నున్నయతఁడు కావలి వేంకట బొర్రయ్య.

ఉత్తర హిందూస్థానమునం గల శాసనములఁ జదువు టకుఁ దొట్టఁ దొల్తఁ బ్రయత్నించి నందులకు "ప్రిన్సెప్ దొర"కు నేయే యాదరాభిమానములు, గౌరవ మర్యాదలు, సత్కారములు, గలవో అట్టి గౌరవ మర్యాదలే, యాదరాభి మానములే, సత్కారములే, మన వేంకట బొర్రయ్యకును గలుగ వలసి యుండెను గాని భరత ఖండమున నందునఁ దెలుఁగు దేశమున వేంకట బొర్రయ్య జన్మించి యుండుట వలనను, దెలుఁగు వాండ్రకుఁ జరిత్రాన్వేషణాసక్తియుఁ, జరిత్ర జిజ్ఞాసయు, లేకుండుట చేతను, – నూట యేఁబది సంవత్సరముల క్రిందటఁ గల యీ యాంధ్రదేశ చరిత్ర పరి శోధకాగ్ర గణ్యునకుఁ గలుగలేదు.. అట్టి యి మ్మహామహుని సొంతముగ మఱచితిమి గదా! కాల చక్ర ప్రభావమున కేమన వలయునో గదా!

దక్షిణ భారతమునకు సంబంధించిన చారిత్రక – భౌగోళిక – సాంఘిక – నైతిక విషయాలతో నిబిడీకృత మైన

మెకన్జీ వ్రాఁతప్రతులు చరిత్ర పరిశోధకులకు నత్యంతావశ్యకములు. కావుననే సర్. క్లెమెంటు మార్ఖం దొర "మెకన్జీ వ్రాఁత ప్రతుల వలననే దక్షిణా పథ ప్రాచీన చరిత్ర మనకుఁ జాల వఱకుఁ దెలియ వచ్చు చున్నది" యని చెప్పఁ గలిగెను. ఈ వ్రాఁత ప్రతులను సేకరించి సమీకరించుటలోఁ దోడ్పడిన కావలి వేంకట బొర్రయ్య సోదరులు ప్రశంసా పాత్రులు. కనుకనే యాంధ్ర సారస్వత పరిష ద్విచక్షణ సమర్పిత "చరిత్ర రచనా ధురీణ" "విమర్శక శిరోమణి" బిరుదాంకు లగు డాక్టరు నేలటూరి వేంకట రమణయ్య M. A., Ph. D. గారు "వీరే యాంధ్ర చరిత్ర పరిశోధకు" లని ప్రశంసించి నారు.

కావలి సోదరులలో వేంకట బొర్రయ్య మహామేధావి. వ్యుత్పన్నుఁడు. సంస్కృ, తాంధ్రాంగ్ల, హిందుస్థాని, పారశిక భాషల యందు నిష్ణాతుఁడు. కవి. ఆయన మధుర ప్రకృతియు, నచంచల కార్యదీక్షయు, మెకన్జీదొరను విస్మితు నొనర్చి యాయన యాదరాభిమానముల నత్యంతముగఁ జూఱఁ గొనఁ గల్గినవి.

కావలి వంశీయులలోఁ గొందఱు విజయనగర రాజుల యొద్దను, గోలకొండ నవాబుల దగ్గఱను, సచివోత్తములుగా వ్యవహరించి శశ్వద్యశస్సు నార్జించిరి. సంపన్న గృహస్థులు, నియోగి బ్రాహ్మణులు, నగు కావలి వేంకట సుబ్బయ్య దంపతులకు నారాయణప్ప, రామస్వామి, లక్ష్మయ్య, బొర్రయ్య, సీతయ్య యను కొమాళ్ళును, నొక కొమార్తయుఁ,

గలిగిరి. వీరిలో నాలవ వాఁడే మన వేంకట బొర్జియ్యా. ఈయన ఏలూరు పట్టనమునఁ గ్రీస్తు శకము 1776 వ సం॥ర మున జన్మించి పదియేండ్ల వయసు వచ్చునం దాఁక ఏలూరు నందలి వీథిబడి యందె సదువు సంతలు సాఁగించి యవల నింటి దగ్గఱనే సంస్కృతము నేర్వ సాఁగెను. కాఁగా, సంస్కృత మభ్యసింప మొదలిడిన యాఱు మాసముల లోపలనే సంస్కృత శ్లోకముల వ్రాయ నారంభించెను. ఆయన ధీ సంపత్తి కిది యొక తార్కాణ. సంస్కృతాంధ్రభాష లీ రీతి నార్జించి యుండఁగా నాతని సోదరులు ప్రాగ్భారత సంఘము (East India Company) వారి కొల్వు నం దుంటచే నప్పటి రాజ భాష లగు పారశీక - హిందూస్థాని భాషలను మన వేంకట బొర్జియ్యా నేర్చికోఁ దలఁచి ప. గో. జిల్లా యందలి 'ఏలూరుఁ (Ellore) నకు దగ్గఱగా నున్న 'కొత్తూరు' గ్రామంబునఁ బారసీక, హిందూస్థాని భాషల రెండిఁటిని నేర్చిన యొక మహామ్మదీయ జాగీర్దారు నొద్ద నభ్యసించి, యా పిమ్మట నాంగ్లభాషను గూడ నేర్వవలసిన యగత్య మేర్పడి యున్న విషయమును గుఱుతించి, పదునాలుగేండ్ల వయసున మచిలీ పట్టణమున (Masulipatam) కుం జని 'మిష్టరు మోర్గన్' పాఠశాలలో నింగ్లీషు భాష నభ్యసించుటకుఁ జేరి, విశ్రాంతి సమయంబులఁ దెలుఁగు కావ్యాల, నందున అత్తలూరి పాపయ గ్రంథములను, ఛందో వ్యాకరణములను, జదువు చుండెడి వాఁడు. కావలి వారికి అత్తలూరి పాపయ్యా చుట్ట మఁట ! ఇవ్విధంబున బహు భాషా పరిజ్ఞానము గలిగించు

కొని యుండుటచే నాయన జీవిత దర్పణమునఁ ద ద్భాషాభిజ్ఞత ప్రతి ఫలించినది.

వేంకట బొర్రయ్య మచిలీ పట్టనమున నింగ్లీషు విద్యఁ బూర్తి చేసికొని యేలూరునకు రాఁగానే యచట స్వదేశీయ సిపాయదళమున కధిపతి యగు "కల్నల్ పియర్స్ దొర"తోఁ బరిచయ భాగ్య మొదవి యందలి సైన్యమునకు జీత బత్తెముల నిచ్చు కార్యస్థానము (Military Pay master Office) న జీతాలఁ బంచియిచ్చు నుద్యోగి (Pay clerk) గా నియమింపఁ బడియెను. ఒంగోలు, మునగాల, కొండపల్లె, - మొదలగు చోట్లఁ గల సైన్యములకుం గూడ జీతాల నిచ్చుటకు బొర్రయ్య పంపఁబడు చుండెను. ఈ విధముగఁ దనకు నియామక మైన యుద్యోగమును శ్రద్ధతో నిర్వహించు చుండుట వలనఁ బై యధికారుల మన్ననల నందికొని నాలుగేండ్లు కడచన్న పిదప నున్నత లేఖకులుఁగా "మాధవపాళెము"న 'మిష్టరు డెంటుదొర' నియమింప నెంచిన తఱుణమున నదృష్ట రేఖ తిరుగుటచేఁ గాఁబోలు మెకన్జీదొర యొద్ద పెద్ద గుమాస్తా (Head clerk) గా నియమింపఁ బడియెను. అప్పటికి బొర్రయ్య వయసు పందొమ్మిదేండ్లు మాత్రమే! ఇ య్యుద్యోగము మెకన్జీదొరకు ద్విభాషిగా వ్యవహరించిన బొర్రయ్య యన్న నారాయణప్ప వలన లభించినది.

క్రీ. శ. 1792-98 సంవత్సరములలో సర్వే (Survey) చేయు నిమిత్తమై కల్నల్ మెకన్జీ దొర హైదరాబాదులో

నుండఁగా నారాయణప్ప తన తమ్ముఁడగు బొర్రయ్యను మెకన్జీ దొరకుఁ బరిచయ మొనర్చెను. ఏ సుముహూర్తమ్మున నారాయణప్ప మెకన్జీ దొరకు బొర్రయ్యను బరిచయ మొనర్చెనో యా ముహూర్తము నుండియె వా రిర్వురును దక్షిణాపథ చరిత్ర పరిశోధనకును, అందునను ఆంధ్రుల చరిత్రకును, ప్రాతిపదిక వేసిన వా రయిరి. వీ రిర్వుర సమాగమ సాహచర్యము లిర్వుర జీవితములలో గొప్ప పరిణామములఁ గల్పించెను.

మెకన్జీ వ్రాఁతప్రతు లని నేఁడు వ్యవహరింపఁ బడుచున్న చారిత్రక లేఖనముల సృజియించిన వారిలో బొర్రయ్య విశిష్టుఁ డని చెప్ప వచ్చును. చరిత్ర రచనకు వలయు సాధన సంపత్తిని సేకరించుటయె యాతని ధర్మమై యుండెను. ఆ ధర్మ నిర్వహణమునకే యతఁడు దన జీవితము సంకేత మొనర్చి నాఁడు. ఆ దినములలో ప్రయాణ సౌకర్యములు గాని చక్కని మార్గములు గాని లే వనియె నొడువఁ దగును. విపిన వీథులలో పర్వత ప్రాంతములలో బొర్రయ్య పరియాణింప వలసి యుండెను. శ్రీశైల శిఖరంబున నితఁడు గొంత కాల ముపవసించె నని ప్రబవక్త మాచున్నది. భోగలాలసుఁడు గాక చరిత్ర పరిశోధకుఁడుఁగాఁ గాలము గడపి నాఁడు. కల్నల్ మెకన్జీయే బొర్రయ్య కార్యదీక్షకు, సౌజన్యతకు, ముగ్ధుఁ డయ్యెను.

క్రీ. శ. 1797 వ సంవత్సరమున 'మనిలా' లో నొక తిరుగుబాటు (Revolution) జరగుటచేఁ బ్రాగ్భారత

సంఘము (East India Company) వారు ఆ తిరుగు బాటు నణఁచుట కయి మెకన్జీని 'మనిలా' కుఁ బంప నిశ్చ యించుట వలన బొర్రయ్య హైదరాబాదును విడచి చెన్న పట్టనముఁ జేరి యట నుండి 'మనిలా' కుఁ బయన మయ్యెను. కాఁగా, బొర్రయ్య యేలూరు సేర వలసి వచ్చెను. బొర్రయ్య యేలూరు నం దున్నను చారిత్రక దృక్పథము వీడలేదు. ఆ కృషి కొంత వడ లేదు. చారిత్రకాంశముల సేకరింపఁ గోరి బొర్రయ్య సాహిత్యాధ్యయన మొనర్పఁ జాఁగెను. ఎడనెడ గీర్వాణాంధ్ర భాషలలోఁ గవిత నల్లు చుండెడి వాఁడు. క్రీ. శ. 1798 దవ సంవత్సరము మేనెలలో వేంకట లక్ష్మయ్య మెకన్జీ యొద్ద ద్విభాషి (Translator) గాఁ జేరినాఁడు. "మనిలా" తిరుగుబాటు ముఁగిసిన తర్వాత మెకన్జీ దొర హైదరాబాదు సేరి కొనఁగా బొర్రయ్య చరిత్ర పరిశోధనకుఁ గడంగెను. గాని యాతని పరిశోధనకు మరల నాతంక మొదవెను క్రీ. శ. పదునెన్మిదవ శతాబ్దపుఁ జరమ భాగము ప్రాగ్భారత సంఘము (East India Company) వారికిఁ బరీక్షా కాలము. మైసూరు సులతానుఁ డొక క్రేవను, పరాసు వారి ప్రేరణమున హైదరాబాదు నవాబొక ప్రక్కను, ప్రక్కలోని బల్లెములం బలెఁ బ్రాగ్భారత సంఘము వారిని బాధింపఁ జొచ్చిరి. తుదకుఁ గ్రీస్తు శకము 1798 దవ సంవత్సరమునఁ దూర్పిండియా కంపెనీవారు మైసూరును బరి పాలించు టిప్పు సులతానుతో యుద్ధమును బ్రకటించిరి. ఆ యుద్ధమున మెకన్జీ దొర సైతము పాల్గొన వలసి వచ్చెను.

కాఁగా, హైదరాబాదు నుండి మెకన్జీతోఁ గూడి బొజ్జియ్య కూడ మైసూరునకుఁ బయనించెను. ప్రయాణమున కుద్దేశించి నప్పటి నుండియు బొజ్జియ్య 'దినచర్య' వ్రాయ నారంభించెను. 'దినచర్య' ను వ్రాసి వారిలో నితఁడే ప్రథముఁడు. అంతియకాక విశ్రాంతి సమయములలో సంస్కృతములోను తెలుఁగు లోను పద్యములఁ బెక్కింటిని రచించి నాఁడు. హిందూ దేశ చరిత్రను వ్రాయుటకు సారస్వతము నుండి యనేక విషయాలు సంగ్రహించి నాఁడు. ఏలూరు నం దున్నయపుడు గూడ గొన్ని యంత్రోప కరణములఁ జేయుటయే గాక ఇతర కళలలోఁ గూడ నైపుణ్యము నగపఱచి నాఁడు. వీని యన్నింటికిఁ దోడుఁగ బొజ్జియ్య సౌజన్య సత్స్వభావములు ఏలూరు పట్టణ ప్రజల నాకర్షించినవి.

ఇ విధముగఁ గ్రీస్తు శకము 1798 దవ సంవత్సరము వఱకును జరగఁగా, నా యేఁట టిప్పు సులతాను పయికి యుద్ధమును బ్రకటించి వెడలుచు బొజ్జియ్యను శ్రీరంగ పట్టణమునకు రావలసిన దని మెకన్జీదొర యుత్తరు వొసంగెను. కాఁగా, బొజ్జియ్యయు నాతని యుత్తర్వు ననుసరించి గద్వా లకుఁ జని యట నుండి బయల్దేఱఁగనే మెకన్జీ దొర యొద్ద నున్న ప్రభుత్వ సంబంధ పత్త్రిములఁ గొన్నింటిని గద్వాల నృపాలుని భటతతి యపహరించె నని తెలిసికొనియెను. కాఁగా, మెకన్జీ దొరయు నా కాగిదముల నెల్లని వెదకి పట్టు కొని తెం డని బొజ్జియ్యకుఁ జెప్పి మైసూరునకుఁ బోఁగా,

బొట్టియయ్యయుఁ దన ధీశక్తి నుపయోగించి యన్వేషించు చుం డఁగా, జమీన్దారుఁ డాతని బంధించి కారాగారమున నిర్ద యతో బాధింపఁ జొచ్చెను. గాని యతఁ డా బాధలు కర్మ సంబంధము లని, యనుభవింపక తప్ప దని, ప్రశాంత చిత్తుఁడై యోర్మి వహించి యుండఁగా, నాతని సహనమును జూచి జమీన్దారు హృదయము ద్రవీభూత మయి నందున బొట్టియ్య యా జమీన్దారుని పయిం గొన్ని పద్యములు వ్రాసి పంపఁగా, న పద్యములఁ బరిశీలించి యా కవితల్లజుని నిర్హేతుకముగ నిర్బంధించి బాధించుట దోష మని, యా దోష మెన్ని జన్మముల నేనిఁ దగులక తప్ప దని, యింతటి పాపకార్యమునకుఁ గడంగుట మహాపరాధమే యని, యిందు లకు నిష్కృతియే యగపడ దని, వాపోయి తోడనే బొట్టి య్యను బంధవిముక్తు నొనర్చి రావించి, తన తప్పిదమును సైరించ వలసిన దని ముకుళిత హస్తుండై వేఁడికొని యాతని బహుప్రకారంబుల సత్కరించి, యపహరింపఁ బడిన మెకన్జి దొర కాగిదములను బొట్టియ్యకు సమర్పించెను.

ఆ పిమ్మట బొట్టియ్య మెకన్జినిఁ గలసికొని సైన్యముల ననుసరించి శ్రీరంగ పట్టనమునకుఁ బోయి టిప్పు సులతానుతోఁ బ్రాగ్భారత సంఘము (East India Company) వారు గావించిన యుద్ధమును బరిశీలించు చుండెను. కాఁగా, న య్యుద్ధమునఁ బ్రాగ్భారత సంఘము వారికే విజయము లభించి శ్రీరంగపట్టణము వారి స్వాధీన మయ్యెను. ఆ దృశ్య మును గనులారఁ గాంచిన బొట్టియ్య త ద్దృశ్యము నంతను

వర్ణించుచు గంభీరభావ బంధురముగఁ బద్యముల సంతరించి నాఁడు. ఇ పద్యములలోఁ బ్రాగ్భారత సంఘము వారు తమ పతాక (Flag) ను కోట బురుజులపై నెగురవైచిన పద్ధతి, ఇఱు పక్షములం గల బలాబలములు,— లోనగునవి వర్ణింపఁ బడినవి. ఇ వర్ణనాంశముల విలోకించి మెకంజీ దొర ముగ్ధుడై బొఱ్ఱయ్యను బహుప్రకారంబులఁ బ్రశంసించి, సత్క-రించి, గౌరవించెను.

శ్రీరంగ పట్టణము కంపెనీ వారి యధీన మైన తర్వాత నచటి పరిస్థితులఁ జక్కఁ బఱచు నుద్దేశముతోఁ గ్రీస్తు శకము 1799 దవ సంవత్సరము జూన్ నెలలో నొక కమీషన్ నియమింపఁ బడియెను. ఆ కమీషన్‌కు సలహాదారుఁడుఁ (Advisor to Commission) గా కల్నల్ మెకంజీ నియుక్తుఁ డయ్యెను. సరిహద్దుల నిర్ధరించుట కేర్పడిన ఈ సంఘము (Commission) నందుఁ బనిచేయుటకు మెకంజీ దొర చెన్న పట్టణము నుండి మైసూరునకుఁ బోయెను. క్రీ. శ. 1800 సంవత్సర ప్రాంతమున మెకంజీ దొర మైసూరు సర్వేకుఁ గడంగెను. ఆ సందర్భమున బొఱ్ఱయ్య మెకంజీతోఁ గూడి చిత్రదుర్గము (Chital Durg), బెంగుళూరు (Bangalore), నిజగల్లు (Nijagallu),— లోనగు ప్రదేశములలోఁ బర్యటించి యా యా ప్రదేశంబుల లభించిన చరిత్రాంశములను సేకరించెను. ఈ చరిత్రాభిజ్ఞత ననుసరించి మైసూరు రాష్ట్రమునకుఁ దొలుత రాజధానిగాఁ దేజరిల్లిన "ఉమ్మత్తూరు" చరిత్రను వర్ణించుచు బొఱ్ఱయ్య

యొక కావ్యమును వ్రాసి యా కావ్యమునకు "శ్రీ రంగ రాయ చరిత్ర" యని పే ర్వెట్టెను. క్రీ. శ. 1800 సంవత్స రము నందే వేఱొక కావ్యమును బొఱ్ఱయ్య రచించెను. సర్. ఆర్థర్ వెలస్లీ దొర "హరిహర్" అను ప్రదేశమున మహారాష్ట్ర సేనా నాయకుం డగు 'దూండియా' అను వాని నెలుపొందఁగాఁ, గనులారఁ గాంచిన యా విషయము నితివృత్తముగాఁ గైకొని "వెలస్లీ విజయ గాథ" యను పేరితో నొక కావ్యమును సంతరించిన వెనుక న చ్చోటఁ గల యోగిని యొక ర్తుకను గూర్చి "సత్పురుష వర్ణన" మను పేరితో నొక శతకమును వ్రాయఁగా, న య్యోగిని మాహాత్మ్యము త చ్ఛతకమునఁ జక్కఁగా వివరింపఁ బడు టచే జనరల్ క్యాంపుబెల్ ప్రభృతులు మిక్కుల సంతసించి బొఱ్ఱయ్యను శతధా వినుతించి రఁట ! అ క్కతన బొఱ్ఱయ్య ప్రతిభ లోక విశ్రుత మైనది.

ఆవల "జైనుల వృత్తాంత" మను గ్రంథము నాంగ్లీ కరించి, మహారాష్ట్ర భాషలో నున్న "భారత ప్రభుత్వ మంతరించిన తర్వాత మొగలుల ప్రభుత్వమునఁ గర్ణాటక దేశమున నేర్పడిన ముఖ్య రాజకీయ సంఘటనలు" – అను గ్రంథమును గూడ నాంగ్లీకరించెను. ఈ గ్రంథము మెకన్జి దొర వ్యాఖ్యతోఁ గూడ "Daltrymple's Oriental Reportery" లోఁ బ్రకటింపఁ బడియెను.

శ్రీ రంగ పట్టనమున సైన్య నివహంబులు నిలువఁ దగిన పరిస్థితి లేకుండుట వలన ఆ సైన్య నికాయమును

వివిధ ప్రదేశంబులకుఁ దరలించిన సందర్భములో బొఱ్ఱయ్య మైసూరు ప్రాంతమునే గాక రాయల సీమను గూడఁ బర్యటించెను. ఆ పర్యటన సందర్భమున మైసూరు దివాన్ పూర్ణయ్యయు, జనరల్ క్యాంపుబెల్ దొరయు, కల్నల్ మన్రోయును, — మన బొఱ్ఱయ్య విజ్ఞాన దీధితులకు — సుద్యోగ దక్షతా మర్యాదలకు — మెచ్చుకొనిరి. అప్పటికి బొఱ్ఱయ్య గణిత శాస్త్రమున, రేఖా గణితమున, జ్యోతిశ్శాస్త్రమున, భూగోళ శాస్త్రమున, — ప్రాక్ప్రతీచీ సంప్రదాయములలో సిద్ధహస్తు లయిరి.

క్రీ. శ. 1801 వ సంవత్సరమునఁ జెన్నపట్టన మందలి ఫోర్టు సెయింటు జార్జిలో మెకన్జీ యొక యుద్యోగిఁగా నియుక్తుఁ డగుట వలన బొఱ్ఱయ్యయు మెకన్జీ వెంటఁ జెన్నపురి కరుదెంచెను. వచ్చినది మొదలు వా రిద్దఱును జరిత్ర రచనా బంధురు లయిరి. ప్రాచీన లిపి యం దున్న తెలుఁగు శాసనములఁ బఠించి ప్రతి బింబముల వ్రాయుట, దేశ భాషలలో నున్న చారిత్రిక లేఖనముల సంశోధించి యందు ముఖ్యమైన లేఖనముల నాంగ్లీకరించుట, – లోనగు కృషి యొనర్చుచు నా కృషి యందె సతమత మాచుండెడి వాఁడు. అ వ్విధంబుగ రెండేండ్లు గడచెను. శాసనములఁ జనువుట యందుఁ గూడ బొఱ్ఱయ్య యందె వైచిన చేయి. "దాదర" గ్రామములో 'హాళ' కన్నడమునఁ జెక్కఁ బడిన శాసనమును జదివి యర్థముఁ జెప్పఁగా, మెకన్జీ దొర యూతని శేముషీ విభవమును మిపులఁ బ్రశంసించి, సంతో

పించి, యూరోపియను నాతని పేరును జెక్కించి Royal Asiatic Society భవనమున భద్రపఱచి నాఁడు. ఆ శాసన మిప్పటికిని ఆ భవన మందె కలదు.

యుద్ధాదు లణఁగి దేశము నం దంతను శాంతి భద్రతల వాతావరణ మగపడిన తర్వాత యంత్ర సాహాయ్యము లేకయే చేతి తోడ దేశ పటముల వ్రాయ నభ్యసించి మెకన్జీ దొరనే మెప్పించి నాఁడు మన బొర్రయ్య. కాని యేమి ప్రయోజనము? తెలుఁగు వాండ్ర దురదృష్ట వశమ్మునఁ గాఁ బోలు బొజ్జయ్య తన యిర్వది యేఁడవ యేఁటఁ గ్రీస్తు శకము 1803 వ సంవత్సరమునఁ జనిపోయెను. అతఁడూ చనిపోయి నందులకు మెకన్జీ దొర తన కత్యంత యభిమాన పాత్రుఁ డగు బంధువు చనిపోయి నట్లుఁ గాఁ జింతించి యాయన కొక స్మారక చిహ్నమును జెన్నపట్టనపు సముద్రపు టొడ్డున ఫోర్టు సెయింటు జార్జి కోటకు నెదురుగ నిర్మింపఁ జేసెను. ఈ చిహ్నము అనఁగా శాసనము క్రీ. శ. 1829 దవ సంవత్సరమున బొజ్జయ్య తమ్ముఁడు వేంకట రామస్వామి "దక్కను కవుల చరిత్ర" (History of Deccan Poetry) ను వ్రాయు వఱకు నగపించెను గాని యిప్పు డా శాసన మగపించుట లేదు. కాలగర్భమున లీన మైనది కాఁబోలు! మన ప్రభుత్వము వారి విషయమున శ్రద్ధ వహింతురా?

బొజ్జయ్య చనిపోయి నప్పుడు "బొజ్జయ్య సాహాయ్య సంపత్తి వలననే భారతీయ విజ్ఞాన మందిర ప్రాంగణమునకుఁ

బోఁ గలిగితిని. భారత దేశ భాషల యందలి పరిజ్ఞానము సేకరింపఁ జాలితిని. అప్పుడే యాయనకు మీాసకట్టు వచ్చు చుండెను. అంతకు ముందు దేశభాషల నేవియు నేర్చిన వాఁడఁ గాను. ఆ మహామహుని ప్రోత్సాహ కతమ్మునననే యా భాషల నేర్వఁ గలిగితిని. ఆ విజ్ఞాన ఖని గ్రామ గ్రామము, వాడ వాడ, పల్లె పల్లె, వీథి వీథి, తిరిగి తిరిగి చరిత్ర రచనకు వలయు వస్తు సేకరణకుఁ గడంగి యా సేకరించిన వస్తు సంచయమును జారిత్రక దృష్టితోఁ బరి శోధించి నాఁడు. బుద్ధిమతాం వరిష్ఠుఁ డయిన బొఱ్ఱయ్య వలన భారతీయ విజ్ఞానమునకు, సభ్యతకు, సంస్కృతికిఁ,—గొప్ప త్రోవ యేర్పడినది. ఆయన కృషి, ఆయన విధా నములు, ఆయన సోదరులును, నా దగ్గఱఁ బనిచేయు నితరు లును, గ్రహించి పనిచేయుట గర్వించఁ దగ్గది." యని బిట్టు వాపోయి నాఁడు.

మైసూరు ప్రాంతపుఁ బరిగణనము (Survey) ముగి సిన తర్వాత నందులకు సంబంధించిన నివేదికలు, పట ములు,—మొదలగు వానిం దయారు సేయుటలో బొఱ్ఱయ్య - మెకన్జీలు నిమగ్నులై యవ్విషయముల దృష్టిఁ గేంద్రీకరించి యుండఁగాఁ గ్రీస్తు శకము 1803 వ సంవత్సరము జనవరి నెల 7 వ తేదీన బొఱ్ఱయ్య స్వర్గస్థుఁ డయ్యెను. ఇమ్మహా మహుని యకాల మరణమునకు మెకన్జీ దొర హృదయము శోకానల దందహ్యమానమై స్మారక చిహ్న మేర్పాటు సేసి యుండఁగాఁ, దచ్చిహ్న మిప్పు డగపింప కుండుట

(6)

దురదృష్ట మనక తప్పదు. ఈయన బహుముఖ ప్రజ్ఞా ప్రాభవ కీర్తులను, దత్సంబంధ మైన యాతని జీవిత చరిత్రాంశములను, ( Royal Asiatic Society Journal ) లో క్రీ. శ. 1834 వ సంవత్సరమునఁ బ్రకటితము లయినవి.

మన చరిత్ర పరిశోధక సమ్రాట్టగు బొజ్జయ్యకుఁ బండ్రెండవ యేఁట ననఁగాఁ గ్రీస్తు శకము 1788 దవ సంవత్సరమున "కళిమ కోట" జమీన్దారు లగు శ్రీ మారెళ్ళ వేంకటచలం పంతుల వారు తమ సోదరి నొసంగి యుద్వాహమ్మొనర్చిరి. ఆమె కొక యాఁడు పిల్ల మాత్రమే కలిగెను.



# వేంకట లక్ష్మయ్య

ప్రసిద్ధ చరిత్ర పరిశోధక సమ్రాట్టుగా శాశ్వతయశస్సు నార్జించిన వేంకట బొఱ్ఱయ్య చనిపోయిన పిమ్మట నాయన తమ్ముఁడు వేంకట లక్ష్మయ్య యాతని స్థాన మాక్రమించి నాఁడు. బొఱ్ఱయ్యలో పుణికి పుచ్చుకొని యున్న విశిష్ట గుణము లన్నియు లక్ష్మయ్య యందుఁ గుదురుకొని యున్నం దున నన్నివిధముల నతఁడు బొఱ్ఱయ్యకుఁ దగిన వాఁ డని తలఁచి మెకన్జి దొర క్రీ. శ. 1803 వ సంవత్సరమునఁ దన దగ్గఱఁ బనిచేయుచున్న లేఖకుల కందఱకు నాయకుఁడుఁగా నియమించెను. అప్పటి యాతని జీతము నలువది వరహాలు మాత్రమే ! ఇంత జీత మీతనికిఁ దప్ప నితరులకు లేదు. దీనిం బట్టి యర్హతల ననుసరించి మెకన్జీ దొర తన యొద్దఁ బనిచేయు వారలకు జీత బత్తెముల నిచ్చుచుండి నట్లవగత మగు చున్నది.

కాని లక్ష్మయ్య విషయమున నర్హతను గనిపట్టుటయే గాక ఆతని కుటుంబ పరిస్థితులఁ గనిపట్టియు జీత మీ విధమున నిచ్చు చుండె నని చెప్ప వచ్చును. "జాన్ రిడ్జెల్"కు "మెకన్జీ" వ్రాసిన "నా యొద్ద లేఖకులు (clerks)గాఁ బ్రవేశించు నాఁటికిఁ గావలి సోదరులు బీదలే! వారు గౌరవ ప్రపత్తులు గల కుటుంబమునకుఁ జెందిన వారు. ఆ కుటుంబ మిప్పు డార్థిక సంక్లిష్ట పరిస్థితులలో నలిగి పోయినది. ఆస్తి పాస్తులు సున్న. నే నిచ్చు జీతబత్తెములతో నేలూరు,

మచిలీ పట్టనము, చెన్నపట్టనములం గల యేం డెన్మిది కుటుం బములం బోషించుకొను చున్నారు. 15,20, 25, 35 వరహాల జీతములతో వారు దమ కుటుంబముల నన్నిటిని సంభాళించు కొనవలసి యున్నది" యను లేఖను బట్టి కావలి వారి కుటుంబ పరిస్థితులు లవగతము కాం గలవు.

ఒక సమయమ్మున లక్ష్మయ్య సౌశీల్యాది గుణములను బేర్కొనుచు మెకన్జి వ్రాసిన లేఖను గమనింపుడు. "లక్ష్మయ్య యెన్నండును ద్రవ్య విషయంబున నన్ను మోస గించి యెఱుంగండు. జాగరూకత గల్గిన భృత్యుం డతండు. తన సౌఖ్యముల నేని లెక్కం జేయక నా కొఱకు శ్రమ పడిన సంగతి నే నెఱుంగుదును. అతండు ద్రవ్యము లేని వాండే కాని నిజాయితీ కలవాం" డని వ్రాసిన యీ వాక్యములం బట్టి లక్ష్మయ్య ఋజువర్తనుండు, నిష్కపటి, నిస్స్వార్థి, యని చెప్ప వచ్చును. కావుటం జేసియే లక్ష్మయ్య మెకన్జిని ఆకర్షింపం గల్గినాండు. బొర్రయ్య వలె నితండును జారిత్రక దృక్పథము గలాండు. చరిత్ర రచనకు ననుకూ లించు శాసనాదుల సేకరించుటలో ముం దడుగు వైచి న ట్లగపించు చున్నది. మెకన్జి మైసూరు సర్వే చేసినప్పుడు లక్ష్మయ్య సైతము పాల్గొని న ట్లగపించెడిని. లక్ష్మయ్య సమర్థుండే యైనను నాతని జీవిత యాత్ర యెదుదుడుకులు లేకుండం, దొట్రుపాటు లేకుండం, జాంగి యుండ లేదు. అతండు దన జీవిత పథంబునం జీంకటిని వెన్నెలను గూడం జూడం గలిగెను.

క్రీ. శ. 1811 వ సంవత్సరమున మెకన్జి దొర 'జావా' ద్వీపమునకు నుద్యోగ ధర్మ నిర్వహణమున కయి పోవలసి వచ్చి క్రీ. శ. 1815 దవ సంవత్సరము దాఁక నచ్చటనే యుండెను. తన కన్నివిధములఁ దోడు నీడగా నుండుచున్న మెకన్జి దొర 'జావా' ద్వీపమున నుండి నందు వలన ఆ నాలుగేండ్లును నాల్గు యుగంబులుగా లక్ష్మయ్యకుఁ గడచెను. అతఁ డార్థికముగఁ బడరాని పాట్లుఁ బడియెను. అప్పుల పాలయ్యెను. కాఁగా, ఋణదాత లూరకుందురా? వారి యొత్తిడి వలనఁ గ్రీస్తు శకము 1817 వ సంవత్సరమున లక్ష్మయ్య కారాగారమున బంధింపఁ బడి పడరాని బాధలఁ బడవలసి వచ్చినది. ఇ వ్విషయము నాలించి మెకన్జి యెంతఁగనో వ్యథఁ జెందెను. జావా ద్వీపము నుండి చెన్నపురికి మరలి వచ్చిన తర్వాతఁ గ్రీస్తు శకము 1817 వ సంవత్సరమున మొట్టమొదటి ఇండియా సర్వేయర్ జనరల్ (First Surveyar-Ceneral of India) గా మెకన్జి దొర నియమింపఁ బడఁగా, నతని కార్యాలయము కలకత్తాలో నేర్పడినది. ఉద్యోగ రీత్యా కలకత్తాలో నుండుట కతఁ డిష్టపడఁ డయ్యెను. గాని చెన్నపట్టనమున నున్నయపుడు దనతోఁ గూడఁ జరిత్ర పరిశోధనమున శ్రద్ధాసక్తులఁ జూపిన లక్ష్మయ్య ప్రభృతి ప్రముఖుల నెల్లఱ రావించఁ దలఁచి విచారించఁగా, సచ్ఛీలుఁ డగు లక్ష్మయ్య కారాగారము''న క్రమగ్గు చున్నాఁ డని వినుకలి యై యా సత్య వ్రతున కిట్టి దుర్గతియా యని పెల్లు దురపిల్లి చెన్నపట్టన

మం దున్న 'జాన్ రిడ్జెల్' కు లేఖ వ్రాసి నాఁడు. ఆ లేఖ వలన లక్ష్మయ్యా నైతిక ప్రవృత్తి, అమాయకత్వాదు లవ గతము కాఁ గలవు.

లక్ష్మయ్యాకు మెకన్జీ క్రీ. శ. 1810 దవ సంవత్సర మునఁ గొంత ద్రవ్యము నొసంగి యుండెను. ఆ ద్రవ్యముతో నాతఁడు స్థిరవసతి నేర్పఱచికొని యుండె నని తలంచెను గాని యా సంవత్సరముననే లక్ష్మయ్యా బావగా రగు విస్సన్న పేఁట జమీన్దారు సనిపోయి నందు వలన మెకన్జీ యాయన కిచ్చిన ద్రవ్యమంతను దన సోదరి కీయ వలసి వచ్చెను. గాని యామె దాయాదు లామె యాస్తిపాస్తుల నెల్ల లాఁగి కొనఁ దలఁచి, వివదించి, రచ్చ కెక్కిరి. కాఁగా, న వ్వివా దాంశము ప్రివీ కౌన్సిల్ దాఁకఁ బోయి కడకుఁ క్రీ. శ. 1817 వ సంవత్సరమున విస్సన్న పేఁట జమీ బొజ్జయ్యా వంశ్యులకే చెంద వలయు నని తీర్పుఁ గాఁ బడియెను.

ఇది జరగిన పిమ్మట కల్నల్ మెకన్జీ చెన్నపట్టన మందె యొక యిల్లును గొని లక్ష్మయ్యా కొసంగుటయే గాక కొంత భూమిని గూడ లక్ష్మయ్యాకు వ్రాసి యిచ్చెను. కాని లక్ష్మయ్యా దురదృష్ట వంతుఁడు. మెకన్జీ యాయన కింత సాహాయ్యముఁ జేసినను ద త్ఫల మాయనకు దక్క లేదు. లక్ష్మయ్యా దాయాదు లీర్ష్యాసూయలు మెండు కొన్న వారై భూమినిఁ దమ యధీన మొనర్చి కోఁ దలఁచి లక్ష్మ య్యాను ముప్పు తిప్పలఁ బెట్టి మూఁడు చెఱువుల నీరుఁ ద్రాఁ గించిరి. ఆ యమాయకుఁడు పాపము! కల్నల్ మెకన్జీ

యిచ్చిన భూమిని ఋణదాతలకుఁ దాకట్టు పెట్టిన విషయము వినుకలియై యొకపరి మెకన్జి "To mortage the village granted to him is very mortifying, but what is to be done?" అని హృదయ విదారకమైన మనస్సంక్షోభ మైన వ్రాఁత వ్రాసినాఁడు.

అప్పుల వాండ్ర కా భూమి తాకట్టు పెట్టినను ఋణ విముక్తుఁడు కాఁ డయ్యెను. అయిదువేల వరహాలు ఋణ మును దీర్చని దోషమున లక్ష్మయ్య బంధితుఁడు గా వలసి వచ్చెను. అంత మొత్తము అప్పుచేయ లే దని లక్ష్మయ్య వాదించఁగా, న్యాయాధిపతులు నాల్గువేల వరహాలు మాత్ర మొసంగినఁ జాలు నని ప్రివీకౌన్సిల్ వారు తీర్పు నొసంగిరి. ఇవ్విధముగఁ జుట్టాలచే నతఁడు వంచింపఁ బడియెను. ఆ కష్టకాలమున్ను నాతఁ డనుభవించిన మనస్సంక్షోభ మా పరాత్పరునకే తెలియును. అవమాన హేతువుగాఁ గారా గారవాసమును బరిగణించె నని మెకన్జి దొరకుఁ దెలియ వచ్చి యొక లేఖలో "I cannot help still being uneasy for the poor man, (Lakshmaiah) knowing the nice disgrace they attach to put in gaol." అని యుట్టం కించెను. అమృత హృదయుం డగు మెకన్జియే సాహాయ్య మొనర్ప కుండిన లక్ష్మయ్య గతి దుర్గతియే గదా! కాని యట్టి దుర్గతికి లక్ష్మయ్య పాల్పడ నీక ఆత్మీయున కంటె నధిక ముగఁ బ్రేమించి యాతనిఁ గష్ట సముద్రము నుండి వెలికి లాఁగిన మెకన్జి దొర సౌహార్దయమున కెంత యని కొనియాడఁ గలము!

లక్ష్మయ్య ఋణవిముక్తుఁ డయిన తర్వాత మెకన్జీదొర యాజ్ఞ నొందలం దాల్చి కలకత్తాకుఁ బయనించెను. ఇతరోద్యోగు లంతకుఁ బూర్వమె ప్రయాణ మయిరి. లక్ష్మయ్య యా యుద్యోగులను మచిలీపట్టనమునఁ గలసి కొనియెను. ఆ కాలములో సముద్రయానము సంఘ బహిష్కారమునకు దారిఁ జూపు ననియుఁ, బాప కార్య మనియుఁ, — బరిగణింపఁ బడు చుండెను. కనుక సముద్ర ప్రయాణ మొనర్చుటకు లక్ష్మయ్య తటపటాయించెను. అందు వలనఁ బ్రయాణమునకు వలయు సాధక బాధకముల నన్వేషించి సుళువైన మార్గమును మెకన్జీ కనిపట్టి యేర్పాటు సేసెను. కాఁగా, వ్రాఁత ప్రతులఁ దీసికొని క్రీ. శ. 1818 దవ సంవత్సరము మే నెలలో లక్ష్మయ్య కలకత్తా చేరి మెకన్జీ దొరను గలసికోఁగా. మెకన్జీ పడిన సంతోషమున కవధియే కాన రాదయ్యెను.

ఆ నాఁటి నుండి మెకన్జీ దొర చనిపోవు వఱకు ననఁగాఁ, గ్రీస్తు శకము 1821 వ సంవత్సరము దాఁక లక్ష్మయ్య చరిత్ర పరిశోధనమున మెకన్జీతోఁ దోడ్పడుచు, నాయన చనిపోయిన తర్వాతఁ గూడ రెండేండ్లు కలకత్తా యందె యుండి డాక్టరు విల్సన్ దొరకు సూచిక ( catalogue ) తయారు సేయుటలో సాహాయ్య పడి యావలఁ గ్రీస్తు శకము 1823 వ సంవత్సరమునఁ జెన్న పట్టనమునకు వచ్చెను. వచ్చిన తర్వాతఁ గూడ లక్ష్మయ్య చరిత్ర పరిశోధనము నందె దృష్టి నిగుడ్చి కాలము వెడల నడపెను. సర్. అలగ్జాండరు జాన్

స్టన్ దొర ప్రోత్సాహమ్మున లక్ష్మయ్య "హైందవ సారస్వత సమాజము" నను 'సాహిత్య మండలి' నొక దానిం జెన్నపట్టనమున నెలకొలిపెను. ఆ మండలి యధ్యక్షుఁ డతఁడే! మెకన్జి వ్రాఁత ప్రతులను శ్రెస్సఁగాఁ బరిశీలించుట, ముఖ్యము లయిన వ్రాఁత ప్రతులకు ననువాదములు వెలయించుట, — ఇత్యాది యాశయములతో ఈ సాహిత్య మండలి యేర్పడినది. క్రీ. శ. 1830 దవ సంవత్సరమునఁ జెన్నరాష్ట్ర ప్రభుత్వము వారిని మెకన్జి వ్రాఁత ప్రతులను ఈ మండలి కిప్పింప వలయు నని లక్ష్మయ్య కోరఁగాఁ, బ్రభుత్వము వారును ఆ వ్రాఁత ప్రతులను లక్ష్మయ్య అధ్యక్షుఁడుఁగా నుండిన ఈ సారస్వత మండలి యధీన మొనర్చెను. "Royal Asiatic Society of Great Britain" సహాయ సభ్యుఁడు ( Co-member ) గాఁ "ప్రాచీన భారతీయ రాజవంశములు" ( Ancient Indian Ruling Classes ) అను నంశముం గూర్చి పరిశోధన సల్పుచున్నయట్లు క్రీ. శ. 1835 దవ సంవత్సరమున లక్ష్మయ్య వ్రాసిన యొక లేఖ విదితమొనర్చు చున్నది. ఇవ్విధముగఁ జరిత్ర పరిశోధనాసక్తితో విశ్రాంతి యను న దెఱుంగకయ పరిశ్రమించుచుండెను. కాని మెకన్జీ యనంతర మాతని స్థానమునకు వచ్చిన ప్రబుద్ధులు లక్ష్మయ్య పరిశ్రమమునకుఁ దగిన యుత్సాహప్రక్రియ గాని, శ్రద్ధకుఁ దగిన సత్కార ప్రోత్సాహములు గాని, యగపఱుప కుండుట విచారకరము.

క్రీ. శ. 1811 వ సంవత్సరము ఆగష్టు మూఁడవ తేదీన మెకన్జి వ్రాసిన మరణ శాసన పత్రమున "...... to my servant covally V. Lakshmaiah, Borriah and his younger brother Ramaswamy................ in some compensation for the useful services of the said Lechmiah and his late brother C. Booraiah. I desire that my brother, sister and friends, recollecting the value I had for these persons, will by no means attempt to lesson or defeat my intention in this respect, which I wish them to consider sacred and invoilable,"— అని వ్రాయుచుఁ దన యాస్తి యందలి పదయవ భాగము లక్ష్మయ్యకుఁ జెంద వలయు నని సూచించుటయే గాక క్రీ. శ. 1815 దవ సంవత్సరము ఫిబ్రవరి 18 దవ తేదీన మరల వ్రాయఁబడిన మరణ శాసన పత్రమునఁ గూడ లక్ష్మయ్య ప్రశంసఁ గావించి నాఁడు.

దీనిం బట్టి పరికింపఁగా లక్ష్మయ్య విశ్వసనీయుఁ డైన సేవకుఁ డనియు, ఋజువర్తనుఁ డనియు, సత్యవ్రతుఁ డనియు, బొర్రయ్యవోలె మెకన్జి యాదరాభిమానములకు భాజనుఁ డైన వాఁ డనియుఁ,- దెలియ నగు చున్నది. ప్రతిభాయుతుఁడైన బొర్రయ్యకుఁ దగిన సోదరుఁడే లక్ష్మయ్య యని పేర్వడసి నాఁడు. తత్రాపి చరిత్ర పరిశోధనమున, శాసన పరిశీలనమునఁ, ద త్పరన పాఠనములఁ, దమ జీవితముల నంకిత మొనర్చిన మహామహుల యెడ,- మెకన్జి దొరకుఁ గల లక్ష్యము, లక్ష్యమునకుఁ దగ్గ ఆదరాభిమానములు, జిజ్ఞాస, అందులకు వలయు కృషి,- ఆతని చిరస్మరణీయతకుఁ,— దార్కాణ మని చెప్పినఁ జాలును.

# వేంకట రామస్వామి

ఏలూరు వాస్తవ్యు లగు కావలి సోదరులలో నితఁ డొకఁడు. వేంకట బొర్రయ్య, వేంకట లక్ష్మయ్యల వలె నితఁడును జరిత్రరచనా సాధన సామగ్రిని సేకరించిన వాఁడే కాని బొర్రయ్య లక్ష్మయ్యల పట్లఁ గనఁ బఱచిన యాదరాభిమానములు, ఉత్సాహప్రోత్సాహములు, సాహాయ్య సంపత్తులు,- ఇతని యందు మెకన్జీకిఁ గలుగ కుండుటకుఁ గారణమూహ్య మై యున్నది. "As to Ramaswamy his brother I look upon him in a different light" అని యొక చోట రామస్వామిని గుఱించి మెకన్జీ దొర వ్రాసినాఁడు.

హైదరాబాదులో 'సర్వే' (Survey) జరగు చుండిన కాలమ్మున మెకన్జీ దొర యొద్ద నుద్యోగములోఁ జేరి జీత బత్తెములు లేకయే బహు కాలము పనిచేయఁగాఁ, దుదకు నిఱువది యైదు వరహాల వేతనము మీఁద లేఖకోద్యోగిఁగా నియమింపఁ బడి నట్లవగత మాచున్నది. ఇతఁడు సంతరించిన "దక్కను కవుల జీవిత చరిత్ర" ( Biographical sketches of Deccan poets) లను గ్రంథమును బట్టి విపశ్చిద్వరుం డని యీతనిఁ జెప్ప వచ్చును. ఆంధ్ర కవి చరిత్రకారులలో నితఁడే యగ్రగణ్యుఁడు. తొల్దొల్త వేంకట బొర్రయ్య జీవిత విశేషాదులను లోకమునఁ బ్రసంచించిన దితఁడే! అంతియ కాదు ప్రసిద్ధాంధ్ర కవుల వృత్తాంతములను బాశ్చాత్య ప్రపంచమునకుఁ దెలిపిన వాఁడును రామ

స్వామియే! కనుక రామస్వామి తన సోదరుల పాండితీ ప్రకర్షకుఁ, జరిత్ర పరిశోధనకు, శాసన పరిశీలనకుఁ, జరిత్ర రచనకు, — నే మాత్రము తీసి పోవని వాఁడే! యని చెప్ప వచ్చును.

చెన్నపురి కలాశాలలో నుద్యోగ మీయనకు లభించి నట్లును, గాని యా యుద్యోగమును దిరస్కరించి మెకన్జీ దొర కొలువుననే యున్నట్లును, "జాన్ రిడ్జెల్" అను నతఁడు వ్రాసిన వ్రాఁతలు విదిత మొనర్చు చున్నవి. క్రీ శ. 1827 వ సంవత్సరమున రామస్వామి "ప్రాచీన దక్కను దేశపటము" నొక దానిని రచించెను. అది కలకత్తాలోఁ బ్రచురింపఁ బడియెను. క్రీ. శ. 1829 దవ సంవత్సరమున నీతని "దక్కను కవుల చరిత్ర" కలకత్తాలోనే ప్రచురింపఁ బడియెను.

దక్షిణా పథ చరిత్ర రచనా సాధన సంపత్తి నొడఁ గూర్చుట కయియే తమ జీవితముల నంకిత మొనర్చిన కావలి సోదరులు కారణ జన్ములు, చిరస్మరణీయులు, ననక తప్పదు. వారి ప్రతిపత్తికయే యాంధ్రుల చరిత్రకు శ్రీరామ రక్ష. ఈ సోదరులకుఁ జరిత్ర పరిశోధనమునఁ, జరిత్ర రచన మున, అండదండ లైయి సంచరించిన కల్నల్ మెకన్జీ దొర యును చిరస్మరణీయుఁడే! యని గ్రహియించి నప్పుడే మనకు అభ్యుదయ మార్గ మగపింపఁ గలదు. ఆ మార్గమున నడచితి మేని గమ్యస్థానముఁ జేరఁ గలము.



# సర్ ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్

క్రీస్తు శకము పందొమ్మిదవ శతాబ్దమున నాంధ్ర భాషా వాఙ్మయముల నుద్ధరించి నిరుపమాన మగు భాషాసేవ నొనరించి చిరస్మరణీయుఁ డైన సర్ ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ (charles philip Brown) దొర క్రీ. శ. 1798 దవ సంవత్సరమున కలకత్తా నగరంబున జన్మించి నాఁడు. బాల్యము నందె హిబ్రూ, అరబీ, గ్రీకు, లాటిన్, - మొదలగు భాషలలోఁ గృషిఁ జేయ నారంభించి "హిందూస్థాని" భాషను గూడఁ జక్కఁగా నేర్చినాఁడు. ఇతని తండ్రి "డేవిడ్ బ్రౌన్" ( David Brown ) కలకత్తాలోఁ గ్రైస్తవమత బోధకులలో నొకఁడుగ నుండెడి వాఁడు. అందు వలన "ఫిలిప్ బ్రౌన్" కలకత్తా యందె విద్యాభ్యాసముఁ జేయుచుఁ దండ్రి చెప్పిన యట్లు ముద్రిత గ్రంథములకుఁ దప్పొప్పుల పట్టికలఁ దయారు సేయుటలో శిక్షణ మంది నాఁడు. కాని క్రీ. శ. 1812 వ సంవత్సరమునఁ దండ్రి 'డేవిడ్ బ్రౌన్' చనిపోవుట తోడనే పదునాలు గేండ్ల వయసులో నున్న "ఫిలిప్ బ్రౌన్" చదువు కొనుట కయి యింగ్లండు దేశమున కేఁగి (Hailesbury) అను చోట విద్య నభ్యసించెను. అచటఁ జదువుచున్న యపుడె హిందూస్థాని భాషలోఁ జేసిన కృషికి బహుమతి యొక దానిఁ బడయఁ గల్గెను. ఇంగ్లండు దేశమున నయిదేండ్లుండి క్రీ. శ. 1817 వ సంవత్సరము ఆగష్టు 4 వ తేదీనఁ జెన్నపట్టనమునకు వచ్చెను. వచ్చిన

కొన్ని నాళ్ళకే తెలుఁగు భాష నేర్వవలసి వచ్చినది. గాని యీ కాలమునఁ దెలుఁగు భాష నేర్చి కొనుటకుఁ దగిన గ్రంథ సామగ్రి లేకున్నను శ్రమించి నేర్చికొని దేశభాష లన్నిఁటిలోఁ దెలుఁగు భాష మిన్న యని, మిగులఁ గష్టమైన దని, వ్రాకుచ్చి నాఁడు.

సర్ థామస్ మన్రో (Sir Thomas Munro) చెన్న రాష్ట్ర పాలకుఁడుఁ(Governor of Madras Presidency)గా క్రీ. శ. 1820 దవ సంవత్సరమున విచ్చేసి "సివిల్ సర్వీసు" పరీక్షలు జరపు చుండఁగా, నాయన సమక్షమునఁ దెలుఁగు పరీక్షకుఁగాఁ గూరుచుండి బ్రౌన్ దొర క్రింది తరగతి (Loyar elass) యం దుత్తీర్ణుఁ డయ్యెను. పరీక్షకుఁ గూర్చుండిన యీ నాఁటి విద్యార్థుల కెల్లఁ అకు సర్ థామస్ మన్రో దేశభాషల నేర్వ వలయు నని గావించిన ప్రబోధ శంఖా రవము బ్రౌన్ దొర శ్రవణ పుటంబుల గింగురు మని మ్రోఁగి భాషా సంసేవనమునకుఁ బునాది పడెను.

భాష లన్నింటిలోఁ దెలుఁగు భాష కష్టమైనదని చెప్పిన బ్రౌన్‌దొర సివిల్ సర్వీసులోఁ జేరవలయు నని చది విన చదువు తెలుఁగు భాషను సేవించుటకే వినియోగపడి యెను. తెలుఁగు పరీక్ష యం దుత్తీర్ణుఁ డయిన తర్వాత నితఁడు 'కడప'లో నుప మండల న్యాయాధిపతి (Additional Dt. Judge) గా నియమింపఁ బడియెను. 'హాన్బరీ' దొర మండల న్యాయాధిపతి (District Judge) గా వ్యవహరించు చుండెను. కాఁగా, హాన్బరీదొర తెలుఁగు భాష చక్కఁగా,

సులువుగా, మాటాడు చుండుటను జూచి బ్రౌన్ దొర తెలుఁగు భాషను జక్కఁగా నభ్యసించి రెండేండ్ల కాలములో హాన్బరీ దొర మాటాడు దాని కంటెఁ దొందరగాఁ, జక్కఁగా, మాటాడఁ గలిగెను.

న్యాయస్థానమునకు వచ్చిన వాది ప్రతివాదులు, నేరస్థులు, సాక్షులు, భటతతి, అందఱును దన కా యా సమయముల నుచ్చారణ క్రమమును, పదప్రయోగోపసంహారములను, వ్యుత్పత్త్యర్థములను, సూచింపఁ గల్గిరి కావున వారెల్లఱును దనకు గురుతుల్యులే యని చెప్పి బ్రౌన్ దొర తన వినిర్మల హృదయమును, వినమ్రతను, జాటినాఁడు.

ఆ కాలమునఁ దెలుఁగు దేశము యొక్క జన సంఖ్యను గుఱించియు, భాషకును-దేశమునకును,- గల వివిధ నామములఁ గూర్చియు, సరిహద్దుల గుఱించియుఁ,- బరిశీలించి చారిత్రక దృక్పథముతో వెల్లడించి నట్లు "The Teluguor Tenugu nation (which foreigners call Telingana) fills a country larger than Spain, to the north and it is called Telingana or Golconda. (Marshman's History of India, Chapter IV, page 114.)

It is contained in circles which we may describe on the map around Cuddapah-Rajahmundry and Kondapalli the radious extending to Madras; also in one sound Visakhapatam, reaching to Ganzam towards Puri in Cuttak, after called Jagannadham..

In Rew. Wm. Campbell's British India, 1858, the nation is rated at nine (others say fourteen) millions of Hindus. The Musalman's dwelling among them are rated at about two millions. The earliest Literature eight hundred years old, various little from the modern Telugu. The Telugu Grammer and prosody have always been considered peculiarly intricate." — అను వాక్యము తెలుపఁ జేయు చున్నవి. ఇంతటి విస్తీర్ణత, వైశాల్యత, కలది యీ నాఁటి తెలుఁగు దేశము.

ఇవ్విధముగఁ దెలుఁగు దేశమును బరిపూర్ణముగ మనో ముకురమునఁ బ్రతిబింబించు కొనిన బ్రౌన్ దొర తెలుఁగు భాషకును, దెలుఁగు సాహిత్యమునకును, సేవఁ జేయఁ గృతనిశ్చయుఁ డయ్యెను. భవభూతి మహాకవి చెప్పినట్లు జననాంతర సౌహృదయము వలననే బ్రౌన్ దొర తెలుఁగు భాషా సంసేవనమునకుఁ గడింగిన దని చెప్పవచ్చును.

క్రీ. శ. 1822 వ సంవత్సరమున నితఁడు మచిలీపట్టనమున నుప న్యాయాధిపతి (Assistant Judge) గా నియమింపఁ బడి యీ మూఁడేండ్ల కాలములో దేవ నాగర లిపిని, బెంగాలి లిపిని, — నేర్చికొనుటయే గాక తెలుఁగు భాషకును, దెలుఁగు దేశమునకును, నెంతయో సేవఁ జేసెను.

జేరెట్. విలియం బ్రౌన్ వంటి పాశ్చాత్యులెందఱో యీతని భాషా పిపాసను దగ్గించ వలయు నని యెంచి తెలుఁగు

భాషను నేర్వ వల దని నిరుత్సాహ పఱచిరి. ఇది క్రీ. శ. 1826 వ సంవత్సరమున జరిగిన దన్న మాట! వా రెంత నిరుత్సాహ పఱచినను, అపహాసించినను, బ్రౌన్ దొర వజ్ర సంకల్పుఁ డౌటచేఁ గాఁబోలు వానిం బరిగణించక, లెక్క లోనికిఁ దీసికొనక యుండెను.

క్రీ. శ. 1818 దవ సంవత్సరమున విలియం బ్రౌన్ దొర తెలుఁగు పదజాలమును సేకరించి యచ్చొత్తించుటయే గాక తెలుఁగు వ్యాకరణమును గూడ రచించి నాఁడు. కాని యీ గ్రంథ మసంపూర్ణముగనే యుండి పోయినది. తెలుఁగు భాషకు సంస్కృతి ప్రభావము లే కుండుటచే దానిం జదువ వల దని చార్లెస్ ఫిలిప్ బ్రౌన్‌తో నితఁడు సెప్పుట వింతలలో వింతఁగనే యున్నది.

ఆరంభములో బ్రౌన్ దొర తన యుద్యోగ రక్షా మర్యాదలఁ బాటించు నవసరమునఁ దన దేశీయుల నిరుత్సాహమును, దెలుఁగు పండితుల యమాయకత్వముతోఁ గూడిన పట్టుదలలును, గొంత వఱకుఁ దాఁ జేయ నెంచిన భాషా సేవకు విపర్యయ మొదవించినను జీరికిం గొనక అకుంఠిత దీక్షతోఁ దెలుఁగు భాషకు సేవఁ జేయుట ఆంధ్ర జాతి యదృష్ట మన వచ్చును.

క్రీ. శ. 1824 వ సంవత్సరమునఁ దెలుఁగు పద్యములఁ జదువు చుండఁగా బ్రౌన్ దొరకు Dubious వ్రాసిన 'Account of the Hindoos' అను గ్రంథమున యోగి వేమన పే రుండుటను జూచి యవకాశ మొదవి నప్పు డెల

నాతని పద్యముల నాంగ్లీకరించి గ్రీకు భాష లోని "లూసి యన్" అను వానితో వేమన్నను బోల్చి క్రీ. త. 1829 దవ సంవత్సరమున ఆ గ్రంథమును బ్రకటించి నాఁడు. గ్రీకు దేశమున 'లూసియన్' అను నతఁడు ప్రజాదరణను బడసిన వాఁడు. ఆ విధముగనే తెలుఁగు దేశమునఁ బ్రజాదరణను బడసిన వాఁడు వేమన్న యాటచే బ్రౌన్ దొర తొట్టఁ దొల్త వేమన పద్యములనే పరిచరించి తన యధికార బల దర్పములను, బలుకుబడిని, నుపయోగించి తెలుఁగు కావ్య ముల సముద్ధరించి చిరస్మరణీయుఁ డయ్యెను.

తొలుత సులభ గ్రంథములఁ బఠించి, యావల మహా కవుల గ్రంథములఁ జదివి, ఛందో వ్యాకరణ సంబంధములగు సంశయముల నెన్నింటినో పోఁ గొట్టికొని, శ్రమకుఁ దగిన ఫలిత మనుభవించితి నని బ్రౌన్ దొరయే వాక్రుచ్చినాఁడు.

ఇ విధముగఁ దెలుఁగు భాషా పాండిత్యముల సంపా దించి క్రీ. శ. 1837 వ సంవత్సరమున స్వదేశమున కేఁగెను. ఆ కాలమున భారత కార్యాలయము (India Office) నఁ దెలుఁగు గ్రంథములు గొన్ని కల వనియు, వానిం బ్రాగ్భా రత సంఘము (East India Company) వారు లైడెను (Lyden) దొరవారి యొద్దఁ గొనిఁ రనియుఁ, — దెలియ రాఁగా, భారత దేశము నుండి వెడలిన ప్రభుత్వో ద్యోగులు గాని, ఇంగ్లండు నం దున్న వారు గాని, యీ తెలుఁగు గ్రంథముల గుఱించి శ్రద్ధ వహింప లే దనియుఁ, దెలిసికొని యా భారత కార్యాలయమున కేఁగి పరీక్షిం

పఁగా. నచట రమారమి మూఁడు వందల గ్రంథము లగపించె నఁట! ఆ గ్రంథము లన్నిఁటిని చెన్నపురి సారస్వత సంఘము (Madras Literary Society) వారికిఁ బంపు నేర్పాటు సేయఁ బ్రభుత్వము వారితో సంప్రదించిరి. బ్రౌన్ దొర ప్రభుత్వోగియు నాంగ్లేయుఁడు నగుట వలన నా గ్రంథము లన్నియుఁ గ్రీ. శ. 1844 వ సంవత్సరమునఁ జెన్న పురి సారస్వత సంఘము వారికిఁ బ్రభుత్వము వారంపిరి. ఈ గ్రంథములే బ్రౌన్ దొర భాషాసేవఁ జేయుటకు సాహా య్యము లయినవి.

క్రీ. శ. 1841 వ సంవత్సరమున బ్రౌన్ దొర భారత దేశము (India) నకు మరలి వచ్చిన మూఁ డేండ్లకు నింగ్లండు నుండి చెన్నపురి సారస్వత సంఘమునకుఁ దెలుఁగు గ్రంథ ములు వచ్చిన తోడనే భాషాసేవకుఁ బ్రారంభించి నాఁడు. వివిధ ప్రదేశముల నుండి విద్వాంసులతో నుత్తర ప్రత్యుత్త రముల జరపియుఁ, బండితుల రావించియుఁ, బ్రకటింపఁ దగ్గ గ్రంథములఁ బ్రకటించియు, జీర్ణము లయిన మాతృకలకుఁ బుత్త్రికల వ్రాయించియు, మనుచరిత్రాద్యుత్తమ కావ్య ములకుఁ డీకల రచియించియు, స్వాయముగాఁ దాము గ్రంథ ములను ముద్రించుటకు ద్రవ్య సాహాయ్య మొనర్చియు, ననేక గ్రంథముల గుఱించి యా కాలపుఁ బత్త్రికలలో వివ రణముల వ్రాసియు, విద్యార్థులకు నుపయోగించు వాచ కాదుల రచియించియు, బ్రౌన్ దొర యా కాలమున నెన లేని భాషాసేవఁ గావించి నాఁడు.

ఆ కాలమున బ్రౌన్ దొర కావించిన యుత్తర ప్రత్యుత్తరములు రమారమి పది సంపుటములు గలవు. ఆ యుత్తరము లితని భాషాభిమానమును జాటుచున్నవి. బ్రౌన్ దొర మడికి సింగన వ్రాసిన 'అహల్యా చరిత్ర'ను నాంగ్లీకరించుటయే గాక ఆముక్తమాల్యద, అనిరుద్ధ చరిత్ర లోనగు కావ్యముల నితివృత్తమును గూడ నాంగ్లమున వెలువరించెను. క్రీ. శ. 1840 దవ సంవత్సరమునఁ దెలుఁగు వాచకమును, వ్యాకరణమును, గ్రీ. శ. 1852 వ సంవత్సరమునఁ దెలుఁగు - ఇంగ్లీషు నిఘంటువును, గ్రీ. శ. 1854 వ సంవత్సరమున నింగ్లీషు - తెలుఁగు నిఘంటువును, బ్రకటించుటయే గాక బైబిల్‌ను సంపూర్ణముగఁ దెలుఁగున రచించిరి. ఇంతియ కాక గ్రంథములఁ బెక్కింటినిఁ గూర్చి Madras Journal of Literature and Science అను పత్త్రికలో వివరించిరి.

జూలూరి అప్పయ్య పండితుఁడు, గరిమెళ్ళ వేంకయ్య, నరసింహాచారి, పమిడిపాటి వేంకట నరసయ్య, ములుపాక బుచ్చయ్యశాస్త్రి, మల్లంపల్లి మల్లికార్జున శాస్త్రి, రావిపాటి గురుమూర్తి శాస్త్రి, మచ్చ గంగయ్య, మామిడి వేంకయ్య, — మొదలగు వా రెందఱో బ్రౌన్ దొర యాస్థాన పండితులై యాయన సాహాయ్యమునఁ గీర్తిఁ గాంచిరి. ఈ పండితులలో జూలూరి అప్పయ్య పండితుఁడు (గుంటూరు వాస్తవ్యుఁడు) ఇఱువది యేండ్లు కాలము బ్రౌన్ దొర యొద్దఁ బనిచేసి పండిత ప్రకాండుఁ డని

పేర్వడసెను. కావుననే బ్రౌన్‌దొర "అప్పయ్యా పండితులు వివేకి యనియు, వినయశీలి యనియుఁ," ప్రశంసించుటఁ దటస్థించెను. ఇతఁడు బ్రౌన్‌దొర కోరిక పయిని మను చరిత్ర– వసుచరిత్ర– విజయ విలాసము– కవికర్ణ రసాయనములకు వ్యాఖ్యలు వ్రాసి క్రీ. శ. 1838–39 సంవత్సరములలోఁ బ్రకటించినాఁడు. 'విద్యావినోది' శ్రీ పనప్పాకము ఆనందాచార్యులుగారు అప్పయ పండితుఁడు వ్రాసిన యదువంశ భూషణ శతకము, రామ పంచాశత్తు, శ్రీనివాస తారావళి, గ్రంథములను దమ "వైజయంతి" పత్త్రికలోఁ బ్రకటించిరి.

గరిమెళ్ళ వేంకయ్యా బ్రౌన్‌దొర యాజ్ఞ ననుసరించి ధరణిదేవుల రామయమంత్రి కృత మగు 'దశావతార చరిత్ర' కు వ్యాఖ్యానము వ్రాసినాఁడు. పమిడి వేంకట నరసయ్యా 'రాధామాధవ' కావ్యమునకుఁ గ్రీస్తుశకము 1829 దవ సం॥రము లోను, 'అనిరుద్ధ చరిత్ర'కుఁ గ్రీస్తుశకము 1834వ సం॥రమునను, వైజయంతీ విలాసమునకుఁ గ్రీస్తుశకము 1833 లోను, వ్యాఖ్యల విరచించెను. రావిపాటి గురుమూర్తి శాస్త్రి వ్యాకరణమును, విక్రమార్కుని కథలు లోనగు వానిని రచించెను. మచ్చ గంగయ్యా "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన కుశచరిత్ర" రచించిన మచ్చ వేంకటకవి జనకుఁడు. మామిడి వేంకయ్యా "ఆంధ్ర దీపిక"ను, ఇతని మనుమఁడు సారంగపాణి "మచిలీ బందరు చరిత్ర"ను, రచించి క్రీ. శ. 1879 దవ సం॥రమునఁ బ్రకటించినారు.

ములుపాక బుచ్చయ్యశాస్త్రి వసుచరిత్రకుఁ "ప్రతిపదార్థప్రకాశిక"యను వ్యాఖ్యనువ్రాసి దానిని బ్రౌన్‌దొరకుఁ గృతి నొసంగెను. ఇతఁడు మాఘమాహాత్మ్యమును గూడఁ దెలిఁగించెను.

ఈ సమయంబుననే బ్రౌన్‌దొర రాజకీయోద్యోగములఁ బెక్కింటిని నిర్వహించిరి. కొంతకాలము ప్రభుత్వము వారికిఁ దెలుఁగు పారసీ భాషలకు ద్విభాషి (Translator) గా నుండినాఁడు. మఱికొంతకాలము పోస్టుమాష్టరు జనరల్ (The Postmaster - General) గాను, ఇంకఁ గొంత కాలము ప్రభుత్వ విద్యాసంఘ సభ్యులుగను, వ్యవహరించిరి.

మన తెలుఁగు దేశపుఁ బండితుల యార్థిక స్థితిని గమనించి, వగచి, ( Madras Journal of Literature and Science, July 1839.) లో శ్రీ రావిపాటి గురుమూర్తిశాస్త్రి పాండితీప్రకర్ష నుగ్గడించుచు వ్రాసిన వాక్యములఁ దిలకించిన బ్రౌన్ దొర యొక్క పండిత పక్షపాత మెఱుకపడఁ గలదు. (Telugu Literature by C. P. Brown.)

ఈ విధముగఁ బండితుల నాదరాభిమానములఁ జూచుచుఁ, దెలుఁగు భాష యొక్క ఉజ్జీవనమునకు దీక్షతోఁ గృషిఁ జేసి, తెలుఁగు భాషకు వెనలేని సేవఁ జేసి యున్నాఁడు.

అంతియ కాక బ్రౌన్ దొర యుత్తమకావ్యముల నెన్నింటికో టీకలు వ్రాయించి, యచ్చొత్తించి, చెదలు పాల్గాకుండఁ గాపాడిన కతమ్మున నతఁడు దెలుఁగు వాండ్రకుఁ జిరస్మరణీయుఁడు గాఁడా?

ఇఱువది సంవత్సరములు సెవి నిల్చుఁ గట్టికొని వివదించి నందులకుఁ గాఁ, దెనుఁగు దేశమున ముద్రణ సౌభాగ్య మొదవి క్రీ. శ. 1866 న సంవత్సరము నాఁటికిఁ దిరపడిన దన వచ్చును. ఆ కాలమునఁ దెలుఁగు నేర్చికొను విదేశీయులు బ్రౌన్ దొర రచించిన తెలుఁగు పుస్తకములనే చదువ వలసి యుండెను. క్రీ. శ. 1855 దవ సంవత్సరమున దేహారోగ్యము సెడి యుపకారవేతనముతో (England) నింగ్లండునకుఁ బోయిన తర్వాతఁ గూడ నతని తెలుఁగు గ్రంథములే 'సివిల్ సర్వీసు' పరీక్షల (Civil Service Examinations) కుం జదువు వారలకుఁ బఠనీయ గ్రంథములుగా నుండె నని (Some account of the Literary Life of C. P. Brown) లోని వాక్యము లవగత మొనర్చుచున్నవి. భారత దేశమున సేకరించి భద్రపఱచిన మూఁడు వేలకు మించిన గ్రంథ సంచయమును బ్రభుత్వమున కప్పగించి నాఁడు.

ఇంగ్లండునకుఁ బోయిన తర్వాత లండను విశ్వవిద్యాలయమునఁ గొంతకాలము ఆంధ్ర శాఖకు గౌరవ అధ్యాపకుఁడుఁగా నియమింపఁ బడియెను. Royal Asiatic Society మొదలగు సంస్థలకు అధ్యక్షుఁ డయ్యెను. ఈ బ్రౌన్ దొర తెలుఁగు వ్యాకరణము వ్రాయుటకు ముందె A. D. క్యాంబెల్ అను నతఁడు వ్యాకరణ మొక దానిని గ్రాంథిక – వ్యావహారిక భాషలకు సమమైన ప్రాధాన్యత – ప్రాముఖ్యత, – నిచ్చి వ్రాసినాఁడు. కాని బ్రౌన్ దొర వ్యాకరణము తెలు

పడిన తర్వాత క్యాంబెల్ వ్యాకరణమునకుఁ బ్రచార - ప్రాముఖ్యతలు కొఱవడినవి. క్యాంబెల్ వ్యాకరణమున కించుమించుగ సమకాలికమైన విలియం బ్రౌన్ వ్రాసిన తెలుఁగు వ్యాకరణము "జెంటు భాషా వ్యాకరణము" నను పేరితోఁ గలదు గాని మన ఛార్లెసు ఫిలిప్ బ్రౌన్ దొర మాత్రము క్యాంబెల్ - విలియం బ్రౌన్ దొరల వ్యాకరణముల స్పృశించకయే తన వ్యాకరణమును జదువుకొను వారి కేమాత్రముపయోగపడినను దాను గృతార్థతఁ జెందినట్లే యెంతు ననియుఁ, దన కృషి ఫలించినదని సంతసింతు ననియుఁ, — దలంచెను.

ఇట్టి మహోపకార మొనర్చిన వాఁ డౌట చేతనే A. H. Arden దొర తన తెలుఁగు వ్యాకరణపుఁ బీఠికలోఁ దెలుఁగుఁ జదువుకొను ప్రతివాఁడును బ్రౌన్ దొరకుఁ బ్రత్యేకముగఁ గృతజ్ఞత నగపఱుప వలయు నని వ్రాసి బ్రౌన్ దొర యందుఁ దనకుఁ గల గౌరవ ప్రపత్తులను వ్యక్తీకరించి నాఁడు.

జననాంతర సౌహృదము వలన బ్రౌన్ దొర తెలుఁగు భాషకుఁ, దెలుఁగు ప్రజకు, నెనలేని సేవఁ జేయుట చేతనే తెలుఁగు వాఙ్మయమునకును, జరిత్రకును, మహోపకారముఁ జేసిన వాఁ డయ్యె నని చెప్పక తప్పదు. ఈయన ఇంగ్లండు నకుఁ బోయిన తర్వాత నిఱువ దేండ్లు జీవించి యావలఁ గ్రీస్తు శకము 1884 వ సంవత్సరమునఁ జనిపోయి తెలుఁగు ప్రజను దుఃఖ వారాశిని ముంచి నాఁడు.

వారి వారి దేశ, వేష, భాషాభిమానములతో సంస్కృతము కంటె నధికముగ నాంధ్ర కావ్యములనే యాదరింతు రను.

"స్వస్థాన వేష భాషాభి మతా స్సంతో రసప్రబుద్ధ ధియః ।
లోకే బహు మన్యన్తె వైకృత కావ్యాని చా న్యదపహాయ ॥"

ఈ సూక్తిని బ్రౌన్ దొర యప్పటప్పట నుదాహరించుట వలన నాతని యాంధ్ర భాష పట్లఁ గల విశ్వాసము విదిత మగు చున్నది.



## "విమర్శక సార్వభౌమ" "చారిత్రక సమ్రాట్టు"

# కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు పంతులు

ఈ విమర్శక సార్వభౌముఁడు క్రీ. శ. 1877 వ సంవత్సరమున నందిగామ తా॥ యందలి "పెనుగంచిప్రోలు" నందు గంగమాంబా వేంకటప్పయ్యల గర్భ శుక్తి ముక్తా ఫలంబు నా జనన మందెను. తండ్రి వేంకటప్పయ్యగారు మునగాల పరగణాలో నొక యుద్యోగముఁ జేయుచు లక్ష్మణ రావు పంతుల వారి మూఁడవ యేటఁ జనిపోయినాఁడు. తల్లి గంగమ్మ ప్రాణాయామ మభ్యసించి యాధ్యాత్మిక జిజ్ఞాసతోఁ గాలము వెడల నడపు చుండెడిది. ప్రతి దినము స్నానాది కృత్యముల నిర్వర్తించికొని, మడుఁగు దోవతులఁ గట్టికొని, యొక గదిలోఁ గూరు చుండి, ప్రాణాయామమున భూమి పయిని జానెఁ డెత్తున లేచి జపించు చుండెడి దని వినుకలి. ఈమె చాల కాలము "వారాణసి" (Benares) యందె యుండుచు, నందె స్వర్గత యైనది.

తండ్రి చనిపోయిన తర్వాత నితఁడు "నాగపూరు" లోని తమ సోదరి శ్రీమతి భండారు అచ్చమాంబ (అబలా సచ్చరిత్ర రత్నమాల గ్రంథకర్త్రిణి) గారి యింటనే యుండి, విద్యాభ్యాస మొనర్చుచు, నచటనే ఎం. ఏ., పరీక్ష యం దుత్తీర్ణు లయిరి. లక్ష్మణరావు పంతులు బాల్యము నుండియు నాగపూరులో నుండుటచే మహారాష్ట్ర సంప్రదాయము లను - తద్విజ్ఞాన దీధితులను - బరాక్రమ సంపన్నతా

వైభవమును, — జక్కఁగాఁ దెలిసికొనుటయే గాక దేశాభిమాన ప్రపూరితులై తెలుఁగు దేశమునకు రాఁక ముందె "శివాజీ చరిత్ర" ను దెనుంగున రచించిరి. మహారాష్ట్ర మందలి "వివిధ జ్ఞానవిస్తార్ - సమాచార్," మొదలైన పత్త్రికలలో ననేక పర్యాయము లనేక విషయముల వ్రాసిరి. అంతతో నూరకొనక మహారాష్ట్ర భాషలోఁ నీయన రచించిన "వియోగ గీతి" నిఁ బఠించిన మిత్త్రాప్తుల ప్రశంసలకు, సానుభూతులకుఁ, బాత్రుఁ డయ్యెను. ఆ భాషలో "మోరోపంత్" వ్రాసిన భారతము యొక్క యొకటి రెండు పర్వముల నీయన పరిష్కరించి నాఁ డఁట! మహారాష్ట్రుల దీక్ష, చాతుర్యము, విమర్శ పాటవము, దేశాభిమానము, చరిత్ర, విన్న మీఁదటఁ గల్గిన దర్పము,— ఇవి యన్నియు నీయనను బాల్యప్రభృతి తీర్చి, దిద్ది, యుత్తేజ పఱచినవి. సంస్కృత భాష నభ్యసించి, యందుఁ బాండిత్యము గడించి యాంధ్ర దేశపు భాగ్యరేఖ ననుసరించి "నాగపూర్" (Nagapur) విడచి, మునగాల దివాను (Dewan of Munagala Estate) గా వచ్చి యా మరణాంతము విజ్ఞాన జ్యోతిని వెలిఁగించి తరించిరి.

మనది పరాధీన మైన జాతి, బ్రదికి చెడిన జాతి, యని వాపోవుచు నీ జాతి నుద్ధరించు టెట్లు? అని నిరంతర ధ్యాన నిమగ్నుఁ డయినాఁడు లక్ష్మణరావు పంతులు. ఢిల్లీ పాదుషాలకు గుండె లవియఁ జేయు ఛత్రపతి వీరగాథలు పంతుల వారి వేఁడి రక్తమును గుత కుత లాఁడించు చుండెను.

మహారాష్ట్రులు తమ జాత్యుద్ధరణ కయి చేయు చున్న కృషి పంతుల వారి కవగాహ మైనది. తెలుఁగు దేశమునఁ గా లిడిన తోడనే మహారాష్ట్ర దేశమునకును, తెలుఁగు దేశమునకును, - జాల వ్యత్యాస మున్న దని గ్రహించి నాఁడు. అనుపూర్విగ వ్యాప్తమై యున్న భావములే, యాచార సంప్రదాయములే, నెక్కొని యున్న వని తెలిసి కొని నాఁడు. వీరేశలింగము పంతులు గా రాంగ్ల విజ్ఞానమును జవిఁ గొని తెలుఁగు నాఁట సుస్థిరమై యున్న యజ్ఞానమును బోఁ గొట్ట వలయు నని పత్త్రికలఁ బెట్టియుఁ, బుస్తకముల వ్రాసియుఁ, బ్రహసనముల రచించియు, సవ్యసాచి వోలె వీర విహార మొనర్చు చుండుటను గనిపట్టి నాఁడు. మహారాష్ట్రమున దేశచరిత్ర కై కృషిచేయు చున్న శ్రీ విశ్వనాథ కాశీనాథ రాజవడె గారిని, శ్రీ కందుకూరి వీరేశలింగము పంతుల వారిని, ఆదర్శముగాఁ గైకొని కృషి చేయుటకు లక్ష్మణరావు పంతుల వారు కృత నిశ్చయుం డయ్యెను. అక్కగారికిఁ దాఁ జదివిన వన్నియుఁ జెప్పి, యామెకుఁ జదువు నం దనురక్తి రెక్కొలిపి, యామెను విద్యావతిగా నొనర్చి, యామెచే "అబలా సచ్చరిత్ర రత్నమాల" యను గ్రంథమును రచింపఁ జేసినాఁడు. తన కొమార్త అచ్చమాంబకు నున్నత విద్యఁ జెప్పించి నాఁడు.

ఈయన మునగాల దివాన్ (Dewan of Munagala Estate) గాఁ బ్రవేశించిన పిమ్మటనే "నందిగామ"లో క్రీ. శ. 1907 వ సంవత్సరమునఁ గృష్ణా మండల సభలు

(Kristna District Conferences) జరగు సందర్భమున నొకనాఁడు మండల సాంఘిక సభ (District Social Conference) యు జరగినది. పాంచాల కేసరి లాలా లజపతి రాయి, సర్దారు అజత్ సింగ్, - లోనగు వారినిఁ దొమ్మండు గుఁ నిర్బంధించి బర్మాలో నుంచి రని గుస గుసలు, తహ తహలు, బయల్దేఱిన దినా లవి. "వందే మాతర" మను నినాదము లాకస మంటి వాగ్మి శేఖరుఁ డగు విపిన చంద్రుఁడు (Bipina Chandra Pal) తెలుఁగు గడ్డ పయిఁ గా ల్వెట్టిన దినా లవి. ఆ మహామహులు పూరించిన శంఖా రావముల నాలించి సహజ దేశభక్తి పుంభావు లగు లక్ష్మణ రావు పంతులు రాజమహేంద్రవరపట్టనము దాఁకఁ జని విజ యవాడకు విపినచంద్రునిఁ దోడ్కొని వచ్చి స్వదేశి — స్వభాష — స్వరాజ్య విషయమ్ములఁ దెల్పు ప్రజకు విను కలిఁ జేసిన రోజు లవి. ఆ రోజులలో "నందిగామ" యందు సమావేశ మైన మండల సభల యందు జరగిన సాంఘిక సభ (Social Conference) లో వితంతు వివాహములు, ఋతు మతీ వివాహములు, భోగపు మేళముల నిషేధము, అస్పృ శ్యతా నివారణము, దృష్టి దోష విచారణము, — లోనగు విషయంబులఁ జర్చించి తీర్మానించఁగా, న వ్విషయంబుల నాచరణలోఁ బెట్టుటకు ముందంజ వైచినది లక్ష్మణరావు పంతుల వారే! మునగాల జమీన్దారులు, సుప్రసిద్ధ భాషాభి మానులు, నగు "సాహిత పోషక" శ్రీ రాజా నాయని వేంకట రంగారావు నాయనిం గారు తమ కాప్తమిత్రు

లగుటచే బీద విద్యార్థులకును, విద్యా సంస్థలకును, సాహాయ్య మొసరింపఁ జేసి వారిని దాన కర్ణు లని యందఱ రసనాగ్ర ముఁ దాండవింపఁ జేసినది లక్ష్మణరావు పంతుల వారే! పరాసు విప్లవానంతరము యూరపు ఖండమున భౌతిక శాస్త్రము లభివృద్ధిఁ జెంది వివిధ దేశములు భోగ భాగ్యము లతోఁ దులఁ దూఁగు చున్నవి కాఁబట్టి మనదేశము గూడ నవీన శాస్త్ర విజ్ఞానము మీఁద నాధారపడి యున్న దను నంశము లక్ష్మణరావు పంతుల వారు గ్రహియించి హైదరా బాదు నందుఁ గ్రీస్తు శకము 1906 వ సంవత్సరమునఁ బలువుర మిత్రుల తోడ్పాటుతో "విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి" యను పేరితో నొక గ్రంథమాలను నెల కొలిపి తత్కార్య కర్తగా శ్రీ రావిచెట్టు రంగారావు గారిని నియమించిరి. రంగారావు గా రుత్సాహ ధీ శక్తులు గల యువకుఁడు. మన్సబ్ దారు. నవీన శాస్త్ర గ్రంథములను వ్రాయించి, ప్రచురించి, ప్రజా సామాన్యమున కంతకును సులువుగాఁ, జౌకఁగా, నందఁ జేయ వలయు నను సంకల్ప ముతో నీ గ్రంథ మండలి యేర్పడినది.

ఈ గ్రంథమండలి యేర్పడి పనిచేయు చున్న కొన్ని నాళ్ళకే మునగాల రాజా వారి వ్యవహారములకై లక్ష్మణ రావు పంతుల వారు చెన్నపట్టనమునకుఁ బోవలసి వచ్చినది. ఈ గ్రంథ మండలి ప్రచురణ కార్యములు సైతము చెన్న పట్టనము నుండియె జరగు చుండెను. ప్రకృతి శాస్త్రములు, దేశ చరిత్రలు, చారిత్రాత్మక నవలలు, — లోనగు వానిని

రచించి ప్రచురించుట పరమ ప్రాప్యముగా నుంచికొని తొల్దొల్త "అబ్రహాం లింకను" చరిత్రను దేశబాంధవ శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావు పంతులు గారిచే రచియింపించి ప్రచురించిరి. అప్పుడు హరి సర్వోత్తమరావు గారు మద్రాసు క్రైస్తవ కళాశాలలో ఎం. ఏ., పరీక్షకుఁ జదువుచుండిన యువకుఁడు. ఆ పిమ్మటఁ బ్రచురింపఁ బడినది "హిందూ మహా యుగము." ఈ గ్రంథమును లక్ష్మణరావు పంతుల వారే రచించిరి. దీని ముద్రణమునకు శ్రీ బొబ్బిలి మహారాజా వారు వేయి రూపాయల నయాచితముగ నంపిరి. ఆవల "జీవ శాస్త్రము" ప్రచురింపఁ బడినది. ఈ గ్రంథమును సుప్రసిద్ధ భిషగ్వరు లగు శ్రీ ఆచంట లక్ష్మీపతి గారు వ్రాసిరి. ఈ గ్రంథము ప్రచురింపఁ బడఁగనే దేశమున విజ్ఞాన తృష్ణ యధికముగ నుండి యుండుటచేఁ గాఁబోలు మూఁడు వేల ప్రతులు సెల్లినవి. ఆ తర్వాత 'కలరా' 'మలేరియా' అను గ్రంథములు శ్రీ లక్ష్మీపతిగారు వ్రాసినవే! ప్రచురింపఁ బడి యెన్మిది వేల ప్రతులు సెల్లింపఁ బడినవి. ఇంతలో మొదటి ప్రపంచ యుద్ధము పొటమరించి గ్రంథ ప్రకటనకు వలయు కాగిదముల విలువ యెన్మిది గుణము లధిక మయ్యును గ్రంథ మండలి ప్రచురించు గ్రంథముల వెల యధికము సేయ లేదు. శ్రమ కోర్చి, ద్రవ్య భారము సహించి, యా కాగిదపుఁ గఱవు దినాలలో శ్రీ వేమూరి విశ్వనాథ శర్మ గారి "రసాయన శాస్త్రము"ను, శ్రీ మంత్రి ప్రెగడ సాంబశివరావు గారి "పదార్థ విజ్ఞాన శాస్త్రము" ను,

శ్రీ మైనముపాటి నరసింహము గారి "భౌతిక శాస్త్రము" ను విమర్శక శిరోమణి శ్రీ కట్టమంచి రామలింగ రెడ్డి గారి "అర్థశాస్త్రము"ను ప్రకటించి యావ॥ 'విమర్శక శిరోమణి' రా. బ. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతుల వారి "స్వీయచరిత్ర" ను, కవిశేఖర భోగరాజు నారాయణ మూర్తి గారి "విమాలదేవి" ని, శ్రీ దుగ్గిరాల రాఘవ చంద్రయ్యా చౌదరి గారి "విజయ నగర సామ్రాజ్యము" ను, శ్రీ ఏ. వి. నరసింహం పంతులు గారి "పాతాళభైరవి" ని, – ప్రచురించి తెలుఁగు వాంద్రకు సహజముగ నున్న గ్రంథ పఠనాభిలాషను నినుమడింపఁ జేసిరి. ఈ చరిత్ర గ్రంథము లలోఁ గొన్ని పట్టుల రాజకీయ ఘట్టములను గూర్చిన విషయ ములు లక్ష్మణరావు పంతుల వారు సూచించి, నేర్పి, వ్రాయించినవే యగుటచేఁ దద్గ్రంథములు జనరంజకము లయ్యె ననుట గమనించఁ దగ్గది.

ఈ గ్రంథమండలిసభ్యు లగు 'దేశబాంధవ' శ్రీ గా. హరిసర్వోత్తమరావు గారు 'స్వరాజ్య' విషయమునఁ దప్పని సరిగా కారాగారమున కేఁగ వలసి వచ్చినది. అపరాధ పరిశోధకులు (C. I. D.s) వాన జల్లుల వలె మను ష్యుల చుట్టును బరిభ్రమించు చుండిరి. అక్కటతన గ్రంథ మండలి సభ్యులకుఁ బ్రతి నిముసమును గుండె దిటవు లేక యుండెను. రహస్యాపరాధ పరిశోధకులకుఁ బట్టువడఁ కుండ రాజకీయాంశములను గ్రంథములలో వ్రాయ కుండఁ బూర్వ చరిత్రలఁ బ్రచురించి దేశభక్తిని, స్వాతంత్ర్యేచ్ఛను, త్యాగ

శీలతను, ధైర్యస్థైర్యములను, మాతృ పితృ భ్రాత్రాదుల యెడ భక్తి విశ్వాసములు మొదలగు మనోవికాసములను, - బురి కొల్పు గ్రంథములనే గ్రంథమండలి ప్రకటింప దొరఁకొని ప్రజలలో విశ్వాసము గుదురుఁ గొలిపినది. విజ్ఞాన చంద్రిక వర్ధిల్లి తెలుఁగు పాఠక లోకమునకు వినూత్న కాంతి పుంజ మును గలిగించఁగా, లక్ష్మణరావు పంతులు గారికిఁ దన దేశీయుల విజ్ఞాన సంపన్నుల నొనర్ప వలయు నను నుత్కృ టాభిలాష మెండయ్యెను. ఆయన సాహసికుఁడు, కార్య శూరుఁడు, నగుటచే నంతతోఁ దృప్తి వడక లక్ష్మణరావు పంతులు గారు "ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము" (Telugu Encyclopeodia) ను బ్రచురింప నిశ్చయించి, విమర్శక శిరోమణి, చరిత్ర రచనా ధురీణ, శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ, నవ్యకవితా విశారదు లగు శ్రీ రాయప్రోలు సుబ్బ రావు లోనగు పాలపొంగు దశలో నున్న యువక బృందమును జేర్చికొని వారికి నుత్సాహ ప్రోత్సాహముల నిచ్చి యా యా విషయంబుల నిష్ణాతు లని యనిపించు కొన్న మహామహులు వ్రాసిన ప్రత్యేక రచనలతో రెండు సంపుటములఁ బ్రక టించిరి. 'ఆంధ్ర' శబ్దమునకు వలయు నాంధ్రదేశ సంబం ధము లగు సాంఘిక, చారిత్రక విషయములు, సాహిత్యము, శాస్త్రము, కళలు, ఖనిజాది సంపత్తు, శాసనములు,— లోనగు వానిం గూర్చిన వ్రాఁత ప్రతి యేఁబు వందల పొరటలు ముద్రణమునకు సిద్ధము గావింపఁ బడినది. అలో, మొదటి ప్రపంచ యుద్ధము ముగిసి నాఁడునాఁటికి దేశీయు

లలో స్వాతంత్ర్య పిపాస, స్వాతంత్ర్యేచ్ఛ, ప్రవృద్ధి యగు చుండెను.

విజ్ఞాన సర్వస్వ ప్రకటనతోఁ బరిశోధన యం దఖండుఁ డని యనిపించికొని నాఁడు. ఆయన శైలి మార్ద వము, ప్రసన్నత, గలది యై యెంతటి దుర్ఘట విషయము నేనిఁ బండొలిచి చేతిలోఁ బెట్టి నట్లు జెప్పఁ గల ప్రజ్ఞా పాటవము గలది యై యాంధ్ర దేశ చరిత్ర పరిశోధనకు దారిఁ దీసినది. సంస్కృత వాఙ్మయమును, దామ్ర శిలా శాసనములను, బరిశోధించి యాయన వ్రాసిన వ్రాఁతలు పరిశోధక దృష్టి గల ప్రతి వానికి శిరోధార్యము లనక తప్పదు

ఆనిబిసెంటు ప్రారంభించిన 'Home Rule' ఉద్యమ ప్రబోధ ప్రచారముల వలనఁ బ్రజలలో నాంగ్లేయుల వలని భయము సన్నగిలెను. ఆవల గాంధిజీ నాయకత్వమున సహాయ నిరాకరణోద్యమ ప్రభావము తామర తంపరగాఁ బ్రజల యం దగపించి విజ్ఞాన తృష్ణకుఁ దోడుగ స్వతంత్ర తృష్ణయు నధికమై కారాగార భయము గాని ప్రభుత్వ భయము గాని లేకుండఁ బోయినది. ప్రతి వాఁడును శక్తి కొలఁది నుడుత భక్తిగా స్వాతంత్ర్యోద్యమమునఁ బాల్గొన వచ్చు నను నినాదము లుప్పతిల్లి పాండితీ ప్రకర్షతోఁ గాని, యైశ్వర్యాదులతోఁ గాని, తెలివి తేఁటలతోఁ గాని, పని లేక పోయినది. స్వాతంత్ర్య పిపాస ఇ విధముగఁ బ్రతిధ్వను లీను చుండఁగా, నెల్లేని నొక్కసారి యేనిఁ గారాగారము

నకుఁ బోయి వచ్చుటయే మాన మర్యాదలుగా గౌరవ ప్రపత్తులుగాఁ బరిగణింపఁ బడు చుండిన పరిస్థితులలో విజ్ఞాన ప్రచారమునకుఁ బ్రోత్సాహ సాహాయ్యము లడుగంటినవి. ఉత్సాహ ప్రక్రియ యున్నను వెలికి నుద్గమించుటకు వలను పడ దయ్యెను.

క్రీ. శ. 1920 దవ సంవత్సరమున విజయవాడలో అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశము (All India Congress Committee Meeting) జరగి నప్పుడు లక్షల కొలఁది ప్రజలు రాఁగా, గాంధిజీ లోనగు నాయకులు కోటి రూపాయలను, నిర్వది లక్షల రాట్నములను, సంవత్స రము లోఁగా సేకరించఁ గల్గినచో సంవత్సరము లోపుగ స్వరాజ్యము రాఁగల దని ముక్త కంఠములతోఁ బ్రబోధిం చుటను విని యనేకులు గాంధిజీపంథా ననుసరించిరి. ఇ మ్మార్గము మన లక్ష్మణరావు పంతులుగారికి నచ్చ కున్నను గారాగార నిబద్ధు లయిన వారి కుటుంబములకు సాహాయ్య మొనర్చు చుండెడి వాఁడు. లోకమాన్యుని యనుచరు లగుటచే సామ, దాన, భేద, దండోపాయము లతోఁ బ్రభుత్వము వా రొసంగిన హక్కులను, సదుపాయము లను, స్వీకరించి యనుభవించుచుఁ దక్కం గల వాని కయి ప్రయత్నింప వలసిన దను లోకమాన్య తిలకు సిద్ధాంతమును తూ — చా — తప్పక అనుసరించు వా రౌట చేతను, 'ఆంధ్ర' యను శీర్షికను విజ్ఞానామృతమును దగ్ద దేశీయుల కందించ వలయు నను దీక్షతో సంకల్పముతో శాసనాది.

పరికరముల వెలికిఁ దీసి పరిశీలించు చుండుట వలనను, అసహా యోద్యమ సిద్ధాంత రహస్యములఁ బరిశీలించి తర్కించు టకు. విమర్శించుటకు, నుద్యుక్తుఁడు గా నుండెను. పై పెచ్చు దృక్పథము సైతము వే అయి యుండెను.

తార్కిక, భౌతిక, జ్యోతిషిక, వేదాంత శాస్త్రము లను గాని – పురాణములను గాని – యే విషయమును గురించి వ్రాసినను శ్రీ లక్ష్మణరావు పంతులు గారు కూలంకషముగఁ దెలిసికొని పిన్న పెద్దల కెల్లఱకుఁ దెలియం దగు శైలిలో వ్రాయు నేర్పుఁ గల వారు. పంతులు గారు నైయోగి కారాధ్య బ్రాహ్మణులే యయ్యును మత సహనము గలాఁడు. అగుటచే నా యా మత సంబంధ విషయమ్ములఁ దెల్పు నప్పుడా యా మతధర్మ ప్రబోధముల ననుసరించియే వ్రాయు చుండెడి వాఁడు. ఈయన పురాతన హిందూ శాస్త్రాదుల పట్ల నెట్టి భక్తి విశ్వాసములు గలవో నవీన శాస్త్రాదుల పట్లను నట్టి భక్తి విశ్వాసములే శ్రద్ధయే కలవాఁడు. క్రీ. శ. 1918–19 సంవత్సరములకుఁ బూర్వము మన పంతులు గారికి నాయుర్వేద మన్న మిపుల విశ్వాసమును, అభిమానాదరము లును, గలవు. కావుటం జేసియే పంతులు గారు శ్రీ గణనాథ సేన్ వ్రాసిన "ప్రత్యక్ష శారీరము" నను సంస్కృత గ్రంథము నుండి యొక ఘట్టమును దెలిఁగించి "అస్థి పంజరము" నను పేరితోఁ బ్రచురించుటఁ దటస్థించినది. ఈ గ్రంథమును జదివిన యెడల నాయుర్వేదము నెడఁ బంతులు గారికిఁ గల విశ్వాసాభిమానములు, సంస్కృతమున నాయనకుఁ గల ప్రజ్ఞా

ప్రాభవములు, తెలిఁగించుట యందుఁ గల నేర్పు, - అవగతము కాఁ గలవు.

క్రీ. శ. 1916 వ సంవత్సరమున "కొవ్వూరు"లో నాంధ్ర భాషా వాఙ్మయ వికాసముల కయి నెల కొలుపఁబడిన "ఆంధ్ర సారస్వత పరిషత్తు" ప్రతిష్ఠాపకులలో నొకరు లక్ష్మణరావు పంతులు. క్రీ. శ. 1919 దవ సంవత్సరమున మద్రాసు గోఖలే హాలులో జరగిన నాలవ ఆంధ్ర సారస్వత పరిష ద్వార్షిక సభకు అధ్యక్షత వహించి యొసంగిన యుపన్యాసమును, అనంతపుర మండల రాజకీయ మహాసభకుఁ, గృష్ణా మండల సంఘ సంస్కరణ సభకుఁ, బిఠాపుర మందలి తాళీదళ సంపుట ప్రకర పరిశీలనా సంస్థ వార్షిక సభకు, — అధ్యక్షత వహించి యిచ్చిన మహోపన్యాసములును, ప్రశంసింపఁ దగినవి.

క్రీ. శ. 1920 దవ సంవత్సరమున 'భిషగ్రత్న' శ్రీపండిత దివి గోపాలాచార్యులు గారు సనిపోవుటతో 'భిషఙ్మణి' శ్రీ ఆచంట లక్ష్మీపతి లోనగు వారి సాహాయ్య సంపత్తు లడుగంటి విజ్ఞాన చంద్రిక, విజ్ఞాన సర్వస్వాదుల కార్యక్రమములు కుంటువడి పోయినవి. కాఁగా, మన లక్ష్మణరావు పంతులు గారికి బాల్యాదిం గల శ్వాస వ్యాధి ప్రకోపించి భారవహ మై దుర్భర మై యుండుటయుఁ దటస్థించెను.

క్రీ. శ. 1922 వ సంవత్సరము జులయి 12 వ తేదీన లక్ష్మణరావు పంతులు గారినిఁ బరీక్షించి డాక్టరు లక్ష్మీపతి

"లక్ష్మణరావు పంతులు గారికి హృదయ దౌర్బల్యము వలన బుద్ధి నుపయోగించి చేయవలసిన పనుల యం దయిష్టత, శిరస్సులో నేదే నొక విధముగ సుఖము లే కుండుట, — మొదలగు లక్షణము లుత్పన్న మైన" వని నిర్ధరించి, పూర్తిగ విశ్రాంతి యగత్య మని సూచించెను. ఇవ్విధముగఁ గ్రీస్తు శకము 1923 వ సంవత్సరము మే నెల వఱ కెటులలో గడచి పోయెను. కాని వేసవి బాధను దట్టుకొన లేక చల్లని ప్రదేశంబునఁ, బ్రకృతి రామణీయత గుబురు కొని యున్న తావున,—విశ్రాంతి నభిలషించి యుండఁగా, లక్ష్మణ రావు పంతులు గారు 'మదన పల్లె' కుఁ జనిరి. కాని యటఁ గూడ మానసిక విశ్రాంతి లేక పోవుటచేఁ జెన్నపట్టనమునకు మరలి వచ్చి శరీర పాటవము తగ్గి పోవుట వలన నిఁక బ్రదుకుదు నను నాశ లేక తమ యొద్ద నున్న శాసనములఁ బరిశీలించి యాంధ్రుల పూర్వ చరిత్ర ప్రాభవ కీర్తుల నందించ వలయు నను దీక్ష, పట్టుదల, యధిక మై పరిశీలించి నంత వఱకు గ్రంథమును ముగించి వేయు చుండెను.

కాని మృత్యు దేవత తన్ను డగ్గఱించు చున్న దని గ్రహించి మెచటికో పయనించు వా రిల్లును జక్కఁ బెట్టు కొనునట్లుఁ దన గ్రంథ మాఁగి పోవునేమో యను జుగుప్సతో సర్వము సిద్ధముఁ జేసికొన్న కర్మయోగి లక్ష్మణరావు పంతులు. విధి బలీయ మాటచేఁ దుదకుఁ గ్రీస్తు శకము 1923 వ సం॥రము జులయి నెల 12వ తేది రాత్రి 12 గంటలకు 'వేదవిలాస్' నందు శాశ్వతముగఁ గన్ను మూసెను.

---

“ చారిత్రక రత్న ”

# చిలుకూరు వీరభద్రరావు పంతులు

ఆంధ్ర జాతికి నాత్మ వికాస మొదవించిన వారిలో వీరభద్రరావు పంతులు మొట్ట మొదటి వాఁడు. తెలుఁగు వాండ్రను బదిం బదిగఁ బులకిత గాత్రుల నొనర్పఁ గల్గిన చరిత్రలో మన దేశము వంటి కమ్మని దేశము లే దని గర్వముతోఁ జాటిన వాఁడు వీరభద్రరావు పంతులు. “ లేరు రా మన వంటి ధీరు లీ భరత ఖండమున ” అని దివ్యమోహనమైన మధుర గీతికిఁ బల్లవి యెత్తిన వాఁడు వీరభద్రరావు పంతులు.

క్రీ. శ. 1912 వ సంవత్సరమునం దాంధ్రోద్యమమునకు బీజావాపన మొనర్చిన వాఁడు వీరభద్రరావు పంతులు. ఆ మఱుసటి సంవత్సరముననే బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ జరగినది. కాఁబట్టి వీరభద్రరావు పంతులు మన యాంధ్రదేశ చరిత్ర రచయితలలో మొట్టమొదటి వాఁడును, మన జాతీయ జీవన ప్రారంభకులు, నని తెలియం దగును.

తెనుఁగు నాఁటి చరిత్ర నవగత మొనర్చు గ్రంథములు లే వను జిజ్ఞాస, పరితాపము, ఆవేదన, కలవాఁడు వీరభద్రరావు పంతులు. ఈయన సంపన్న గృహస్థులే ! రేలంగి, తణుకు ప్రాంతములలో భూములు గల కుటుంబమున జన్మించిన వాఁ డీయన. ఈయన తండ్రి పదార్థవాది

(Pleader). బాల్యముననే యీయనకుఁ బెండ్లి యైనది. పెండ్లి యైన కొన్ని యేండ్లకుఁ దండ్రి చనిపోవుటచేఁ జదువు సంతలు సన్నగిలినవి. కాంపురము సవదరించుట ముఖ్య మైనది. చేతి నిండ డబ్బు. స్వతంత్ర భావములు. నిండు మనంబు నవ్య నవనీత సమానము గలాఁ డయ్యును జూపులు నిశిత కర్కశములు. ఉన్నతాశయములు. పవిత్ర సంకల్ప ములు, అగుటచే వీరేశలింగము పంతుల యాదర్శమే కన్ను మూసినను దెఱచినను దేశములో అపూర్వ సంచలనము వీరిభద్రరావు పంతుల హృదయమునం దావేదనఁ గలిగించి నది. కాఁగా, వారికి ధనార్జనాపేక్ష, ఉద్యోగాపేక్ష,— అడుగంటి దేశ స్వాతంత్ర్యాపేక్ష యధిక మైనది. ఆ యాద ర్శమునకే – ఆ లక్ష్యమునకే – ఆయన దృష్టి మరలినది. ఆయన దృష్టిలో వెండి బంగారములకు, భూమి పుట్టలకు, విలువ లేకుండఁ బోయినది. అట్టి యెడ భూములు బుట్టలు, వెండి బంగారములు, నిలుచునా? క్రమేపి ఋణదాతల పాల్పడి మిగిలినవి యీయన లక్ష్యసిద్ధి కయి రూపాయ నాణె ములుగా మార్పుఁ జెందినవి.

కత్తెర వడి కఱకై సాంద్ర రమ్యముగ నున్న యీయన మీసము, ఒత్తయిన యా కనుబొమల క్రింద గెలు పొందిన వీరుని కండ్ల వలె మిల మిల మెఱయు కన్నులు, హృదయమున హత్తుకొని యంతరాళ వీథులు గూడ సూక్ష్మముగఁ బరీక్షించు సునిశిత మైన దృక్కులు,— ఆయన గొప్పఁదనమును జాటు చుండును.

అప్పటికే వీరభద్రరావు పంతుల జీవిత మొక స్థాయికి వచ్చినది. ఆయన కార్యోత్సాహ శక్తులు మేల్కని యంత వఱకు నుద్దీపన మందినది. వీరేశలింగము పంతుల సాంఘిక విప్లవోద్యమములోఁ బ్రచంచ ఝంఝూ మారుతముం బలెఁ దెలుఁగు దేశము నంతను జవ జవ కదలించి వైచి కల్లోల పఱచిన మత సాంఘిక విప్లవమున వివాహ కాలాన వీర భద్ర పల్లెరమును బెట్టికొని యగ్నికుండమును ద్రొక్కిన వీరభద్రరావు పంతుల కార్య వీరత్వమునకు సవ్య మైన విహార భూమి యగపించినది. ప్రాఁత నమ్మికలు మటు మాయ మైనవి. క్రొత్తభావము లొంటఁ బట్టి జీవిత పథంబున కొక్క లక్ష్యమును జూపినవి. హేతు వాదమును భౌతిక శాస్త్ర విజ్ఞానమును నూఁతఁగాఁ గొని క్రొత్తఁగా దేశము నావరిం చిన పాశ్చాత్య నాగరకతా వ్యామోహము వలన దేశీయ మతాచార సభ్యత లన్నియు నపభ్రంశములుగా నగపడి వానిని ఖండించుచు వచ్చి గొప్ప ప్రబోధమును గలిగించి మత, సాంఘిక రంగములలో దుర్వార వీర విహార మొనర్చు చున్న వీరేశలింగము పంతులు మహాయోధుఁడై ప్రవక్త యై వీరభద్రరావు పంతుల లేఁత నవనీత హృదయము నాఁకట్టి యాకర్షించి నాఁడు. క్రమక్రమముగ వీరేశలింగము పంతు లనిన భక్తి విశ్వాసము లధిక మై వీరభద్రరావు పంతుల దృష్టిలో వీరేశలింగము పంతు లొక దేవత యై సాక్షాత్క రించి నాఁడు.

ఈ కాలము నందె 'స్మైల్సు' వ్రాసిన స్వయం సహాయ (Self-help) మను గ్రంథమును జదివి యందలి వీరత్వమును, మాధుర్యమును, స్వయంతారక జీవిత లక్ష్యము లని గ్రహియించి యేలూరులో "దేశోపకారి" యను పేరుతోఁ గొంత కాలము పత్త్రికను నడపి, యవల రాజ్మహేంద్రవరము (Rajahmundry) న "ఆంధ్రకేసరి" యను పేరితోఁ బత్త్రికను నడపిరి. సంస్కరణోద్యమమును జాఁగించుటలో దీక్షా బద్ధకంకణు లయిన వీరేశలింగము పంతులు సనాతన వాదులతో జరపిన వాద ప్రతివాద యుద్ధములలో సనాతనుల దోషముల బయల్వెట్టుటలోను వారి యాచార వ్యవహారాదుల నపహాసించుటలోను వారి వాదనలకు యాక్తిక సమాధానము లిచ్చుటలోను "ఆంధ్రకేసరి" పత్త్రిక సర్వ విధములఁ దోడ్పడినది. ఆదినములలో 'లోకాతిశాయి' వీరేశలింగము పంతులు మీఁద నీఁగ వ్రాల నీయక చూచు చుండెడి వాఁడు. అంతటి పరమ విశ్వాసి వీరభద్రరావు పంతులు. ఆ వీరావేశ దినాలలో వీరభద్రరాయని లేఖని 'ఆంధ్రకేసరి' పత్త్రికలో మొనదేఱి, వడి తిరిగినది. కమ్మచ్చునఁ దీసిన శైలి యేర్పడినది.

మూఢాచార విశ్వాసములలో మునిఁగి యాంధ్రులు తికమక పడు చున్నా రను ఆ వేదనలోనే వీరభద్రరావు పంతులుకుఁ బ్రాచీనాంధ్ర ప్రతిభా సౌభాగ్య సద్వైభవం బులఁ దెలిసికొనవలయు నన్న తృష్ణతో, జుగుప్సతో, నాంధ్ర కవుల చరిత్ర భాగములు భాగములుగా వీరేశలింగము

౦తులు ప్రకటించుచు వచ్చి యుండుటను జూచి "మన దేశపుఁ బూర్వ చరిత్రకు సంబంధించిన యెన్నెన్ని సంగ తులనో వీరేశలింగము పంతులు త్రవ్వి వెలికి వేయు చున్నారు. ఎచ్చటి నుండియో" యను జిజ్ఞాస వీరభద్రరావు పంతులను బట్టి బాధించు చుండినను వీరేశలింగము పంతులు మాత్రము ఆ మర్మము నెఱుక పఱచ లేదు. అందువలన మనసులో అశాంతి ప్రబలి దేశచరిత్ర వంక దృష్టి మరలినది. ఆ దృష్టి యెట్టకేలకు సమగ్ర దేశ భావి భాగ్యోదయము మీఁద నిలిచినది వందేమాతరోద్యమము.

వంగదేశ విభజనమువలన సుషుప్తి నుండి మేల్కొన్న వంగదేశీయుల నవనవోజ్జ్వల శక్తి శతథా సహస్రథా చీలి కలై వాలికలై భారత దేశ మంతటను గంపించి వైచి నది. విపిన చంద్రపాలుఁడు, లాలా లజపతిరాయి, బాల గంగాధర తిలకు,— లోనగు మహావ్రతుల శంఖారావము లకుఁ దెలుఁగు దేశము గూడ దద్దరిల్లినది. దేశమునకు స్వారాజ్యమే లక్ష్య మైనది. 'వందే మాతరం' మంత్ర మైనది. లక్ష్య సిద్ధి కయి ప్రాఁకు లాఁడ వలసి వచ్చినది. మన జాతి, మన సభ్యత, మన జన్మభూమి, స్వర్గము కంటె నధిక మను పనసలు వల్లన వేయు చుండిరి. క్రొత్త యుగమునకు, నూత నాశయములకు, వసంతోదయ మై మంగళతూర్య నినాదములు సెలరేఁగినవి. కాఁగా, ఆవేశ పరిపూరితం బైన హృదయము వీరభద్రరావు పంతులు గారిది. ఈ నూతన లక్ష్యములకు వారి హృదయము స్పందించి హృదయ తంతులు మ్రోఁగి

నవి. ఆయన యందు దేశమును గలవర పఱచిన వినూత్నో ద్యమ వృక్షమున ఫలించిన తొలి పంటఁగా "జీర్ణ కర్ణాట సామ్రాజ్యము" ఆంధ్రుల శ్రుతి పథంబునఁ బడినది. మాతృ సేవా రతితో మాతృసేవా మందిరమున సమర్పిం చిన తొలి పుష్పమే "జీర్ణ కర్ణాట సామ్రాజ్యము."

వీరేశలింగము పంతులకును, వీరభద్రరావు పంతుల కును,— లక్ష్యము దేశాభ్యుదయమే యయ్యును సాధనలు భిన్నము లౌటచేఁ గార్య రంగములలోఁ గూడఁ బరిణామ మేర్పడినది. వీరేశలింగము పంతులు గారికి మత సంస్కార మును, సంఘ సంస్కారమును, అభిమానోద్యమములు కాఁగా, వీరభద్రరావు పంతులు గారికి దేశమునకు ఆత్మ ప్రత్యయ మొదవించుట నియతవ్రత మైనది. వీరేశలింగము పంతులు బాహ్య మతాచార విశ్వాసముల గర్హించి, యవ హేళనఁ జేసి, జాతికి సంస్కారము గలిగింపఁ బోఁగా, వీరభద్రరావు పంతులు ప్రాచీన జాతీయ వైభవ మగపఱచి నిద్రా ముద్రితము లయిన యంత శ్శక్తులను మేల్కొలిపి క్రొత్త జాతిగా దిద్దఁ బోయి నాఁడు.

కాఁగా, వీరభద్రరావు పంతుల సంకల్ప బలము మాన నీయు లయిన "చారిత్రక సార్వభౌమ" శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతుల వారి యాలంబనమును జేకూర్చినది. కావుటం జేసి వీరభద్రరావు పంతులు చెన్నపట్టనమునకుం జని వేంకట లక్ష్మణరావు పంతుల వారి ప్రోత్సాహ సాహా య్యముల వలన నాంధ్రుల చరిత్ర ప్రథమ భాగమును ప్రక

టించిరి. ఆవలఁ గొన్నాళ్ళకే ద్వితీయ భాగమును గూడఁ బ్రకటించిరి. ఆలో, దేశమునఁ బొడసూపిన మహోజ్వాల సంచలనము తెలుఁగు జాతి కన్నులఁ దెఱపించినది. తెఱచుట తోడనే యనేక విధము లయిన సంస్కారములఁ బడసినది. సంస్కారములఁ బడసినదే తడవుగ నాంధ్రోద్యమ మారంభ మైనది. తత్రాపి బాపట్లలో ప్రథ మాంధ్ర సభ కూడినది. ఆ యుత్సాహము, ఆ దీక్షా బలము, ఆ యైకమత్యము, జూచి తెలుఁగు జాతి ప్రాచీన మైన జాతి యని, ప్రాచీన సభ్యత కల దని, మన సంస్కృతి ( Culture ) ని విస్మరించితి మని, మరల జ్ఞాపక మొనర్చికొని పూర్వపు ఔన్నత్యమును బడయుట కర్తవ్య మని, యందఱును ముక్త కంఠు లయిరి. ఇవ్విధముగ జాతి మేల్కొనుటకు నాంధ్రుల చరిత్రను రచించిన మన వీరభద్రరావు పంతులే కారకు లని వేఱఁ జెప్పఁ బని లేదు.

కొన్ని కారణముల వలన వీరభద్రరావు పంతులు చెన్నపట్టనము వీడి కొవ్వూరునకు వచ్చిరి. సాంసారిక సంబంధము లయిన చిక్కు లనేకములు దటస్థించుటచే మంత్రోత్సాహ శక్తులు మాత్రము మిగిలియున్నవు బత్త్రికా నిర్వాహణమునఁ జరిత్ర రచనలోను, దత్ప్రకటనమునను, వీరభద్రరావు పంతుల యుత్సాహము బహు రూపంబుల బహు ప్రకారంబుల సగపించినది గాని ప్రభుశక్తి యంది రాలేదు.

కాఁగా, నేల విడచిన సాముగాఁ బరిణమించినది. దేశమును, జాతియు, ఆశా హృదయముతో వీరభద్రరాయని వంక సాభిలాషముగ దృష్టి సారించుటయే గాని వారి యాత్మీయ జీవిత సౌభాగ్య సంబంధ విషయములు స్పృశించుట జాతి యొక్క ధర్మము గాలేదు. జాగరిత మైన యాంధ్ర జాతి వీరభద్రరాయనికి సమర్పించినది "చారిత్రక రత్న" "చరిత్ర చతురానన" బిరుదములు మాత్రమే! మొదటిది "ఆంధ్ర సారస్వత పరిషత్తు" వా రొసంగినది. రెండవది "ఆంధ్ర మహాసభ" వా రిచ్చినది.

తిమ్మరుసు మంత్రి, తిక్కన, అళియ రామరాయలు, శ్రీనాథుఁడు, ఆంధ్రుల చరిత్ర, కర్ణ సామ్రాజ్యము, నాయకురాలి దర్పము, — ఇవి వీరభద్రరాయని కృతి రత్నములు. కాని, తెలుఁగు జాతికి ఆ మహామహుని వలన నంద వలసిన రత్నము లివియేనా? ఆంధ్ర జాతి యుత్సాహ సాహాయ్యములే యీ జాతి రత్నమునకు లభించి యుండి నచో నింక నెన్ని యమూల్య గ్రంథ ప్రసూనముల నందించి యుండెడిదో యెవరి కెఱుక! కాని యేది? తెలుఁగు జాతి దురదృష్ట మనక తప్పదు.

వీరభద్రరాయనికి వయసు ముదిరిన కొలఁది శరీర పాటవము, శరీర లావణ్యము, బుద్ధి సూక్ష్మత, తీక్ష్ణత, — హెచ్చుచునే యున్నది గాని తఱుగ లేదు. ఉత్సాహము

మొక్కవోవ లేదు. దృష్టి సెదర లేదు. పెట్టుకొన్న లక్ష్యము మాఱ లేదు. పావన మైన గౌతమీ తీరంబున గోపాద పుణ్యక్షేత్రమ్మున నాంధ్రదేశ సమగ్రాభ్యుదయమున కై వీరభద్రరాయఁ డింకను దప మొనర్చుచునే యున్నాఁడు. జాత్యభ్యుదయమునకుఁ గారణ భూతుఁ డయిన త్యాగమూర్తి, చిరారాధ్యుఁడు, చిరస్మరణీయుఁడు, శ్రీ వీరభద్రరావు పంతులు.



## భారతీయ విజ్ఞాన పరిశోధకుఁడు

# రి చా ర్డు పి షె ్ల్

ఇతఁడు జ్మారణ్య (Germany) దేశీయుఁడు. "సెలీషియా" లోని "బ్రెస్లో" యను గ్రామమునఁ గ్రీస్తు శకము 1849 దవ సం॥రము జనవరి 18 దవ తేదీన జన్మించి, Elementry Text-Book of Sanscrit అను గ్రంథమును రచించిన A. F. Stengiler అను వానియొద్దఁ బ్రాచ్య భాష (Oriental Languages) ల నభ్యసించి, యతని గురువు వ్రాసిన గ్రంథమునకు రూపురేఖల నమర్చి యాతనిచే బహుముఖంబులఁ బ్రశంసింపఁ బడిన మనీషి.

లాటిన్ (Latin) భాషలో శకుంతల పయిని నొక పరిశోధక వ్యాసము (Thesis) ను వ్రాసి 'Doctor' బిరుదమును బడసిన విచక్షణుఁడు. క్రీ. శ. 1870–71లో పరాసు (France) మీఁద జరగిన యుద్ధములో నితఁ డొక శౌర్యధనుఁడు. ఆ యుద్ధము జరగిన పిమ్మట నితఁడు భారతీయ విజ్ఞాన గ్రంథములఁ బరిశీలించుట కయి యుపకార వేతనము (Stipend)ఁ బొంది యింగ్లండునకుఁ బోయి యట భారతీయ శాస్త్రగ్రంథముల వ్రాఁత ప్రతులను బరామర్శించుచుఁ బ్రాకృత వ్యాకరణము (Grammer in prakrit) ను వ్రాసి నాఁడు. ఆవలఁ గ్రీస్తు శకము 1873 లో నితనికి అధ్యాపక పదవి లభించిన తర్వాతఁ గ్రీ. శ. 1877 లో "కీల్" విశ్వ విద్యాలయమున ప్రొఫెసరుగా నియమింపఁ బడినాఁడు. క్రీ. శ. 1902 వ సం॥రము

వఱకును "బెర్లిన్" విశ్వ విద్యాలయములోను, "హాల్" విశ్వ విద్యాలయము నందును. సంస్కృత విభాగాధ్యక్షులు (Head of the Sanscrit Department) గా వ్యవహరించి నాఁడు. "కారల్ గెల్డ్నెర్" అను వానితోఁ గలసి యితఁడు వేదకాలము నుండి క్రీ. శ. పం|డెండవ శతాబ్దము వఱకుఁ గల సాహిత్య రీతులను బరిశీలించి మూఁడు సంపుటములఁ బ్రకటించి నాఁడు.

వేదముల నర్థముఁ జేసికొనుట కయి భారతీయులు వ్రాసి కొనిన వ్యాఖ్యానములనే యనుసరించ వలయును గాని వేఱొండు ఆధారమే లే దని యాతని యభిప్రాయము. సంస్కృత నాటకముల గుఱించి యితఁడు వ్యాసములఁ బెక్కింటిని వ్రాయుటయే గాక "హాల్" విశ్వవిద్యాలయమున హైందవ నాటకములు బొమ్మలాటనుండి యభివృద్ధి యైన వని యుపన్యాసముల నిచ్చినాఁడు.

హేమచంద్రుఁడు రచించిన ప్రాకృత వ్యాకరణము (Hemachandra's Prakrit Grammer) ను జర్మని భాష లోని కనువదించుటయే గాక "ప్రాకృత భాషల వ్యాకర ణము — అపభ్రంశ భాషా విజ్ఞానమునకు మార్గము" — అను గ్రంథముల రెండింటినిఁ గూడ విరచించి నాఁడు. "ఓల్డెన్ బరో" తోఁ గలసి బౌద్ధ భిక్షువుల గీతములను పాలీ

భాషలోఁ బ్రకటించి నాఁడు. క్రైస్తవుల మత్స్య చిహ్నము బౌద్ధుల చిహ్నముల నుండి వచ్చినదే నని యీతని విశ్వాసము. భాషా పరిశోధన మీతనికిఁ గ్రీడ వంటిది. ఆ పరిశోధనాంశములఁ దన హృదయ కుహరము నందె యుంచుకొనక పది మందికిఁ జెప్పి యానంద వారాశి నోల లాఁడు వాఁడు.

క్రీ. శ. 1904 లో "Prince and Poet" అను గ్రంథమున హిందూ రాజుల యాస్థానములలో జరగు విద్యా గోష్ఠులను వివరించి మురిసి నాఁడు. అంతతోఁ దనివోక "బుద్ధుని జీవిత విశేషములు — ఆయన బోధలు" అను నంశము పయినిఁ బెక్కు సంపుటములుగఁ బ్రకటించి నాఁడు.

క్రీ. త. 1906 వ సంవత్సరమున "The culture of the present Age" అను గ్రంథమునఁ బ్రాచీనార్వాచీన సాహిత్యాంశములను సవివరముగఁ బరామర్శించి నాఁడు. ఇతని గ్రంథము లన్నియుఁ గలకత్తా విశ్వవిద్యాలయ (Culcutta University Library) గ్రంథ భండారమునఁ గలవు. ఈయన గ్రీకు భాషలోఁ గూఁడఁ బండితుఁడే! ఉత్తర హిందూస్థాన మందలి "దర్దులు" అను దిమ్మరీఁడుల భాషకును — శార్మణ్య 'తండు' భాషకును — బొరపొచ్చములు లేని సాదృశ్యము లున్న వని యీతని యభిప్రాయము. ఇ య్యభిప్రాయముతో నొక తండా దిమ్మరీఁడులను దఱచుగాఁ

బిలుచుకొని వచ్చి వారి భాషను జక్కఁగా నర్థముఁ జేసికొని దిమ్మరీఁడుల భాష లన్నియు నొకే కోవకుఁ జెందిన వని యభిప్రాయము గల వాఁడయ్యెను.

ఇ విధముగ నితఁడు భాషా పరిశోధనకు - సంస్కృత గ్రంథ పరిశీలనకుఁ,- దన జీవితము నంకిత మొనర్చి యున్నాఁడు. భారతీయ గ్రంథములఁ బరిశీలించి భారతీయు లతో సంప్రదించినఁ గాని ప్రయోజనము లే దనియు, జీవితము సార్థకతఁ జెంద జాల దనియు, నెంచి యితఁడు భారత దేశమునకు నౌకలో బయల్దేఱి యెఱ్ఱ సముద్ర (Red Sea) ప్రాంతముల నొక విషపురువు ఆయన చెవినిఁ గఱచినను లక్ష్యము సేయక ఆ బాధ తోడనే "కొలంబో" (clombo) చేరి కాండీ, అనిరుద్ధ పురముల వీక్షించి భారత దేశమునఁ గా లిడిన పట్టుదల మనిషి. ఆ పిమ్మట మధుర మీఁదుఁగాఁ జెన్నపట్టనమునకు వచ్చి General Hospital లోఁ బ్రవేశించి తన యాప్తుఁ డయిన డాక్టరు ఓటో ఫ్రేడర్ (Dr. Oto Frader) (అడయారు దివ్యజ్ఞాన సమాజ గ్రంథ భాండాగారాధిపతి, జర్మన్ పండితుఁడు) సాహాయ్యముతో ఆ బాధను నివర్తింపఁ జేసికొని నాఁడు గాని యా తర్వాత నెక్కువ కాలము జీవించ లేదు.

పాపము! తుదకుఁ క్రీస్తు శకము 1908 వ సంవత్సరము డిశంబరు 26వ తేదీన ఇతఁ డిహలోక యాత్ర చాలించఁగా,

మద్రాసు ప్రాటెస్టెంటు స్మశానములో ఖనన మొనర్పఁబడి నాఁడు.

కావుననే శార్మణ్య దేశపుఁ బండితుఁడు డాక్టరు "విల్ హెల్మ్ ఘూల్జ్" అను నతఁడు పిష్కెల్ చనిపోయి నప్పుడు "ఇ మ్మహాభాగుఁ డేది తలంచినను దాను నేదే నొక విధముగ నానుపూర్విగఁ దెలిసికొననిదే విడచువాఁడు కాఁడు. సాధ్యాసాధ్యములు, అవకాశములు, — ఇతని కార్యాచరణకు నడ్డువడ లేదు. అనుకొన్న కార్య మగుచుండ వలసినదే! ఆయన తలంచిన కార్యక్రమము ఆ జీవిత కాలములో నగు నట్టిది గా కున్నను జీవించిన కాలములోఁ గృషిఁ జేయుచునే యున్నాఁ" డని వ్రాసినాఁడు.



"విమర్శక శిరోమణి"

# కందుకూరి వీరేశలింగము పంతులు

ఆంధ్ర జాతీయ వికాస విజృంభణములకు మార్గదర్శియు మూల పురుషుఁడు నయిన శ్రీ వీరేశలింగము పంతులు తెలుఁగు ప్రజలకు వినూత్న విజ్ఞాన పథమ్ములఁ ద్రొక్కిచూపినాఁడు. వీరి పూర్వుల నివాస స్థళము నెల్లూరు మండల మందలి కందుకూరు. పంతుల వారి ముత్తాత తండ్రి గా రగు రాజలింగము గారి కాలమున ఈ కుటుంబము గోదావరి మండలమున కేతెంచి యేలూరు నివాస స్థళముగాఁ జేసికొనిరి. పంతుల వారి ముత్తాత గా రగు చంద్రమౌళి గారిని గుఱించి యంతఁగాఁ దెలియదు గాని పంతుల వారి తాత గా రగు వీరేశలింగము గారు ఏలూరు నందలి జమీన్దారుల యొద్ద మంత్రి యై పారమార్థిక చింత చేతను, జమీన్దారీ వ్యవహారములఁ జక్క దిద్దుట వలనను, మంచి సమర్థు లని యెన్నికఁ గాంచిరి. ఆయన కిద్దఱు పుత్త్రిలు. జ్యేష్ఠులు వేంకట రత్నము గారు. వీరు రాణ్మహేంద్రవర మండల కరగ్రాహి (District Gollector) కడ నుద్యోగముఁ జేసిరి. వీరికిఁ బుత్త్రి సంతానము లేదు. ద్వితీయులు సుబ్రహ్మణ్యము గారు. ఇ య్యన్నదమ్ము లిద్దఱును సంస్కృతాంధ్రముల నాఱితేఱి యంతతోఁ దనివోక ఆంగ్లభాషను గూడ నభ్యసించి యుద్యోగములఁ జేసిన ప్రయోజకులు. లింగధారి నియోగి బ్రాహ్మణులు. పంతుల వారి పితామహుఁడు వీరేశలింగము గారు తమ వంశ సంప్రదాయ మగు లింగధా

రణమును ద్యజించి సంస్కరణ ప్రియత్వమును బ్రకటించిన వాఁడు. ఆవల రాజమహేంద్రవరమున రాజాశ్రయము సంపాదించి యచ్చట నొక విశాల భవనము నిర్మించి బంధు పోషకుఁడు, పరోపకారి, యను కీర్తి వహించెను. ఈయన సుపుత్రులే వేంకట రత్నము - సుబ్రహ్మణ్యము గార్లు. సుబ్రహ్మణ్యము గారి కుమారుఁడే మన కథా నాయకుఁడు. తల్లి పున్నమ్మగారు. స్వస్తిశ్రీ కీలక నామ సంవత్సర చైత్ర శు ౧౩ సోమవారము (16-4-1848) నాఁడు సూర్యోదయాది మూఁడు గడియలకు శ్రీ వీరేశలింగము పంతుల వారు జన్మించిరి. కాని జన్మించిన మఱుక్షణము నుండి శ్వాసరోగముచే దుర్బలుఁడై యుండుటకుఁ దోడు ఆఱు మాసములు రాఁగానే విశూచి వ్యాధి సోఁకెను. వీరి నాలవ యేఁట వీరికిఁ బితృ వియోగము దటస్థింపఁగాఁ బెద తండ్రి వేంకట రత్నము గారే పెంచిరి. అప్పటి నుండియుఁ బున్నమ్మ గారును, బంతులవారును, బెదతండ్రి వేంకట రత్నము గారి సంరక్షణ మందె యుండు చుండిరి. ఐఁదవ యేఁట నక్షరాభ్యాసము కాఁబడి రాజమహేంద్రవరము నందలి గోపాలస్వామి యాలయమున నున్న వీథిబడి లోనికిఁ బంపఁబడి యటఁ గొన్ని నాళ్ళు చదువుకొని యవల నవ్వీథిబడికి దవుదవ్వుల నున్న గూని పంతుల తెలుఁగు బడిలోఁ బ్రవేశించి కొంతకాలము సదువుకొను చుండి నప్పుడే పంతుల వారు మిగత బాలురతోఁ గలసి చాటున మాటున గూని పంతుల నవహేళన మొనర్చు చుండుటచే దేశ ప్రఖ్యాత మైన హాస్య - సంజీవనుల ప్రాయ నే రొప్పిదవిన దని చెప్ప వచ్చును.

వీరికి నెనిమిదవ యేఁట నుపనయనము జరగినది మొదలు వీరు ముప్పొద్దుల సన్ధ్యా వందన మాచరించుచు గాయత్రి నుపాసించుచు నుండిరి. అప్పు డప్పుడు ప్రాత స్స్నాయాహ్న ములఁ బవిత్ర మైన గౌతమీ తీరమున కేఁగి యందుఁ దాన మాఁడి సూర్య భగవానున కర్ఘ్య మిడి ప్రదోషకాలమ్మున మార్కండేయ స్వామి యాలయమునకును – గోపాలస్వామి యాలయమునకును,– బోయి భారత భాగవతములం గల రసవ ద్ఘట్టములఁ బఠించు చుండెడి వాఁడు. ఇ మ్మహామేధావి యిట్లు నిత్య కర్మానుష్ఠాన పరుఁ డై లలాటమున విభూతి రేఖలఁ దీర్చిదిద్ది వక్షస్స్థలమున, భుజ ద్వయంబున, విభూతిని ధరించి, శుద్ధ శ్రోత్రియునిం బలె బిళ్ళగోచినిఁ బెట్టుకొని, వటువు వలెనే యుండు చుండెడి వాఁడు.

పాఠశాలలో నుపాధ్యాయుల యెడ వినమ్రతయు, భక్తియుఁ, దోడి విద్యార్థుల యెడఁ బ్రేమాదర భావము లును, గలిగి యుండుట వలనఁ బంతుల వా రందఱచేఁ బ్రేమ పాత్రుఁ డై చదువులోఁ బ్రథమ బహుమతుల నందుచుండెడి వాఁడు. పూవు పుట్టఁగనే తావి పొడముట సాజమే గదా!

వీరేశలింగము పంతులు గారి పెదతండ్రి వేంకట రత్నము గారు ఉద్యోగముఁ జేయుచుఁ బొరుగూళ్ళకుఁ బోవు నప్పు డెల్లను పంతులు గారిని వెంటఁ బెట్టుకొని పోవుచు భారత – భాగవత – రామాయణాదులఁ జదివించుచు, నందుఁ దెలియని చోటుల నర్థముఁ జెప్పి బోధించుచు, వల్లన వేయిం చుచు, నాంగ్ల భాషను గూడ నభ్యసింపఁజేయ వలయు నని

తలంచి వీరి పండ్రెండవ యేఁట సనఁగాఁ, గీస్తు శకము 1860 దవ సంవత్సరమున నాంగ్లేయ పాఠశాలకుఁ బంపిరి.

కాఁగా, వీరికి దేహ దార్ఢ్యత లేని లోటు బుద్ధియందుఁ బూర్తి యౌటచేఁ బాఠశాలలోఁ బ్రథములుగా నుత్తీర్ణులయిరి. అందు వలన ఆ మఱుసటి 1863 వ సం॥రమున పంతులు గారికిఁ బ్రబల మైన వ్యాధి యంకురించుటచేఁ జదువు మాని మరల 1865 దవ సం॥రము నుండి చదువ నారంభించి చుఱుకుగాఁజదువు చుండుటచేఁ బ్రభుత్వము వారీతనికి విద్యార్థి వేతన (Scholor - Ship) మొసంగిరి.

ఆ సంవత్సరము నుండియుఁ బంతులు గారు విద్యార్థి వేతనముఁ (Scholor - Ship) బడసి చదువు ముగియు వఱకు నుచిత విద్య నందఁ గలిగిరి. ఆ పాఠశాలోపాధ్యాయులు వీరేశలింగము పంతులు గారి బుద్ధి పాటవమును, సత్యాదరమును, న్యాయ్య విచక్షణతను, గ్రహించి, వాని నొక పెద్దఁగా నేర్పఱచి, యీయన యడుగు జాడలలో, మాట పొందికలో, వర్తించు చుండిరి. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుఁడు మాత్రము స్వేచ్ఛా విహారి యై యుద్యోగధర్మములఁ గూడ విస్మరించి పాఠముల సరిగాఁ జెప్పక కాలము వృథఁ బుచ్చు చుండుటచేఁ బంతుల వారు తోడి బాలురతోఁ గూడి ప్రధానోపాధ్యాయుని ప్రవర్తనము, ఉద్యోగ ధర్మ నిర్వహణము పట్ల నాయనకుఁ గల నిర్లక్ష్యమును, సంప్రదించి కొని పయి యధికారులకుఁ దెలుపఁగా, న య్యధికారి (Director of Public Instruction) యీ ప్రధానో

పాధ్యాయుని మందలించి యా పాఠశాల నుండి యెటకో తరలించిరి.

దీనిం బట్టి యుద్దిష్ట కార్యముల నిర్వహించక లజ్జా కరముగఁ బ్రవర్తించు వారినిఁ దమ శక్తి కొలఁది సంస్కరించి క్రమ మైన మార్గమున నుంచుటయే పంతులు గారి యుద్దేశ మని తెలియం దగి యున్నది. ఇ య్యుద్దేశము, పట్టుదల, బాల్య ప్రభృతి పంతులు గారికిఁ గల దని చెప్ప వచ్చును.

క్రీ.శ. 1869 దవ సంవత్సరమున వీరేశలింగము పంతులు గారు ప్రవేశ పరీక్ష (Entrance Examination) కుఁ జనిరి గాని దగ్గు బాధచేఁ జదువు సాఁగక కృతార్థులు గా లేక పోయిరి. కాని మఱుసటి సంవత్సరమునఁ గృతార్థు లయిరి.

పంతులుగారి వివాహము క్రీ. శ. 1862 వ సంవత్సరముననే యనఁగా నాయన పదుమూఁడవ యేట రాజమహేంద్రవరమునకు దాఁపున నున్న "కాతేరు" గ్రామ వాస్తవ్యు లగు శ్రీ అద్దంకి పట్టాభిరామయ్య పంతులు గారి ద్వితీయ కొమార్తె బాపమ్మ యను నామె నిచ్చి వివాహము జరపించిరి. ఆ సమయంబున వధూవరుల పక్షమున భోగము మేళ మేర్పాటు కాఁ బడియెను. వివాహ కాలమున నీ రీతి వ్యయించి సంసారములు గుల్ల లగుట సంఘ దురాచారము లలో నొకటి యై యుండెను.

ప్రసన్నమ్మగారు కోడలికి ' బాపమ్మ ' యను పేరు బాగు లేదని "రాజ్యలక్ష్మమ్మ" యని నూతన నామ మొసంగెను. వివాహ మైన పిమ్మట నింటిలోని యాఁడు వాండ్రకు సామరస్యము, కలయిక, కుదురక కల్లోలములకుఁ ద్రోవఁ జూపుటను బట్టి శ్రీ వేంకటరత్నము గారు తమ కుండిన యాస్తిలో న్యూనాధిక్యతలు లేక సాఁబాలు పంచి యిచ్చి, వేఱుగా నుండుఁడని యాదేశించిరి.

అప్పటికే ఛందో వ్యాకరణాదుల నవగాహ మొనర్చికొని పద్యముల నల్లుటకుఁ బ్రారంభించి మార్కండేయ శతకము - గోపాల శతకము నను శతకముల రెండింటిని కంద పద్యములలో నిబంధించెను. 1860 లో సర్వకళాశాలా పరీక్షకుఁ బోయెను గాని కృతార్థుఁడు కాలేదు. 1869లో మరల నారోగ్యము చెడి చదువు మానికొన వలసి వచ్చెను. ఆ కాలమున గ్రంథరచనకు దొరఁకొని "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము - రసికజన మనోరంజనము - అను రెండు గ్రంథముల రచించి మంచి పేర్వడసెను. ఈ సంవత్సరకాలములో నొక న్యాయవాది (pleader) యొద్ద దినమునకు మూఁడు గంటలు పనిచేసి ముప్పది రూపాయలను, దొరలకిద్దఱకుఁ దెలుఁగు చెప్పి ముప్పది యైదు రూపాయలను, నెల యొక్కింటికి సంపాదించు చుండెడి వాఁడు. 1870 లో స్వయముగఁ జదివి సర్వకలా పరీక్షయందుఁ గృతార్థుఁ డయ్యెను. కాఁగానే రాజమహేంద్రవరము నందలి ప్రభుత్వ విద్యాలయమున నెలకు నిర్వదిరూపాయల వేతనము మీఁద

సహాయోపాధ్యాయుఁడుఁ గాఁ బ్రవేశించి యాదర్శోపా ధ్యాయుఁ డని పేరందెను. కాని యీ యుద్యోగము కొన్ని మాసములకే నిలచి పోఁగాఁ, బిమ్మట 1871 వ సంవత్సరమున Criminal Higher Grade లోఁ గృతార్థుఁ డయ్యెను. ఆ దినములలోఁ గల పూర్వాచారముల సంస్కరించినఁ గాని ప్రయోజనము లేదను భావములు గల వాఁ డయ్యెను. గాని 1872 లో Translation Lower Grade పరీక్షకు నేఁగి యా పరీక్షయందుఁ గృతార్థుఁ డయ్యెను. 1872 వ సంవత్సరము నుండి 1874వ సం॥రము దాఁకఁ గోరంగి యాంగ్ల పాఠశాలలో నెలకు ముప్పది రూపాయల వేతనముతోఁ బ్రధానోపాధ్యా యత్వము (Head Master) వహించిరి. అట నున్న కాల మున విద్యాప్రబోధిని (గోదావరి), పురుషార్థ ప్రదాయిని, (బందరు), ఆంధ్ర భాషా సంజీవని (మద్రాసు), పత్త్రికలకుఁ దన వ్యాసములను, గ్రంథభాగములను, బంపు చుండెడి వాఁడు. కోరంగి నుండి 1874 వ సం॥రమున ధవళేశ్వర మందలి 'Anglo Vernacular School' (ఆంగ్ల దేశ పాఠ శాల) లో నెలకు నలుబది నాలుగు రూపాయల జీతముతో నుపాధ్యాయుఁడుఁగాఁ బ్రవేశించిరి. కాని 1876 వ సం॥రము వఱకును బనిచేసి ఆవలఁ ద త్పాఠశాల ప్రధానోపాధ్యాయు నకును. వీరికిని, అభిప్రాయభేదములు వొడముటచే నుద్యోగము చాలించుకొని 'వివేకవర్ధనీ ముద్రాక్షరశాల' యను దాని నేర్పఱ యా పేరి తోడనే వార్తా పత్త్రికను బ్రచురింప నారం భించెను. ఈ మధ్యకాలములో సంక్షేప లేఖనము ( Precis

Writing) పరీక్ష యందుఁ గృతార్థుఁడై యింకఁ బరీక్షల కేఁగుట ధర్మము గా దని విరమించుకొనియెను. ఉద్యోగమే చేయ రా దనియుఁ, జేసినచో దోషరహిత మగు నుపాధ్యా యత్వ మొక్కటియే చేయఁ దగు ననియు, నిశ్చయించు కొనియెను. స్త్రీ విద్యను గుఱించిన గద్యపద్యవ్యాసములఁ బెక్కింటిని వార్తాపత్రికలకుఁ బంపుచు, నందు పయి వచ్చు విమర్శలకు సమాధానముల నిచ్చుచు నుండెడి వాఁడు. తన యం దంత ర్గర్భిత మై వెలికి నుప్పొంగుచున్న సంస్కరణ భావములను "వివేక వర్ధని" యను పత్రికను 1876 లో స్థాపించి యందుఁ బ్రస్ఫుటీకరించు చుండెడి వారు.

వీరేశలింగము పంతుల వారు దేశ క్షేమమున కయి కృషి జేయ నారంభించు నాఁటికి మన దేశముఁలో నధర్మ ప్రవర్తనము మితిమీఱి యుండెను. ఇప్పుడు పట్టణములలో నగపించు ధర్మహార్మ్యములలో సాఁబాలును, గ్రామాల లోని ఇనాం భూములలో ముప్పాలును, లంచగొండులకు న్యాయాధికారులచే నార్జింపఁ బడిన వని వేఱుగఁ జెప్పఁ బనిలేదు. పురాతన కాలమున దండన న్యాయాధికారుల యప కృత్యములకు మితియు మేరయుఁ గలదా! "ఊరి పిడుగు వీరి శెట్టినిఁ గొట్టుకు పోయిన" దనిన యట్లూర నేదేని దొంగతనము జరగిన సంపన్నుల గృహాలు గుల్లలై దొంగ యెత్తుకొని పోయిన దానికిఁ బ దింతలు న్యాయాధి కారుల – రక్షణ భటుల – గృహాలలోఁ బడు చుండెను. యజ్ఞముల కని పే ర్వెట్టి గ్రామాల మీఁద బందిపోటులం

బలెఁ బడి సొమ్ము దోఁచుకొని పోయిన న్యాయాధికారులు మీ కండ్ల యెదుట నెందఱు కలరో చూడుఁడు. నెలకు నెన్మిది రూకల జీతముతో సతమత మూచున్న గుమాస్తాలు (Clerks) వేలకొలఁది బాపన్నలకు ద్వాదసులు పెట్టి ముక్తినిఁ గన్న వా రెందఱు లేరు? "బరువు పొట్లము – తీర్పు ఖాయ" మను నట్లిప్పు డే న్యాయ్య సభల యం దేని న్యాయాధిపతు లను చూడ వినుకలి యగు చున్నదా! బరువు పొట్లము రహస్యమును జెప్పెదను వినుదురా? పూర్వ మిఱుకక్షుల న్యాయ్యవాదులును దమతమ పక్షమునకు ననుకూలించు తీర్పులను దమరే వ్రాసి యా కాగిదముల తోడనే లంచపు ధనమును బొట్లముఁ గట్టి న్యాయాధికారుల కీయ వారు వాది ప్రతివాదుల వాదనల నెంచి చూచి బరువు పొట్లము విప్పి యందలి సొమ్ము జేబులో వైచికొని దానికిఁ జుట్టి యుండు తీర్పును ఖాయపఱచు నాచారము గల్గి యుండెను.

ముప్ప దేండ్లకుఁ బూర్వ మివియు, నిట్టివే యగు ననేకములును, వాడుకలో నుండి యుండెను. కాని యిప్పు డిట్టివి "వివేక వర్ధని" పత్త్రిక వలన శశ విషాణము లయినవి. 1876 వ సం.రమున "వివేక వర్ధని" యను పత్త్రిక ప్రారంభించి ప్రయోజనము నందును వివేక వర్ధని యై, మతాధికారుల కుటిల ప్రవర్తనమును వెల్లడించి ప్రజల కుప కార మొనర్చిరి. వివేక వర్ధనితో పాటు 'హాస్య సంజీవని'

యుఁ బ్రకటించి చమత్కార రసమును జక్కఁగాఁ బోషించిరి.

పంతులు గారికి సంస్కరణాభిలాష కలిగినపిమ్మట శైలి మార్దవమై గ్రంథరచనకు ననుకూలించినది. తత్రాపి వీరి గ్రంథరచన మృదు మధుర మైన, మార్దవ మైన శైలిలో నడచినది.

వీరి సంఘసంస్కరణోద్యమమును జూచి యేవఁగించు కొన్న వారు గూడ మెచ్చుకొనఁ దగిన వీరి భాషా సేవ యనుపమానము నపారము నని ప్రశంసించక తప్పదయ్యెను. నాటకములు వ్రాయుట, వచన కావ్యములు రచించుట, హాస్యములు వ్రాయుట, పద్య కావ్యములు సేయుట, యను విషయమున నెందు వీరి కధిక శక్తి సామర్థ్యము లున్న వని విచారించువారికి నన్నిటఁ దగిన శక్తి సామర్థ్యములే యున్న వని గ్రహింపక పోరు. వీరు పండిత వంశమునకుఁ జెందిన వా రగుట చేతను, వీరి పూర్వులలోఁ గొందఱు గ్రంథములఁ గృతి నందికొని యుండుట చేతను, బాల్యము నుండియు వీరికిఁ దెలుఁగు భాష యం దాదర భావ ముండి యుండెను. అచ్చు పడిన తెలుఁగు గ్రంథము లా కాలమునఁ జాల తక్కువగా నుండి యుండుట వలనను, వాని మూల్యములును నత్యధికము లగుటచేతను, వీరేశలింగము పంతులు గారు గ్రంథవిక్రయ శాలలకుం (Book - Shops) జని, యటఁ జదివికొను చుండెడి వారు. పాఠశాలలో నీయ వలసిన వేతనమును గ్రంథ విక్రయశాల (Book - Shop) వాని కిచ్చి

వాని యొద్ద నుత్తమాంధ్ర గ్రంథములఁ దీసికొని యక్క-డనే కూర్చుండి చదువు కొన్నను నది వారి బాల్య మందలి యాంధ్ర భాషాభిమానమునే సూచించుటయే గాక వారిబుద్ధి వికసనమునుగూడఁ దెలియఁజేయుచున్న దనుటకు సందియము లేదు. విద్యార్థి దశ యందలి దినములును, ఆవల విష్ణు భక్తులై యభాగ్యోపాఖ్యానమును రచించి తమ కవితా సంపన్నతను లోకమునకు వెల్లడించిన నాఁటి ప్రథమ కవిత్వపు దినాలును, అప్పటికి అద్వితీయము లైన కఠిన నియమములతోఁ ప్రబంధమును వ్రాయ వలయు నని "శుద్ధాంధ్ర నిర్వచన నిరోష్ఠ్య నైషధము" ను రచించి సాంబశివున కంకిత మొనర్చిన నాఁటి శివభక్తి దినములును, బిమ్మట నాంధ్ర వచన ప్రబంధ నిర్మాణ కర్తలై "రాజశేఖర చరిత్ర" లోనగు గ్రంథముల వ్రాసి హిందూ దురాచారముల గేలి సేయ నారంభించి వచన కవితా బ్రహ్మత్వ మందిన నాఁటి సంస్కార దినములును, దురాచార దుష్ప్రవర్తనాదికముల సహించఁ జాలక గ్రంథములను - పత్త్రికా వ్యాసములను - హాస్య సంజీవనులును - రచించి హిందువుల యరిష్ట దేవతను వేధించి ప్రాణావశిష్ట మొనర్చిన సంస్కార దినంబులును, అన్య భాషలఁ గల యుత్తమ గ్రంథముల నాంధ్రీకరించి యాంధ్రమునఁ గల లోటులఁ దీర్చి ప్రకృతి జ్ఞానమును స్త్రీ విద్యయును మనకు నుపాదేయము లని సూచించుచుఁ, ద దుపయుక్తము లగు గ్రంథరాజముల రచించిన నాఁటి దేశోద్ధారక దినంబులును, మృదు మధుర వాక్కులచేఁ

బండిత పామర సుబోధముగ హృద్యముగఁ గవిత్వముఁ జెప్పి యాంధ్ర గ్రంథములకుఁ గ్రొం గ్రొత్త గౌరవ ప్రపత్తుల నొసఁ గూర్చు పుష్టి నొసంగి నేర్పు సూచించు నాఁటి కవిత్వపు దినాలును,- అన్నియును వీరేశలింగము పంతులు గారి క్రమాభివృద్ధిని, వారి శక్తి సామర్థ్యములను,- లోకమునకు వెల్లడించుచుఁ దెలుఁగు కవులలో నెవ్వరికి లేని యుత్కృష్ట చరిత్రను మనకుఁ దెలియఁ జేయు చున్నవి.

తన రాజశేఖర చరిత్ర యాంగ్ల దేశములను, దన సత్యవతీ చరిత్రాదులు కర్ణాట, దమిళ దేశము (Carnataka and Tammil-nad) లను, దమ గ్రంథము లన్నియుఁ దెలుఁగు దేశమునను, నిరంతర సంచారములఁ జేయుచుఁ, బ్రజలకు శుభమును - జ్ఞానమును - బ్రసాదించు చుండఁగాఁ జూచు నదృష్ట మెవ్వనికిఁ గల్గినది ?

"రమణీయోక్తులచేత నర్థ గుణ సా
 రస్యంబుఁ గల్పించుచుం ।
దమి నా యంగ చయంబునన్ సహజ సౌం
 దర్యంబు పెంపొందఁ గొం ।
చె మలంకారము లుంచి తొల్లిఁటి కవుల్
 చేష్టా చమత్కార భా ।
గ్యము హెచ్చించుచు దీర్ఘకాలము ననుం
 గాపాడి రర్థ క్రియన్."—

అను వీరి పద్యము పూర్వులు కవితా లక్ష్మినిఁ బోషించు టను దెలుపు చున్న దని గ్రహించినఁ జాలును.

నాటకములఁ దెలిఁగించుటలో నీయనయే మొట్ట మొదటి వాఁడు. ప్రహసనములఁ, బ్రకృతి శాస్త్రములఁ, జరిత్రల వ్రాయుట యందు వీరే మార్గదర్శకు లన వచ్చును. స్వీయ చరిత్రను రచించు వారికిఁ గూడ వీరే త్రోవఁ జూపిరి. గ్రంథములు వ్రాయు నప్పుడొక్క కొట్టివేఁత గాని, తుడుపుఁ గాని, చిత్తు ప్రతులు గాని, యుండెడిది గాదు. వీరి గ్రంథములలో మిక్కుల శ్రమపడ్డ గ్రంథము కవుల చరిత్ర. ప్రాచీ నాంధ్రముల నెన్నిఁటినో ముద్రణావతార మభిలషించి యటమటించు చుండుటను జూచి కన్నుల నీరుఁ గార్చి చాల గ్రంథముల ముద్రించిరి.

1881 వ సంవత్సరము డిసంబరు 11 వ తేదీన మొదటి వితంతూద్వాహము పంతులు గారి ప్రయత్నము వలననే రక్షక భట తతి సాహాయ్యము తోడను, విద్యార్థుల సహకారము తోడను, జరగినది. ఇది జరగిన తర్వాత శ్రీ శంకర స్వాముల వారు పంతుల వారిని వెలివేసిరి.

స్త్రీ విద్యను బ్రోత్సహించుట కయి 1883 వ సం॥రము ఏప్రిల్ నుండి "సతీహిత బోధిని" యను మాస పత్త్రికను బ్రారంభించి రఘుదేవ రాజీయము - దేహారోగ్య బోధిని - లోనగు గ్రంథముల నిందె ప్రచురించిరి. ఇంతతోఁ దృప్తిఁ జెందక వీరేశలింగము గారు స్వయముగఁ గొందఱ స్త్రీలకు విద్యఁ గఱపు చుండిరి.

ఈ పత్త్రిక యొక్క యే సంచిక నైనఁ జదివినచో నోరు లేని యమాయక జనుల కష్టములఁ దొలఁగించుటకు

శ్రీ వీరేశలింగము పంతులు గారు సేసిన కృషి యెట్టిదో తెలియఁ గలదు. ఇ పృత్త్రిక మూలమునఁ బ్రజలు పడు చున్న బాధలను నివారింపఁ బూను కొనుటయే గాక వారు దేశ పరిపాలన విషయమున నెక్కువ స్వాతంత్ర్యములు ప్రజలకు లభించుట కయి పాటు పడు చుండిరి.

వీరేశలింగము గారు 'సరస్వతీ నారద విలాసము' నను ఖండ కావ్యమును సరస్వతి విలపించు చుండఁగా నెందు లకు విలపించు చుంటివి వని నారదుఁ డడుగఁగా, సరస్వతి యాయనకుఁ బ్రత్యుత్తరించుటను ముప్పది నలుబది పద్యా లలో నగపించును. ఆ నాఁటి తెలుఁగు సాహిత్యములో నగపించు నొడుదుడుకులు, అవి యే రీతిఁ బరిహరించ నగు నను విషయములు, ఈ పద్యములలోఁ దెలుపఁ బడినవి.

పండితులు మాత్రము తెలిసికోఁ దగు కావ్యములు వ్రాసినందునఁ బ్రయోజన మేమి? యని వీరేశలింగము గారు తనలోఁ దానే ప్రశ్నించుకొని శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధాదుల రచించిన తర్వాతఁ గావ్యముల నన్నిఁ టిని వచనముననే వ్రాయుట గల్గినది. ఇంతకు ముందు "సింహాగిరి" వచన కావ్యము వంటి కావ్యములు లేక పోలేదు గాని యీ కావ్యములలో వచన రచన చంపూ కావ్యముల లోని పద్య గద్యములం గల గద్యవైఖరి లోనే సాఁగినది.

వీరు చిన్నయసూరి వ్రాసి నట్లుఁగనే సంధి – విగ్రహ ముల రెండింటిని రచించిరి. కాని సూరి శైలి సహజ మైనది.

వీరి శైలి కృతక మైనది కాని చిన్నయసూరి శైలి కంటెఁ బంతులు గారి శైలి ప్రౌఢతరము – రమణీయము – నని తెలియ నగును. ఈ సంధి – విగ్రహములనే "మహా మహో పాధ్యాయ" బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకట రత్నము పంతుల వారు కూడఁ దెలిఁగించిరి. ఈ కృతక శైలి కంటె సాగళ్యత గల శైలియే ప్రజా సామాన్యమునకు నర్థము కాఁ గల దని యూహించి యప్పటి నుండి సరళ మైన వచన రచన సాఁగించి "గద్య తిక్కన్న" యను ప్రఖ్యాతి వహించి వచన రచనలో నాయక కీ డైన వాఁడు ఆంధ్ర వాఙ్మయమున లేఁ డని యనిపించు కొని నాఁడు.

ఆంగ్ల సాహిత్యమున నీయనకుఁ గ్రొత్త ప్రక్రియ లగపించినవి. తెలుఁగు భాషలో వైవిధ్యము కొఱఁత వడి న ట్లగపించినది. ఆ నూతన ప్రక్రియలఁ దెనుఁగు సారస్వత మునకుఁ దేఁ బ్రయత్నించి కృతార్థుఁ డయినాఁడు.

స్వకపోల మైన కథను సరళ మైన భాషలో వ్రాసిన వారు సకృత్తుగ నున్నారు. కాని వీరికిఁ బూర్వ మొక రిద్దఱు నవలల వ్రాసిన వా రుండినను వీరు 'వికార్ ఆఫ్ వేల్‌ఫీల్డు' అను నవలను దెలుఁగులో 'రాజశేఖరచరిత్ర' యను పేరితోఁ దమ కాలము నాఁటి సాంఘిక పరిస్థితుల నభివర్ణించుచు వ్రాసి తెలుఁగు సాహిత్యములోఁ దొలుతఁ బ్రశస్త మైన నవలను వ్రాసి విఖ్యాతి నందినారు.

కావ్యముల నన్నింటిలో నాటక మతిరమ్య మైనది యను నర్థ మిచ్చు "కావ్యేషు నాటకం రమ్య" మను

వాక్య మగపించుచున్నది. క్రీస్తు శకము ప దేనవ శతాబ్దము వఱకును దెలుఁగున నాటకమే లేదు. విద్యానాథ మహాకవి "ప్రతాపరుద్రీయము"నకు ననుకరణముగ "నరస భూపాలీయము" కాన్పించు చున్నది. అల్లసాని పెద్దనామాత్యుని మనుచరిత్రలో "నాటకశాల మేడ పై నిలువు నిల్చి" యను వాక్యా లగపించు చున్నవి. దీనిం బట్టి యా కాలమున నాటకశాల లుండి యుండవలయు నని ద్యోతించు చున్నది.

తొల్దొల్తఁ గావ్యములు సంస్కృత కావ్యములకు ననుకరణములుగా వెలువడి నట్లుఁగనే వీరేశలింగము గారు సంస్కృ తాంగ్ల నాటకములఁ బెక్కింటి ననువదించి నారు. ఇదియును గాక స్వతంత్ర రచనలు రెండు గూడఁ బ్రకటించిరి. అభిజ్ఞాన శాకుంతలమును వీరేశలింగము గారు తెలిఁగించిన రీతిగా నింతవఱ కెవ్వరును దెలిఁగించి యుండ లే దని ప్రఖ్యాతి నందికొనిరి. ఇది గాక 'రత్నావళి - మాళవికాగ్ని మిత్రములను దెలిఁగించిరి. వీరిలోఁ బ్రాచ్య ప్రాశ్చాత్య భావ సమ్మేళన మగపించు చున్నది. సంస్కృత నాటకములనే గాక ఆంగ్ల నాటకములను గూడ ననువదించిరి. షేక్స్పియరు వ్రాసిన "Merchant of Venice" నాటకమును "వెనీసు వర్తకోదంతము" అను పేరితోడను, "Comedy of Errors" నాటకమును "భ్రమప్రమాద ప్రహసన"మను పేరి తోడను, దెలిఁగించిరి. ఇ వ్విధముగ నాంధ్ర నాటకలోకమునకు నొనర్చిన సేవ అనుపమానమైనది.

వీరేశలింగము గారు సంస్కరణకు సాధనముగాఁ జమత్కరించుట యను వసమును గైకొని ప్రహసనముల రచించిరి.

ఇవి గాక నాచన సోముని యుత్తర హరివంశమునకు ముద్రణ భాగ్యము గల్పించి నది వీరేశలింగము గారే! ఈ గ్రంథము ముద్రించు నప్పుడు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు దృష్టి దోషము కలుగక పోవుట చేత ముద్రాశాల కేఁగి ముద్రింపఁ బడ్డ కాగిదములఁ దెచ్చికొని యా పద్యములఁ గంఠస్థ మొనర్చు చుండెడి వారఁట! గ్రంథము పూర్తిగ నచ్చు కాఁబడిన తర్వాత వీరేశలింగము గా రొక ప్రతినిఁ దెచ్చి లక్ష్మీనరసింహము గారి కీయఁగాఁ, జిలకమర్తి వారు ముసి ముసి నవ్వులఁ గిలుకుచు నందలి నూఱు నూట యేఁబది పద్యముల దాఁకఁ జదివి, తాఁ జేసిన పని చెప్పఁగా, వీరేశలింగము గా రబ్బురం పడిరఁట! అంతటి యుత్తమ కావ్యమిది.

వీరేశలింగము గారు బహు పరిశ్రమ చేసి వేయి పుటల "కవుల చరిత్ర"ను బ్రకటించిరి. దీనిం బట్టి యీాయన తన జీవితమును ఈ కవుల చరిత్ర కే యంకిత మొనర్చి న ట్లగపించు చున్నది. నవలలఁ బచరించుటలో, నాటక రచనలో, వచన రచన సాఁగించుటలో, స్వీయచరిత్ర వ్రాయుటలో, కావ్య విమర్శలో,— వీరే ప్రప్రథములు. తెలుఁగు సారస్వతములో వీరేశలింగము పంతులు గారు సాధించిన వైవిధ్య మిం కెవ్వరును సాధించి యుండ లేదు.

వీరేశలింగము గారెప్పుడును జట్టబద్ధమైన యాందోళన (Constitulional Agitation) యందు విశ్వాసముఁ గలాఁడు కాఁడు. ఆయన జీవిత మంతయుఁ జట్టముల నుల్లంఘించుట తోడనే సరిపోయినది. వితంతూద్వాహములఁ గావించు నప్పుడును, అప్రాప్త వ్యవహార దశ (Minority) వీడని బాలికలఁ దలిదండ్రుల సమ్మతి లేకుండఁగనే తీసికొని వచ్చి వివాహములఁ జేయఁ బ్రయత్నించు నప్పుడును, బాలికాపహరణము నూఁతఁగాఁ గొని యా బాలికల తలిదండ్రు లీయన పయిఁ జర్యల సాఁగించి వారంటుల జారీ చేయించు నప్పుడును, ఆసందర్భమున రక్షక భటోద్యోగులఁ గలసి కొని తన పలుకుబడి నుపయోగించి యా వారంట్లను రద్దు సేయించుకొను నప్పుడును,— ఆయన గావించిన పనులు చట్టబద్ధము లయిన వని తోఁపక పోయినను ఆ చట్టములే తనకు దుష్టము లని తోఁచి నప్పుడు వాని నుల్లంఘించుటలోఁ దప్పు లే దని యాయన విశ్వసించి నట్లగపించు చున్నది.

ఒక నూతన ధర్మము గాని యొక నూతన సిద్ధాంతము గాని యుదయించు నప్పుడు ధర్మ వికాస మొదవిన యొక యుత్తమ వ్యక్తిలో (Highly evolved) మాత్ర మగపించు చుండును. ఇఁక సంఘము లోని విచ్ఛిన్న శక్తులతోఁ, బ్రతీపక శక్తులతోఁ, బోరాడుటకు వీరేశలింగము గారి వంటి వారొక నూతనోద్యమ మారంభించి నప్పుడే రభసయు

బయల్వెడలకుండునా? సంఘమున ధర్మోత్తేజిత మైన మార్పులఁ దెచ్చు నప్పు డిట్టి రభసలు గలుగుటలో నాశ్చర్యము లేదు. వీరేశలింగము గారే కృషిఁ జేసినను ఏ యుద్యమ మారంభించినను, ఏ రచన సాఁగించినను, ప్రజా సామాన్యమును దృష్టి యందుఁ బెట్టుకొనియే నడక సాఁగించినాఁడు గాని వేఱు కాదు. అందు వలననే పండితులను వీరేశలింగము గారు "Worng - headed and Wrong-hearted" అని భావించిరి. కాని తాను మాత్రము వానిని "Right - hearted but Wrong - headed" అని భావింతు నని విమర్శక శిరోమణి శ్రీ రామలింగ రెడ్డి యొకతూరి చెప్పిరి.

వీరేశలింగము గారు వ్యక్తిలో సంస్కారము గలిగించ వలయు నని యెంచక సమాజపుఁ బునాదులనే మార్పుఁ బొందించి నవ సమాజమును నిర్మింపఁ జూచు వారు.

1875 లో అభిజ్ఞాన శాకుంతలమును దెలిఁగించుటకుఁ బూనికొని, రెండంకములు' వివేకవర్ధని' లోఁ ప్రకటించి యవల 1889 వ సం॥రము దాఁక నూరకొని యప్పు డారంభించి పూర్తి చేసిరి. ఈ యనువాదము భిన్న కాలములలో భిన్న దృష్టులతో వ్రాయఁబడిన దౌటచే నాడ నాడఁ గొంతభేద మగపించు చున్నది.

బ్రాహ్మ వివాహము మొదటి రచన. ఇది పంతులు గారి 'హాస్యసంజీవని' యందుఁ బ్రకటింపఁ బడినదియే!

ఈ హాస్య సంజీవని కులాచార రాజకీయములలోఁ బేరుకొని పోయిన దురాచారములను వినోదముగా సంభాషణ రూపమ్మున వెల్లడిచేసి యీ మూలమున దురాచారముల మాన్ప 'వివేకవర్ధని' కి నంతర్భాగముగాఁ బ్రకటింపఁ బడు చుండెడిది. అంతియకాక 'మహామహోపాధ్యాయ' బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకట రత్నము పంతుల వారు గారంభించిన 'హాస్య వర్ధని' కిఁ బ్రతిగ నీ హాస్యసంజీవని బయల్దేఱిన దనవచ్చును. బ్రాహ్మ వివాహము ప్రకటింపఁ బడిన వెంటనే "వ్యవహార ధర్మబోధిని" యను నింకొక యైఁ దంకముల నాటక మును గ్రామ్యభాషలో రచించి ప్రకటించిరి. ఆ కాలమున దీని నిట్లు వ్రాయుట సాహసమే యయ్యెను విశిష్టతను సంపా దించుకొన్న నాటక మగుటచేఁ దెనుఁగు నాటకములలో 1880 లో శ్రీ విజయనగర మహారాజులుం గారి బాలికా పాఠశాలలోఁ బ్రదర్శన భాగ్య మందిన మొదటి నాటకమని చెప్ప వచ్చును. ఇది ప్రదర్శనమున కుద్దేశించి వ్రాయ కున్నను "By the way we may mention these that prose dramas like Brahma Vivaham and వ్యవహార ధర్మ బోధిని will be most acceptable to the Oriental Dramatic Co., as they are in sore want of popular dramas adopted to the stage." అని హిందూపత్త్రిక యభిప్రాయ మిచ్చుటచేఁ బ్రదర్శన యోగ్యమైన దనియు తలంప నగును. ఈనాటకములు విజయప్రదముగఁ బ్రదర్శింపఁ బడి విచక్షణులచేఁ బొగడ్త నందుటచేఁ బంతులు గారికి నాటక సమాజ మొకటి స్థాపింప వలయు నను నిచ్ఛ వొడమి

వడి. కాఁగా, 1880 లో చివఱ భాగమున నొక నాటక సమాజమును స్థాపించి ధార్వాడ నాటకాలు వచ్చి నాటకము లాఁడి పోయిన పాకలోనే రత్నావళి – చమత్కార రత్నావళి యను రెండు నాటకముల నాఁడించిరి. అందువలనఁ దెలుఁగు దేశమునఁ దొలి నాటక సమాజమును నెలకొల్పిన విఖ్యాతియు వీరేశలింగము గారికే దక్కినది.

చమత్కార రత్నావళి రత్నావళితో పాటు రచించిరి. కాని మొదటి యంకములోని కొంతభాగము 1875 లోనే వివేకవర్ధని యందుఁ బ్రకటింపఁ బడినది. ఇది ద్విపదలోనే వ్రాయఁ బడినది. ఇది "Comedy of Errors" అను షేక్స్పియరు నాటకమున కనువాదము.

వివేక దీపిక స్త్రీ పునర్వివాహమునకు సంబంధించిన ప్రచార నాటకము. ఇదియును గద్య నాటకమే! ఇది 1880 దవ సం॥రముననే రచింపఁ బడిన దఁట!

షేక్స్పియరు మహాకవి రచించిన "Merchant of Vinice" అను నాటకమునకు ననువాదము వినీసువర్తక చరిత్రము. ఇదియును ద్విపదలోనే 1880 లోనే వ్రాయఁ బడినది. ఇ య్యనువాదమున సారళ్యత లోపించినది. ఆ సం॥రము నందె శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులు గారు కూడ దీనిం దెలిఁగించిరి. 1906 లో "వణిక్పుర వర్తకోదంతము" నను పేరుతోఁ గొప్పార న్యాయవాదులు, 'కవి శేఖర' బిరుదాంకులు నగు బ్రహ్మశ్రీ తల్లాప్రెగ్గడ సూర్యనారాయణరావు బి.ఏ., ఎం.ఆర్.ఏ.యస్; గా రనువదించిరి.

1885 లో మాళవికాగ్నిమిత్రము, ప్రహ్లాద, ప్రబోధ చంద్రోదయము, రాగమంజరి, దక్షిణ గోగ్రహణము లను నాటకముల నయిదింటిని రచించిరి. ఈ సం॥రము వేసవిలో శ్రీ లొల్ల రామశాస్త్రి చనిపోవుటచేఁ బంతులుగారు ప్రధానాంధ్రోపాధ్యాయు లయిరి. ఈ సం॥రమున మాళవికాగ్ని మిత్రము మొదట రచించిరి. 1924 లో "మాళవికా నాటక" మను పేరితో కవిశేఖర బ్రహ్మశ్రీ ములుగు చంద్రమౌళి శాస్త్రి (తెనాలి) గారు ప్రదర్శన సౌలభ్యమును మది నిడి కొని చాల మార్పులతో రచించిరి.

ఆవల రచించినది ప్రహ్లాద నాటకము. ఇది యై దంకముల స్వతంత్ర పౌరాణిక నాటకము. ఆ పిమ్మట ప్రబోధ చంద్రోదయమును 1885 లోనే యనువదింపఁ బ్రారంభించి యొక యంకమును మాత్రము వ్రాసి వివేక వర్ధనిలోఁ బ్రకటించి, యవల 1891 లో మరల నారంభించి, వివేక వర్ధని యాఁగి పోవుటచేఁ 'చింతామణి' పత్రికలోఁ (ఈ పత్రిక ఆంధ్రభీష్మ శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులు గారు ప్రారంభించినది) గొంత కొంతగాఁ బ్రకటించుచు నా సంవత్సరము జూన్‌లో పూర్తిచేసి ప్రకటించిరి. ఈ ప్రబోధ చంద్రోదయము అద్వైత మత సిద్ధాంతమును బ్రతిపాదించుట కయి రచింపఁ బడినది. ఇందు వివేకునకును — మహామోహునకును — ఘోరు ఘటిల్లి తుదకు వివేకునకు గెలుపు కలిగి న ట్లభివర్ణిత మైనది. దీనిని 'కవిశేఖర' బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బరాయఁడు గారును దెలిఁగించిరి.

ఇఁక నాలుగవది రాగమంజరి. ఇది "షెరిడన్" అను నాంగ్లకవి రచించిన "డ్యూయెూన్నా" యను కథ ననుసరించి వ్రాయఁ బడినది. ఇక్కథ యెంత రమణీయముగ నున్నను సామాన్య జనులు గ్రహించుటకు వీలు గా కుండుటచేఁ బొందఁ దగ్గ యానందము పొంద లేక పోయిరి. 'షెరిడన్' తన కాలపు సంఘాచార వ్యవహారముల నవహేళన మొనర్చుటలో సిద్ధహస్తుఁడు. వీరేశలింగము గారును దమ కాలపు టాచార వ్యవహారములను నిశితముగ నిందు విమర్శించిరి. ఇఁక నైదవది దక్షిణ గోగ్రహణము. గద్య పద్యాత్మకము. రాగమంజరి వలెఁ గాక ఈ భారత కథకు మన జను లలవాటు వడిరి.

1886 వ సంవత్సరమున సత్యహరిశ్చంద్రను రెండు మూఁడు వారములలో నాలుగంకములు వ్రాసి వివేక వర్ధనిలోఁ బ్రకటించి ఆవల 1889 లో పుస్తక రూపమునఁ బ్రకటించిరి. 1883 లో "విమర్శక శిరోమణి" శ్రీ తేవప్పెరుమాళ్లయ్య హరిశ్చంద్ర నాటకమును రచించి ప్రకటించినట్లు "ఆంధ్ర వాఙ్మయ సూచిక" సూచ్యార్థ సూచనఁగాఁ దెలుపు చున్నది గాని యా గ్రంథ మగపించుట లేదు.

1889 దవ సంవత్సరమున "మహారణ్య పురాధిపద్యము" "తిర్య గ్విద్వ న్మహాసభ" నను గ్రంథములను రచించిరి. "తిర్య గ్విద్వ న్మహాసభ" పంతులుగారి మిత్రులు శ్రీ బసవరాజు గవర్రాజు గారు సనిపోయి నప్పు డాయన చుట్టాలను పురోహితాదులు పెట్టిన బాధలఁ దిలకించి వారి

దుశ్చర్యల నెల్ల నాక్షేప గర్భ సంభాషణమున వ్రాయఁ బడి నట్టిది. ఇది భారత మండలి గృధ్ర - జంబుకోపాఖ్యా లమును గైకొని వ్రాయఁ బడినది - "మహారణ్య పురాధి పత్యము" నను గ్రంథము సైత మాక్షేప గర్భ నాటకమే ! నక్క నీలికుండలోఁ బడి తన దేహమున కంటు కొన్న నీలి రంగు ననుసరించి తన చుట్టాలను మోసఁగించి తన్నుఁ రాత్రి దేవతలు స్వర్లోకమువకుఁ గొంపోయి మృగరాజ్యమున కభి షేక మొనర్చి నీలవర్ణము ననుగ్రహించి పంపి రని యసత్య మాఁడి యాతని సాహాయ్యమున మృగరా జయి తుదకు నిజము బయట పడఁగా, నొక వ్యాఘ్రముచేఁ జంపఁ బడియె నన్న పంచతంత్రపుఁ గథను గైకొని వినోదార్థము రచించినది.

ఇఁకఁ బంతులుగారి నాటకములలోఁ జివ ఱది "షెరిడన్" అను నాంగ్లకవి రచించిన The Rivals అను గ్రంథమునకుఁ దెలుఁగు సేఁత రాగమంజరి. ఇతి వృత్త మత్యంత మనోహరముగా నుండును. ఇవి 1894లో ముద్రింపఁ బడినది. వీరేశలింగము గారు రచించిన పదునాఱు నాటకము లలో బ్రాహ్మ వివాహ - వ్యవహార ధర్మ బోధిని- తిర్యగ్విద్వ న్మహాసభ - మహారణ్య పురాధిపత్యములు నాలుగును ప్రహ సనములు. స్వతంత్ర రచనలు. రత్నావళి - అభిజ్ఞాన శాకుం తలము - మాళవికాగ్ని మిత్త్రము - ప్రబోధ చంద్రోద యము - నను నాలుగును సంస్కృతమునకుఁ దెలిఁగింపులు. చమత్కార రత్నావళి - వినీసు వర్తకోదంతము - రాగ

మంజరి - కళ్యాణ కల్పవల్లి - యను నాలుగును నాంగ్ల రూపకానువాదములు. వివేక దీపిక - స్వతంత్ర ప్రచార నాటకము. శేషించిన ప్రహ్లాద - దక్షిణ గోగ్రహణ - సత్యహరిశ్చంద్ర నాటకములు మూఁడును స్వతంత్ర పౌరాణిక నాటకములు.

1886 సంవత్సరము మార్చి 31 వ తేదీన 'వివేక వర్ధని' లో శ్రీ ఆత్మూరి లక్ష్మీనృసింహం గారిని గుఱించి "దంభాచార్య విలసనము" నను ప్రహసనమును ప్రకటించిరి - అపూర్వ బ్రహ్మచర్య - విచిత్ర వివాహ - మహా బధిర - కలహప్రియ - మహామహోపాధ్యాయ - యోగనిద్ర - మహా వంచక - అసహాయ శూర ప్రహసనములు పదియు నాంగ్ల గ్రంథముల ననుసరించి మన తెలుఁగు వాండ్ర రుచినిఁ గనిపట్టి రచించినవి. కలి పురుష శనైశ్చర విలాసము - వేశ్యాప్రియ ప్రహసనము - కౌతుక వర్ధని - వినోద తరంగిణి - యను నవి వీరేశలింగము గారి స్వకపోల కల్పితములు.

రాజమహేంద్రవర మండలి గోదావరి కాంగ్రెసు సభలోఁ గ్రీస్తు శకము 1888 లో వీరేశలింగము పంతులు గారు "దేశీయ మహాసభయు దాని యుద్దేశములు" నను విషయమును గుఱించి యుపన్యసించుచు దేశీయులకు నధిక స్వాతంత్ర్య మిచ్చుట వలన లాభ మధికముగ నుండు నని నొడివిరి. రాజకీయ వ్యవహారములను గుఱించి ప్రస్తావించు నాంధ్ర గ్రంథములకు నిదియె మార్గదర్శి. ప్రజలలో

నన్యో న్యానురాగ భావము పెంపొందుటకు సభల యావశ్య కతను గుఱు తెఱింగి వీరేశలింగము పంతులుగారు శ్రీ విక్టోరియా మహారాణి రజతోత్సవ సందర్భమునఁ (Jubilee) బురమందిరమును క్రీ. శ. 1890 లో రు 8 వేల రూపాయలతోఁ గట్టించి రాజమహేంద్రవర పుర జనుల కైవస మొన ర్చిరి. ఈ పురమందిర నిర్మాణ ప్రయత్నములో 'వివేక వర్ధని' యాఁగిపోయినది. ఈ రీతిగనే ప్రార్థన మందిరమును కూడఁ గ్రీస్తు శకము 1897 వ సంవత్సరమునఁ గట్టించి యచటి ప్రార్థన సమాజము వారికి నిచ్చి వైచిరి.

నెలకు నలుబది రూపాయల జీతముతో నున్న వీ రిట్టి మహాత్కార్యము సేయ నెంచుటకు దేశాభిమానమే కారణ మని చెప్ప వలయును. పంతులు గారు రాజమహేంద్రవర పురపాలక సంఘమునఁ జాలకాలము సభ్యులుగను, అధ్యక్షు లుగను, నుండి యెక్కువ శ్రద్ధతోఁ బాటుపడి తమ శక్తి ప్రాభవములను బ్రకటించి కొనిరి, అందువలనఁ బ్రిభుత్వము వారు క్రీ. శ. 1893 లో "రావు బహద్దరు" బిరు దొసంగి వీరిని గౌరవించుటఁ దలపెట్టించినది.

క్రీ. శ. 1894 లో చెన్నపట్టనమునఁ బత్త్రికా ప్రచా రమునకును సంఘసంస్కరణోద్యము ప్రచారమునకును, రాజ ధానియె యనుకూల మని తలఁచి యట మేడ నొక దానిం గట్టించెను. క్రీ. శ. 1897 లో రాజమహేంద్రవరము సర్వ కళాశాలలో రెండేండ్లు సెలవుపెట్టి చెన్నపురి కేఁగి సొంత

ముద్రాక్షరశాల ( press ) ను స్థాపించి, చింతామణి" యను పేర నొక పత్త్రిక నారంభించి, తానే నిర్వహింపఁ జాగెను. ప్రారంభించిన యనతి కాలంబుననే పంతులుగారు చెన్నపురి యం దఖండ ప్రతిష్ఠ నార్జింపఁ గలిగెను. వీరి ననుసరించు వా రెందఱో యేర్పడిరి. కాని ప్రతిఘటించు వారును మిక్కుటమైరి. కాని వీరేశలింగము గారు దీక్షాబద్ధకంకణు లై వితంతులఁ బెక్కండ్రఁ దన యింటనే పోషించుచు, వితంతూద్వాహములఁ బెక్కింటిని జరపించెను. ఆయన యిల్లే వితంతు శరణాలయ మయ్యెను.

ఆలో, వీరి సెలవు పూర్తి యాటచే మరల రాజమహేంద్రవరము పోవలసి వచ్చెను గాని విద్యా విచారణాధికారి మిస్టర్ డంకన్ దొరతో వీరికిఁ బరిచయ మొదవుటచేఁ ద ద్భాగ్యమునం జేసి వీరికిఁ దెలియకుండఁగనే రాజమహేంద్రవరము నుండి చెన్నపురి రాజధాని కలాశాల (Presidency College) కు వీరు తరలింపఁ బడిరి. ఆ కారణమునఁ జెన్నపట్టనమున రాజధాని కలాశాల (Presidency College) లో నాంధ్ర పండిత పదవి నధిష్ఠించెను. ఇ య్యుద్యోగములో వీరికిఁ బూర్వముం బలె సభలు, నుపన్యాసములు, వ్యాసములు, ప్రచారములు, లోనగునవి సాఁగించుటకుఁ దీరిక లే దయ్యెను.

క్రీ. శ. 1898 దవ యేఁటఁ జెన్నపట్టణమున జరిగిన సాంఘిక మహాసభ (Social Conference) కు అధ్యక్షుఁ

ుఁగా నెన్నికోఁ బడియెను. ఆ సభలో నీయనకు "దక్షిణ హిందూదేశ విద్యాసాగర" బిరుదును న్యాయమూర్తి, చరిత్ర రచనా ధురీణ శ్రీ మహాదేవ గోవింద రానడే యొసంగి, గౌరవించి, సన్మానించిన తర్వాతఁ గాకినాడలోఁ గ్రీస్తు శకము 1902 లో జరగిన దేశీయ సాంఘిక మహాసభ (National Social Conference) కును, బెజవాడ యందుఁ గ్రీస్తు శకము 1903 లో జరగిన హిందూదేశ ఆస్తిక మహాసభ (Hindu Desa Astika Maha sabha) కును, వరుసగ వీరేశలింగము పంతులు గారే యధ్యక్షులుగ నెన్నికోఁ బడిరి. చెన్నపట్టనమున "సంఘ సంస్కార సమాజము" నను దాని నెలకొలిపి, వెంటనే రాజమహేంద్రవరమున నాఁడు వాంద్రకుఁ బ్రత్యేకముగ నొక ప్రార్థన మందిరము నిర్మింప ద్రవ్యమును బంపెను. చెన్నపురమున నీయన సాధింపఁ దలఁచిన వెన్నియో యుండినను నచటి సంఘ వాతావరణ మీయనకుఁ దగినంత యుత్సాహప్రక్రియఁ గల్పింపక పోవుట చేతను, రాజమహేంద్రవరము పయిం గల మమకార మధిక మౌట వలనను, నుపకార వేతనము (Pension) మీఁదఁ గ్రీ. శ. 1904 లోఁ దన యుద్యోగము నుండి విరమించి చెన్నపట్టనమునఁ దా నార్జించిన యాస్తి పాస్తుల నెల్ల విక్రయించి ముద్రాక్షర శాల (press) ను మాత్రము వెంటఁ దీసికొని క్రీ. శ. 1905 దవ సం॥రమున రాజమహేంద్రవరమునకు మరలి వచ్చెను. మరలి వచ్చిన కొన్నాళ్ళకు శ్రీ విక్టోరియా బాలికా పాఠశాల (Sri Victoria Girls School)

యను పేరితో నొక పాఠశాలను నెలకొలిపి, యందు బాల విధవలు శరణాలయ వితంతువుల వలెఁ గాక యూరి లోని బాలికలు గూడఁ జదువ నట్లేర్పాటు సేయించెను. కాని కులస్త్రీ లందుఁ జేర వెనుకాడుటను జూచి జనానా తరగతు లని పేర్వేర్పాటి తానే వారికిఁ బాఠములఁ జెప్పుచుండెడివాఁడు.

ఈ పాఠశాలకుఁ దన సొంత ద్రవ్యముతో నొక చక్కని తోఁటఁ గొని యందె తాను గూడఁ గాఁపుర ముండుచుండెను. ఆ తోఁట యందె యొక ధార్మికుఁడు నిర్మించిన మందిరముల రెండింటిలో నొకటి వసతి గృహము (Hostel) గను, మఱియొకటి పాఠశాలగను,- వితంతువుల కేర్పఱచి, స్త్రీ విద్యా వ్యాపనకై శ్రమించి నాఁడు.

ఈయనకు సొంత ముద్రాశాల ( Own Press ) యుండుట వలన 'సత్యవాదిని' యను వారపత్త్రికను క్రీస్తు శకము 1905 లో నెలకొలిపి, యందు సంఘ దురాచారముల శతథా ఖండించుచు, నిర్భయముగ నాంగ్లాంధ్ర భాషలలో వ్రాయుచు, సంస్కరణాభిప్రాయముల వెల్లడించుచు, రెండేండ్లలో నడపఁ గలిగెను. ఆవలఁ బత్త్రిక నిలుపుటయు, ముద్రాశాల విక్రయించుటయు,- జరగెను.

రాజమహేంద్రవరము ఇన్నీసుపేటలోఁ క్రీస్తు శకము 1908 దవ సంవత్సరమున వీరేశలింగాస్తిక విద్యాలయ (Veeresalingam Theistic School) మారంభించిన తర్వాత శ్రీ శ్రీ పీఠికాపుర మహారాజులుం గారు డెబ్బది

వేల రూపాయలు విరాళ మీయఁగా, ఆ ద్రవ్యముతో నొక విశాల భవనమును, సందుండ వలసిన యుపకరణములను, జేకూర్చి క్రీ. శ. 1911 వ సంవత్సరములో ఈ పాఠశాలను 'High School' గా మార్పుఁ జేసి వృద్ధి పఱిచెను. ఆ యున్నత పాఠశాల యిప్పటికిని దినదినాభివృద్ధి నొందుచు నాదర్శప్రాయముగఁ దేజరిల్లు చున్నది. ఇ విద్యాలయ మును, వితంతు శరణాలయమును, — పంతులు గారి పేరు చిరస్థాయినిఁ జెందించు చున్నవనుట యం దతిశయోక్తి లేదు.

ఆవలఁ గతిపయి దినంబులకు వీరేశలింగము పంతులు కలకత్తా, మైసూరు, బరంపురము, బెంగుళూరు, సికింద్రా బాదు, బొంబాయి, చెన్నపట్టనము, – మొదలగు ప్రదేశ ముల కేఁగి సంస్కరణోద్యమ ప్రభావములఁ జాఁటి యచటి పుర ప్రముఖులచే సమ్మాన పత్రముల నందికొని ప్రశంసలఁ గాంచెను. క్రీ. శ. 1908 దవ సంవత్సరమున పంతులు గారి షష్టిపూర్త్యుత్సవము రాజమహేంద్రవరమున మహావైభవ ముగ, నాదర్శ ప్రాయముగ, జరగినది. క్రీ. శ. 1910 దవ సంవత్సరమున ఈయన ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మ గారు ఆకస్మికముగఁ జనిపోవుట వలన నీయనకు విపత్పరంపరలు దాపురించిన వన వచ్చును. వార్థకమునఁ బత్నీ వియోగ మొదవుటచేఁ దనకు సాహాయ్యపడు వారు లేక యీయన

చలించి పోయెను. ఈయన చరమ దశ యంతయు నింద లతో - అభియోగములతో - బాధలతో - శత్రు వీక్షణములతోఁ - గడచి క్రీ. శ. 1919 దవ సంవత్సరము మేనెల 27 వ తేదీన ఇహలోక యాత్ర చాలించెను.

1916 వ సంవత్సరము 19 దవ తేదీన గోదావరీ తీరంబునఁ గల "కొవ్వూర" "ఆంధ్ర సారస్వత పరిషత్తు" నేర్పఱుపఁ గారకులలో వీరేశలింగము పంతులు గారొకరు. 1917 వ సంవత్సరమున రాజమహేంద్ర వరమున జరగిన పరిషద్వార్షిక సభకుఁ బంతులు గారే యధ్యక్షులు.

తమ యశః కాంతుల దిగంతములకుఁ బ్రసరింపఁ జేయఁ గల్గి కాలవాహినిలో లీన మైన యి మ్మహామహుల విస్మరించక వారిని సర్వకాలముల స్మరించుచు ననుకరింపఁ యత్నించుట మానవ ధర్మము గదా! ఆంధ్ర జాతీయ వికాస విజృంభణములకు మూల విరాట్టగు ని మ్మహాపురుషుని సంస్మరించుచు విరమించు చున్నాఁడను.



# నా ఇతర రచనలు

1. ప్రాచీన హిందూదేశ రాజ్యాంగ చరిత్ర
2. కన్నడదేశ చరిత్ర
3. దండనాథులు
4. సచివోత్తములు
5. దుర్గాధిపతులు
6. ప్రాచీన గ్రామసభల న్యాయ్యపరిపాలనము
7. సమగ్రాంధ్ర వ్యాకరణావశ్యకత
8. దేశబంధు చిత్తరంజనదాసు
8. స్త్రీరత్నములు
10. చరితార్థులు
11. చరిత్ర పరిశోధకులు
12. ఆంధ్ర ప్రతిభ

[illegible]ోనగునవి.

వలయువారికి వ్రాయుడు :—

[illegible]లితా నివాసమ్,

నాగేశ్వరపురము, బాపట్ల